# ముందు మాట

ఈ పుస్తకాన్ని యింగ్లీషులో, నేను తంజావూరుజైలులో డిటెన్యూగా వుండగా (1944) వ్రాసినాను. అచ్చటజేరిన 500 డిటెన్యూలమధ్య అనేక విద్యాలయాలు సాగింపబడినవి. ప్రధాన విద్యాలయము రాజకీయార్థిక విషయములపై శ్రీ పాకాల వెంకట్రామనాయుడు, వోబులురెడ్డిగారలు యేర్పరిచిరి. అందు ప్రధానాచార్యులుగావుండే అదృష్టము నాకు కల్గినది. ఆబాధ్యత నిర్వహణమందు యివ్వబడిన వుపన్యాసములలో కొన్ని ప్రస్తుతము యీ రూపేణా ప్రకటించుచున్నాము.

యిందు చర్చించిన విషయాలెన్నో కలవు. అవన్ని అనుభవముపై ఆధారపడియున్నవి. శాస్త్రము వాటికి బలమిస్తావున్నది. భారతదేశపు ఆధునిక రాజకీయార్థిక చరిత్ర వాటిని నిరూపణ చేస్తున్నది మూలోంట్ల రైతాంగ సంఘనిర్మాణము, వుద్యమసేవ యీ పుస్తకపు ప్రధాన తీర్మానములకు ముఖ్యసాక్ష్యమై యున్నది.

ఎందుచేత భారతీయ ప్రపంచపు రైతాంగము కమ్యూనిస్టు పథ్యాలపై ఆధారపడరాదో, వారిరాచక్రముపు ఎత్తులకు లోబడరాదో యిందు సోదాహరణముగా తెలుపుచున్నాను. కమ్యూనిస్టులు ప్రపంచ రైతాంగమును, భ్రమర కీటక న్యాయమువలె, ప్రపంచకూలీలుగా మార్చగలమని విశ్వసిస్తూ, మారుట అవసరమని తలుస్తూ, మారక తప్పదని చదువుకొంటూ, రైతాంగమును ప్రత్యేకశ్రామిక వర్గముగా పరిగణించ నిరాకరిస్తున్నారు.

కమ్యూనిస్టులకు కూలీనియంతృత్వమే కావలసినది. దానియందే వారికి విశ్వాసము.

రైతులకు రాజ్యాధికారము సంపాదించుటకై వారు పాటుపడరు. రైతులకు రాజ్యాధికారము రష్యాయందులేదు. కూలీలతరపున కూలీలచేత, కూలీలనాయకత్వముక్రింద, రాజ్యాధికారాన్ని సాగింపుతూ, రైతులకు కొలదిగానో, గొప్పగానో భాగం పెట్టుటాగానే లోగడి వారిది.

రైతాంగతత్వము కమ్యూనిస్టులకు పడదు. పెట్టుబడిదారులలో అంత్యవర్గము, లేక అంతస్థురైతాంగమని వారి వెర్రివిశ్వాసము.

కనుకనే, తామూ రైతులమనుమంటూ, తమకూ రైతు వుద్యమమందు విశ్వాసమున్నదంటూ, రైతువుద్యమమందు, సంఘము

| | | |
|---|---|---|
| 7 | పర్వతనేని రామయ్యగారి కుమారుడు రామకోటయ్యగారు | 50-0-0 |
| 8 | కొత్త నాగయ్యగారు | 50-0-0 |
| 3 | వీరమాచనేని వెంకటరత్నంగారు | 50-0-0 |
| 10 | ముక్కామల సీతయ్యగారు | 30-0-0 |
| 11 | [illegible] కోటయ్యగారు | 25-0-0 |
| 12 | ,, సుబ్బారాయుడుగారు | 25-0-0 |
| 13 | వీరమాచనేని సీతయ్యగారు | 25-0-0 |
| 14 | పర్వతనేని వెంకటరత్నంగారు | 25-0-0 |
| 15 | ,, [illegible] పూర్ణ[illegible]గారు | 25-0-0 |
| 16 | ,, చినరామయ్య చౌదరిగారు | 25-0-0 |
| 17 | ,, సూర్యప్రకాశరావుగారు | 25-0-0 |
| 18 | సూర్యదేవర నాగభూషణంగారు | 25-0-0 |
| 19 | కోనేరు కోటయ్యగారు | 25-0-0 |
| 20 | పర్వతనేని వెంకటనాగభూషణంగారు | 25-0-0 |
| 21 | కాశీనాధుని చంద్రశేఖర ప్రకాశమ్ అయ్యవారుగారు | 20-0-0 |
| 22 | కొమ్మారెడ్డి నాగభూషణంగారు | 20-0-0 |
| 23 | వెల్లంకి గోపాలకృష్ణయ్యగారు | 20-0-0 |
| 24 | దేవునేని పున్నయ్యగారు | 15-0-0 |
| 25 | ,, వెంకట్రా[illegible]గారు | 15-0-0 |
| 26 | పర్వతనేని వెంకట్రామయ్య & బ్రదర్సు | 25-0-0 |
| 27 | చలసాని కోటయ్యగారు | 15-0-0 |
| 28 | పర్వతనేని కోటయ్యగారు, | 25-0-0 |
| 29 | ,, నాగభూషణంగారు | 25-0-0 |
| 30 | ,, వెంకటరత్నంగారు | 20-0-0 |
| 31 | ,, సుబ్బారావుగారు | 10-0-0 |
| 32 | సూర్యదేవర తిరుపతయ్యగారు | 10-0-0 |
| 33 | ,, వెంకయ్యగారు | 10-0-0 |
| 34 | కోనేరు కోటయ్యగారు | 10-0-0 |
| 25 | వీరమాచనేని వెంకటేశ్వరరావుగారు | 10-0-0 |
| | ,, రామకోటయ్యగారు | 10-0-0 |
| 37 | ముక్కామల రంగయ్యగారు | 10-0-0 |
| 38 | చిగురుపాటి పూర్ణచంద్రరావుగారు | 10-0-0 |
| 39 | పర్వతనేని రామబ్రహ్మంగారు | 10-0-0 |

# రైతాంగ విప్లవ విజృంభణ

ఈనాడు భారతదేశంలో రెండు రైతుసంఘాలున్నాయి. వాటిలో ఒకదానిని దేశభక్తులైన రైతులు నడిపిస్తున్నారు; రెండోదానిని కమ్యూనిష్టుపార్టీ నడిపిస్తున్నది. అందుచేత కమ్యూనిష్టుపార్టీ, దాని సభ్యులూ, దాని సానుభూతిపరులు, ప్రపంచంలోని అన్నిదేశాల కర్షకవర్గాన్ని, ముఖ్యంగా భారత కర్షకవర్గాన్ని, పూనుకొని, పనిచేసి వారి సర్వతోముఖ ఔన్నత్యంకోసం పాటుపడగలరని నమ్మవచ్చునో లేదో మనం పరీక్షించవలసిన అగత్యం కలుగుతున్నది.

అయితే, నూటికి నూరుపాళ్లూ జాతీయాభిమానం ఉన్న దేశభక్తులు రైతువర్గసంస్థలను జాతీయమార్గాలలో, భారతజాతీయ మహాసంస్థ — కాంగ్రెస్ — రాజకీయ నాయకత్వమునకు అనుగుణ్యంగా నడపించినంతకాలము ఒక సంస్థ సరిపోయింది. భారత జాతిఏకైక ఆకాంక్ష, స్వరాజ్యము. ఈ ఆకాంక్షయే లక్ష్యంగా, సహాయంగా, తమవర్గ సంస్థలను అభివృద్ధిచేసి తీర్చిదిద్దుకోగలమనినమ్మినంత కాలమూ భారత స్వాతంత్ర్య లక్ష్యములయెడల భారతరాజకీయ సంస్థ - కాంగ్రెస్ - నాయకత్వముపట్ల కమ్యూనిష్టుపార్టీ భక్తి గౌరవాలను ప్రదర్శించినంత కాలమూ ఈ 60 సంవత్సరముల పోరాటములో, బాధా సహనములో, భారత జాతీయత ఒక విశిష్టరూపాన్ని పొందిందని ఆపార్టీ నమ్మినప్పుడూ భారత రైతువర్గం, కమ్యూనిష్టు

పార్టీ లాంటియితర రాజకీయ పక్షములకు తమ సంస్థలో స్థానమిచ్చింది; రైతులు తమ వర్గానికీ, కాంగ్రెసేతర వర్గాలకూ స్వాతంత్ర్య సంపాదన విషయికములుగాని తదితర ఆశయ విభేదాలను మరిచిపోయి వారితో చేతులుకలిపి కిసాన్ కార్యరంగాన పనిచేయడానికి ఒప్పుకున్నారు. సర్వవ్యాప్తమైన భారత జాతీయ సమరంపట్ల తమకున్న అపార ప్రేమలో, తమకూ కమ్యూనిష్టుపార్టీకి ఉన్న ప్రాథమిక భేదములనుకూడా మరిచి, వాటియెడల ఉదాసీనభావం వహించారు రైతులు.

అయితే, యిలా చెయ్యడం వారొక్కరేకాదు వారితో పాటు కాంగ్రెస్‌సంస్థకూడా కమ్యూనిష్టుపార్టీని తనసంఘాలలో బలపడనిచ్చింది.

కాని ఒకనాడు "బ్రిటిష్ భారతదేశ స్వాతంత్ర్యాన్ని గుర్తిస్తేనే యుద్ధకార్యనిర్వహణకు భారతీయుల సహకారము" అని జాతీయసంస్థ — కాంగ్రెస్ — ఒకవైపు ప్రతిపాదించినప్పుడు కమ్యూనిష్టుపార్టీ, దేవరతుగా "ప్రజాయుద్ధం" అనేపేరుతో కాంగ్రెస్ పకు వ్యతిరేకంగా పనిచేసి కాంగ్రెస్ స్వరాజ్య సంపాదనకోసం జాతీయ సమరాన్ని ప్రవేశపెడదామనే ఆగస్టు తీర్మానాన్ని ప్రతికూలించి నిలబడి 1942—44 లలో సామ్రాజ్యవాదం దాడికి ఎదురుగా నిర్మించిన జాతీయ రక్షణలను నాశనంచేసీ సామ్రాజ్యవాదానికి పంచమాంగదళంగా పనిచేసీ, నిర్దాక్షిణ్యమూ, నిరంకుశమూ అయిన సలహాదారుల ప్రభుత్వానికి అండగానుండీ, సామ్రాజ్యవాదయుద్ధ యత్నానికి సర్వతోముఖసహాయాన్నిచ్చీ "మహాజాతీయ విద్రోహాన్ని" ప్రదర్శించింది. ఆనాడు దేశభక్తులూ, జాతీయవీరులూ హృదయపరీక్ష చేసుకోవలసివచ్చింది. భారతకర్షకజాతే భారతజాతీయోద్యమానికి అధిక సంఖ్యాయుతమైన, అతిధైర్యయుతమైన, ప్రథమశ్రేణి; కమ్యూనిష్టు విద్రోహాచర్యలవల్లా, సామ్రాజ్యవాదులదమననీతివల్లా అధికంగా బాధపడినది రైతులే. కమ్యూనిష్టుపార్టీ అకస్మికంగా, భయంకరంగా కర్షకజాతిని వెన్నులో పొడిచింది; ఇంటా బయటా ఉన్న శత్రువర్గాలకు చేయూతనిచ్చింది. అందుచేత కర్షకవర్గము, తనకూ, కమ్యూనిష్టుపార్టీకీ ఉన్న సంబంధాన్ని, అనుభవాలని ప్రథమంగా పరిశీలించుకోవలసివచ్చింది. కర్షకజాతి తనకూ కమ్యూనిష్టు

పార్టీకి గల ఆశయభేదాలను మరచి, ప్రదర్శించిన మర్యాదకు ఆపార్టీ ఇచ్చ్వాడు మహా నికృష్టంగా తయారై. స్వదేశాభిమానమైనా లేక ద్రోహచింతనలకు పాల్పడ్డది. కాగా కర్షకలోకం కమ్యూనిస్టుపార్టీ వంటి జాతీయ విరుద్ధములైన సంస్థలతో తెగతెంపులు చేసుకోవలసిన అవసరం ఏర్పడింది.

ఇలాంటి విచారకరమైన అనుభవాలకు లొగ్గి తెలివివచ్చి 1942 లో పూర్వపు కిసాన్ సభపలెగాక కమ్యూనిస్టు పార్టీ ప్రాభవ ప్రాప కాలు ఏమాత్రమూ లేని "కిసాన్ కాంగ్రెసు" జన్మించింది.

భారతదేశంలో జాతీయ విద్యార్థులకూ, యువకులకూ, వాణిజ్య సంఘాలకూ కలిగిన అనుభవము కూడా ఇలాంటిదే; వారూ కిసానుల మార్గాన్నే త్రొక్కారు. అందుచేతనే యీనాడు కమ్యూనిస్టులచే నడుపబడే ఆయా వర్గ సంస్థలకు ప్రతిగా జాతీయ పంథాలో నడుపబడే విద్యార్థి కాంగ్రెస్, యువజన కాంగ్రెస్, జాతీయ పారిశ్రామిక కాంగ్రెస్ కూడా ఉన్నాయి

1935 లో ఆచార్య రంగా, మోహన లాల్ గౌతమ్ మొదలైనవారు భారత కిసానుల కోసం అఖిలభారత కిసాన్ సంస్థను నిర్మించడానికి పూనుకొన్నారు. 1936 ఏప్రిల్ లో లాహోరులో కిసాను మహాసభను సమావేశపరచారు. అఖిలభారత ప్రాతిపదిక మీద నిర్మించబడిన ఆ మహాసంస్థ జాతీయ కాంగ్రెస్ యొక్క రాజకీయ సాంఘికాదర్శములపట్ల భక్తి గౌరవాలు ప్రదర్శించాలని, అది జాతీయులైన భారతీయులకూ, దేశభక్తియుతులైన రైతులకూ శక్తిప్రదీపక సంస్థగా ఉండాలని. దానికి "కిసాన్ కాంగ్రెస్" అని నామకరణం చేశారు. ఈ మహాసంస్థ ఆదర్శములగురించి ఆచార్య రంగా 1936 లో ఫైజ్‌పూర్ సమావేశంలో అధ్యక్షపీఠంనుంచి ఉద్ఘాటించారు. "కిసాన్ కాంగ్రెస్, పారిశ్రామిక కాంగ్రెస్‌ల లాంటి వర్గీయ సంస్థలన్నిటికీ అఖిలభారత కాంగ్రెస్ మాతృక; ఈ వర్గప్రధాన సంస్థలన్నీ భారత జాతీయోద్యమాన్ని శక్తివంతం చేయడానికి కాంగ్రెస్ మహాస్రవంతిలోకి సర్వదా పొంగిప్రవహించే ఉపనదులు" అని వారన్నారు. 1938 ఏప్రిల్ వరకూ ఉన్నా మహాసంస్థ "కిసాన్ కాంగ్రెస్" ఆ[illegible]బడేది.

(ప్రభృతులు) మాత్రమే మొదటినించీ కర్షకులకు కిసాన్ మజ్దూర్ రాజ్యం — అంటే, కర్షక కార్మిక రాజ్యం — మీద వాంఛా, ఆకాంక్షా, విశ్వాసమూ, ఉపదేశిస్తున్నారు. కమ్యూనిస్టు పార్టీ మాత్రము కిసాన్ సంస్థను ఈ ఆదర్శంమీద తీర్చి దిద్దుటకు అంగీకరించ లేదు. కిసాన్ సంస్థ కార్యక్రమ నిర్ణయసూత్ర రచనలో, భారతస్వాతంత్ర్య సంపాదనానంతరం కిసాన్ ఉద్యమ ప్రధానాశయమూ, ప్రముఖ లక్ష్యమూ కిసాన్ మజ్దూర్ రాజ్యస్థాపనే అని ఉద్ఘాటించమని కిసాన్ కాంగ్రెస్ వాదులు సూచించారు. కిసాన్ సంస్థలో ఉన్న కమ్యూనిస్టు ప్రతినిధులుమాత్రం ఈ ప్రధా ప్రాథమిక రాజకీయాశయముపట్ల వైముఖ్యము చూపినారు అందుచే కమ్యూనిస్టుపార్టీ రష్యాలో కృషికవర్గంపట్ల ప్రవర్తించినరీతిగానే ఇక్కడ ఈదేశంలో కూడా అలాగే ప్రవర్తిస్తుందేమోననే అనుమానం, భయాలు మాలో రేకెత్తినవి. మాలాగే కమ్యూనిస్టుపార్టీ కూడా భారతగ్రామీణ సమస్యాపరిష్కారానికి జాతీయపద్ధతి పురస్సరంగా పూనుకోగలదని మొదట మేము కల్పించుకున్న ఆశలు నిరాశలైనవి. అందుచేతనే. కమ్యూనిస్టుపార్టీ రష్యాలో చేసినట్టే ఇక్కడకూడా కూలీ నియంతృత్వస్థాపనకోసం; కిసాన్ ఉద్యమబలాన్ని దుర్వినియోగం చేయకుండా ఉండాలని; 1938 నుండి కిసాన్ వుద్యమాన్ని కిసాన్ మజ్దూర్ రాజ్యాదర్శంపై నిర్మించుటకు మేము ఆతృతపడ్డాము.

గయా సమావేశంలో అంటే 1939, ఏప్రిల్‌లో భారత స్వాతంత్ర్య సంపాదనానంతరము కిసాన్ మజ్దూర్ రాజ్యస్థాపన కోసం పోరాడుట కిసాన్ ఉద్యమం పూనికీ అని అఖిలభారత కిసాన్ సంస్థ ఉద్ఘాటించాలన్నారు, కిసాన్ కాంగ్రెస్ వాదులు. తాము ఏనాడో చదుకున్న పాశ్చాత్యగ్రంథాలలోని కూలీ నియంతృత్వ ఆదర్శమునకు వేరుగా ఉన్నదని కొందరు సోష్యలిస్టులూ, కమ్యూనిస్టులూ, ఈ గమ్యస్థానాన్ని అంగీకరించలేకపోయారు. రైతుల స్వరాజ్యమనుకుంటే, ఆ సమరం పెట్టుబడి దారులు నియంతృత్వాని, కూలీ నియంతృత్వానికో దారి తియ్యకూడదనీ. కిసాన్ కాంగ్రెస్ వాదులు హెచ్చరించారు. శ్రామిక ప్రజాప్రభుత్వం అంటే కిసాన్ మజ్దూర్ ప్రభుత్వం సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదనాంతరం ఏర్పడాలనీ, ఆప్రభుత్వంలో కిసాన్ వర్గమే కేంద్రశక్తి అయివుండాలనీ వారి వాదన.

కుదకు కిసాన్ కాంగ్రెస్ వాదులే జయించారు. కిసాన్ మజ్దూర్ రాజ్యంగా పరిణమించే భారత స్వాతంత్ర్యంకోసం సాగించే సమరంలో, భారత కర్షకుడు తన భాగాన్ని తాను తీసుకొనుటకు సహాయం చేస్తానని ఆ సమావేశం అంగీకరించి, తీర్మానించింది

“కథ అడ్డంగాతిరిగింది” అని చికాకుపడ్డది కమ్యూనిస్టుపార్టీ.

గయ సమావేశంలోని తీర్మానానికి అర్థం [1], భారతస్వాతంత్ర్య సంపాదన తర్వాత నిజానికి ఆలోచాలంలో, 1939 _ 40 లో స్వరాజ్యం విప్లవ ప్రజానీకం వాసగతమైనట్లేఉండేది. భారత ప్రజా కిసాన్ మజ్దూర్ రాజ్యస్థాపనార్థం ముందడుగువేస్తుంది. కాని, కమ్యూనిస్టులకు ప్రియమైన కూలీ నియంతృత్వంలాంటి ఏకవర్గపాలనకు అంగీకరించదని;

[2] రష్యాలో లాగ కాకుండా...ఇక్కడ కర్షక వర్గంతన బలాన్ని అరికట్టి, కూలీ నియంతృత్వ స్థాపనకు ప్రయత్నించే కమ్యూనిస్టు పార్టీ లాంటి పక్షాలతో సమరం సాగించడానికి, మానసికంగానూ, నిర్మాణాత్మకంగానూ కూడా సిద్ధమవుతుందని;

కిసాన్ ఉద్యమం తన యావచ్ఛక్తినీ, తన సర్వస్వాన్నీ ధారపోసి, భారత కర్షక ప్రజానీకాన్ని...తన మీదకు ఏ యితర వర్గ నియంతృత్వ పాలననో ఎక్కించాలని ఒక ప్రక్కనుంచి పెట్టుబడిదారులూ, ఇంకొక ప్రక్కనుంచి కమ్యూనిస్టులూ _ బాహాటంగానో లోలోపలో _ చేసే ప్రతీ ప్రయత్నాన్నీ ప్రబోధం ద్వారా, సంస్థల ద్వారా, ఎదిరించేటట్లు తయారు చెయ్యాలనే హెచ్చరిక యీ తీర్మానం

కర్షక ప్రజానీకంముందు, స్వతంత్ర భారత భూమిలోని ఇతర ఆర్థిక సాంఘిక రాజకీయోద్యమములకు లోబడి పోకుండా వాటిలో కలిసి శక్తివంతమైన అధికార సంపాదన కొరకు వారి [illegible] ప్రాధాన్యమునూ, రాజకీయాధికార ప్రాధాన్యమునూ, సుస్పష్టంగా ఉంచింది యీ తీర్మానం.

కమ్యూనిస్టులు “కథ అడ్డం తిరిగింది” అని చీకాకు పడ్డారంటేనూ...ఆ తీర్మానం వారికి పచ్చి వెలగకాయ అయిందంటేనూ... ఆశ్చర్యం ఏమున్నది? అభ్యుదయంచే నిరీక్షిస్తున్నారు. “ఎప్పుడైనా

అదృష్టవశాత్తు మాకు వంతు రాదా, ఈ ఆదర్శాన్ని భిన్నభిన్నాం చేసి వెయ్యమా" అని.

1940 స్వాతంత్ర్యదినం...కాంగ్రెస్ స్వాతంత్ర్య ప్రమాణ పత్రంలోని పాఠాన్ని మార్చింది. కమ్యూనిస్టుపార్టీ, కాంగ్రెస్ సోషలిస్టుపార్టీలు పాతపాఠాన్నే...పునశ్చరణ చేస్తామన్నాయి. వారు స్వాతంత్ర్య సమరంలో ఏ స్వరాజ్యం కోసం పోరాడుతున్నారో ఆ స్వరాజ్యం వచ్చేక, అది కిసాన్ మజ్దూర్ రాజ్యానికే దారి తీస్తుందని నిసత్యైన ప్రతి కాంగ్రెస్‌వాదీ శ్రామికజీవులకు హామీ యివ్వడం న్యాయమూ ధర్మమూ అని కిసాన్ కాంగ్రెస్ ఉద్ఘాటించింది. కమ్యూనిస్టు పార్టీ సనాతనత్వానికి యీ ఉద్ఘాటన తలవునిగి తాటి ప్రమాణం అయింది. అహింసకూ నిర్మాణ కార్యక్రమానికీ, జాతీయ నాయకులిచ్చిన ప్రాధాన్యానికీ, వ్యతిరేకంగా కమ్యూనిస్టులు ప్రచండమైన గడబిడ చేశారు; అంతేకాని, రైతులతో ధైర్యంగా, "స్వతంత్ర భారత భూమిలో, మీరు పోరాడి తెచ్చుకున్న స్వరాజ్యం, మీరాజ్యాధికార స్థాపనకీ సర్వతోముఖాభివృద్ధికీ దారి తీస్తుంది" అని వారు చెప్పలేక పోయారు.

ఇంతేకాదు; కిసాన్ మజ్దూర్ రాజ్యం కావాలన్న ఆకాంక్షను ఉద్ఘాటించి తత్సంపాదన కార్యదీక్షను పెంపొందిస్తున్న కిసాన్ కాంగ్రెస్ వాదులతో కలియవద్దని తన సభ్యులకు హుకుమ్ జారీ చేసింది కమ్యూనిస్టుపార్టీ. ఈ పరిస్థితులలో కూడా, దేశమంతటా కిసాన్ ప్రదర్శనాలను జరిపి, కృషీవర్గం కిసాన్ మజ్దూరు రాజ్యంపై తనకున్న విశ్వాసాన్ని ప్రకటించింది.

1940 మార్చిలో కాంగ్రెస్ మహాసభ రామఘర్ లోనూ, అఖిల భారత కిసాన్ మహాసభ పలాసాలోనూ సమావేశమైనవి. పలాసా సమావేశంలో కమ్యూనిస్టు పార్టీవారి నగ్నస్వరూపం బయటపడింది. భారత భూమికీ, వైదేశాలకూ, ఆంగ్లేయుల సామ్రాజ్యవాద తత్వంనించీ, పెట్టుబడిదారీ తత్వంలోనించి బైటపడడానికి ఒకే ఒక మార్గం ఉందని ఉద్ఘాటించింది.

ఆ మార్గం — సర్వాకూలంకషమైన కూలీ ప్రభుత్వం!

అంటే కమ్యూనిస్టుపార్టీ, వలసరాజ్య గ్రామీణ విప్లవం అనీ అఖిల భారత శ్రామిక ప్రజాపాలన అనీ నిసప్తైన కిసాన్ మజ్దూర్ రాజ్యం అనీ చెబుతూన్న కబుర్లూ, వాటిమీద ప్రకటిస్తున్న విశ్వాసం అన్నీ వచ్చి అబద్ధాలనీ, అవిశ్వసనీయమైనవని తేలి పోయింది రష్యాలో కూడా, 1905 మొదలు 1917 సెప్టెంబరు వరకూ అచ్చటి రైతుల వివిధ వర్గాలకు కమ్యూనిస్టు పార్టీ యిలాంటి బురఖా వాగ్దానాలనే చేసింది లేదు.

కమ్యూనిస్టుపార్టీ స్వాతంత్ర్య నిర్మాణం అంటేనూ దానిస్థాప నాగ్త్రగ విప్లవ సంస్థాపన అంటేనూ కూలీలరాజ్యం అనీ, కూలీల విప్లవం అనీ అన్నమాట!

అలాంటి రాజ్య విధానంలో భారత కర్షక ప్రజకు స్థానమెలా ఉంటుంది?

ఉన్నది... పారిస్ కమ్యూన్ రోజులలో మార్క్సు భావించిన రీతిగానూ, 1917 — 1920 వరకు లెనిన్ భావించిన రీతి గాను 1912 నుంచీ స్టాలిన్ రైతులను ఉపయోగించుకుంటున్న రీతిగానూ, ఈనాడు చైనా రైతు జనాన్ని అచ్చటి కమ్యూనిస్టులు కొల్లగొడు తున్న రీతిగానూ అయితే, భావి రాజ్యాంగ విధానంలో భారత కర్షక ప్రజకు స్థానం ఉన్నది. పాపం, మన దేశంలోని కర్షక ప్రజని కూడా తన వెనుక తాళంవెయ్యమనీ, కూలీ వర్గ నాయకత్వమును అంగీకరించమనీ, వారి సంస్థ అయిన కిసాన్ కాంగ్రెస్ కోసం. కాకుండా, తనకోసం కష్టపడి రాజకీయాధికారాన్ని సంపాదించమనీ, కమ్యూనిస్టుపార్టీ ఉపన్యసించింది. భారతీయ కిసాన్లు పడే యీ కష్టమంతటికీ ప్రతిఫలంగా భగవంతుడు రక్షించి, కమ్యూనిస్టు పార్టీ ఆశిస్తున్నట్లుగా జరిగితే కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం తో తయారు కాబోయే కూలీ నియంతృత్వ పాలనలో ఏవో కొన్ని ఆర్థిక సౌకర్యాలను కిసాన్లకు దయచేస్తామన్నారు కమ్యూనిస్టులు!

రష్యాలో కూలీ నియంతృత్వపాలనలో రైతులు పడేబాధలూ అనుభవించే ఆపదలూ, హృదయవిదారకమైన హీనస్థితీ చూస్తున్న కిసాన్ నాయకులకూ, కర్షక శ్రేణులలోంచి బైటకువచ్చినవారికీ, కమ్యూనిస్టుల ప్రకటన ఒక సవాల్ లాగా ఒక ఛాలెంజ్ లాగ వచ్చింది. రష్యా రైతుజనానికి పట్టిన దుర్గతీ, హీనస్థితీ, ఆపదలే.

భారత కర్షక జనానికికూడా నష్టం కలుగకుండా రక్షించడానికి కిసాన్ కాంగ్రెస్ వాదులు బద్ధకంకణులైనారు; వారు ఆ సవాలును అంగీకరించారు; భావి భారత స్వరాజ్య సంస్థలో శ్రామిక కర్షక జనులకు పడిన, నిశ్చయమైన, శక్తివంతమైన రాజకీయాధికారంకోసం ప్రయత్నించడానికి కృతనిశ్చయులైనారు.

గయా సమావేశంలో అఖిలభారత కిసాన్ సభ అంగీకరించిన 'కిసాన్ మజ్దూర్ రాజ్యా'దర్శ తీర్మానాన్ని పలాసా సమావేశంలో తిరిగిబలపరచమని అన్నారు కిసాన్ కాంగ్రెస్ వాదులు. కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధులు యీవిధంగా జరగకుండా చెయ్యడానికి విశ్వప్రయత్నం చేశారు. స్వామీ సహజానంద సరస్వతికి కమ్యూనిస్టుపార్టీ గాలి అంతకుముందే తగిలింది; ఆయన కమ్యూనిస్టు పక్షపాతం చూపడం ప్రారంభించేడు ఈ సమావేశంలోకూడా కమ్యూనిస్టులకు సహాయం చేదామని ప్రయత్నించాడు. కాని లాభంలేకపోయింది. ఈ సమావేశంలో కిసాన్ కాంగ్రెస్‌కున్న "ఉపాయాధిక్యత" (Tactical-majority) వారిని రక్షించింది ఈ సమావేశం మరొకసారి కిసాన్ మజ్దూర్ రాజ్యసంపాదన తన ఆదర్శం అని ప్రకటించింది.

"ఉపాయాధిక్యత"(Tactical majority) అంటే ఏమిటో యిక్కడ కొంచెం చెప్పాలి అఖిలభారత మహాసంస్థలో ఆదర్శప్రాతిపదికలననుసరించీ, పత్రముల ననుసరించీ, సభ్యుల మొత్తం సంఖ్యా ఎలాగఉన్నా, ఏ రాష్ట్రంలో సమావేశం జరుగుతుందో, ఆ రాష్ట్రం నుంచి చాలా మంది సభ్యులూ, ప్రతినిధులూ, సమావేశానికి హాజరవుతారు తక్కినరాష్ట్రాలనుంచి చాలా కొద్దిమంది ఒక్కొక్కప్పుడు ఒక్కరే వస్తారు. ఇందుకు కారణం దూరప్రయాణమూ, ఖర్చులూను. అయితే తక్కిన అన్ని రాష్ట్రాల ప్రతినిధుల సంఖ్యకంటె, సమావేశం జరుగుతున్న రాష్ట్రపు ప్రతినిధుల సంఖ్య హెచ్చుగావున్నప్పుడు, "ఉపాయాధిక్యత" (Tactical majority) ఉన్నదంటాము

రైతుకుటుంబంలోనుంచి వచ్చారు, రైతులఅభివృద్ధి నిమిత్తమే ముఖ్యంగా భక్తి, అభిమానం చూపుతారు కిసాన్ కాంగ్రెస్ వాదులు నానాటికి వారికి, కిసాన్‌లకు వ్యతిరేకంగా కూలీల ఏకపక్షనియంతృత్వంపైన విశ్వాసముంచిన కమ్యూనిస్టుపార్టీతో కలిసి ఒకే కిసాన్

వేదికనుండి, ఒక్క కిసాన్ అవసరాలకోసం త్రికరణశుద్ధిగా పనిచేయులేమని సుస్పష్టమైంది. ఈ రెండుపక్షములకూ పరస్పర సుహృద్భావమూ, సమష్టిత, ఏనాటికీ ఉండదని నిశ్చయమైంది.

అయినప్పటికీ అదే కిసాన్ వేదిక మీద యీరెండు పక్షాలూ 1942 ఆగష్టు వరకూ పనిచేశాయి. ఇందుకు ముఖ్య కారణం-పలాసా సమావేశం అయిన రెండు నెలలలోపుగానే కిసాన్ కాంగ్రెస్ నాయకులందరినీ ప్రప్రథమంగా ఆచార్య రంగాని 1940 ఏప్రిల్ లో శ్రీకృష్ణ జన్మస్థానం లోనికి ప్రభుత్వం ప్రవేశపెట్టింది. మరొక కారణం...ప్రముఖమైన తమ జాతీయ స్వాతంత్ర్య సమరం అద్యతన భావిలో జరుగనున్నది. దాని విజయమునకు భారత కిసాన్ వర్గం తన సర్వశక్తులనూ ధారపోయ నిశ్చయించుకుంది. అందుచేత కిసాన్ వేదికపైన కమ్యూనిస్టులతో భారత స్వరాజ్య సంపాదనానంతరం ఉండే రాజకీయ విభాగాల ఆదర్శ ప్రాతిపదిక విభేదముల గురించి కిసాన్ కాంగ్రెసు చర్చించుటకు అది సమయము కాదు.

భారత భూమి బ్రిటిషు సామ్రాజ్యవాద విధానంలో నలుగుతున్నంత కాలం, భారత కర్షక జనులకు...తమ రాజకీయావసరాలూ ఆశయములూ అలాగ వుంచి...తమ ఆర్థిక ప్రాథమిక కష్ట నిష్ఠూరాలపైనా అరికట్టటం ఎంత అసంభవ కార్యమో తెలుసును. విధివిధానమైనది రెండున్నర సంవత్సరములలో కాంగ్రెస్ మంత్రి వర్గాలే వున్నా రైతులు ఎన్నిసార్లు ఆశాభంగము పొందవలసి వచ్చిందికాదు? ఇందుకు కారణం...సామ్రాజ్యవాద జనితమైన 1935 సంవత్సరపు ఇండియా ఆక్టు...దానిలోని గవర్నర్ల, గవర్నర్ జనరల్, ప్రత్యేకాధికారాలూ రక్షణాధికారములూ...దీని వెనుకను బ్రిటిష్, భారతీయ స్వార్థ ప్రయోజనములూను.

అందుచేతనే, కమ్యూనిస్టు పార్టీయే కానీ కాంగ్రెస్ సోషలిస్టు పార్టీయే కానీ, ఇంకయే యితర రాజకీయ పక్షమే కానీ ధైర్యంగా తీవ్రంగా, అవిచ్ఛిన్నంగా సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగానూ భారత స్వాతంత్ర్యానికి అనుకూలంగానూ పోరాడుతున్నంత కాలం, యీ సామ్రాజ్య వ్యతిరేక శక్తులన్నిటితోనూ కలసి కిసాన్ వేదిక మీదా, జాతీయ వేదిక మీదా తాను ఏకశ్రేణిలో ఉండటం భారత కర్షక జనులపట్ల, భారత దేశంపట్ల, తాను నిర్వర్తించవలసిన

నిర్ధ్యక్త ధర్మాన్ని కిసాన్ కాంగ్రెసు నిశ్చయించుకుంది. కమ్యూనిస్టు పార్టీతో తమ మాతృదేశం కోసం, భారతవర్ష అధికతర ప్రయోజనాల కోసం... దేశభక్తి పూరిత హృదయాలతో... సహనంతో శాంతముగా పనిచేయ్యడానికి కిసానులు అంగీకరించలేదు.

1940 నుండి -41 వరకూ, కిసాన్ కాంగ్రెస్ అఖిల భారత ప్రాతిపదిక మీద అహింసాయుతమైన స్వాతంత్ర్య సమరమునకు తయారవమని ప్రజలనూ, సమరమును ప్రారంభించమని కాంగ్రెస్‌నూ, ప్రోత్సహించుటలో మునిగింది. కాంగ్రెస్ సమర ప్రారంభానికి చూపిస్తున్న సంకోచానికి కర్షక వర్గంలో వినగా అసంతృప్తి కలిగింది. సమర ప్రారంభమునకు ప్రోత్సహించుటలోనూ కాంగ్రెస్ సంకోచంపట్ల విసుగుదల కనబర్చుటలోనూ కమ్యూనిస్టుపార్టీ కిసాన్ కాంగ్రెస్‌తో పాటుగానో అంతకంటే ఒక మెట్టు మీదుగానో ఉండేది. అసలు, కమ్యూనిస్టు పార్టీ నాయకులే కిసాన్ కార్య నిర్వాహక వర్గాన్ని, స్టాండింగ్ కమిటీని, ప్రోత్సహించి పురికొల్పించి "కాంగ్రెస్ స్వాతంత్ర్య సమరాన్ని ప్రారంభించలేక పోవడం భారత స్వాతంత్ర్య విద్రోహానికి సమసమానమైన పనే" అని, 1941 అక్టోబరులో ఒక ప్రకటన చేయించారు. ఇది దేశంలోని ప్రప్రథమ ప్రముఖ రాజకీయ పక్షంమీద బలవత్తరమైన సునిశిత దోషారోపణ అన్నమాట నిజమే! కాని కమ్యూనిస్టుల వెర్రి ఆవేశం ఆరోజుల్లో అలాగ ఉండేది.

అయితే కమ్యూనిస్టు పార్టీ ప్రదర్శిస్తున్న యీ సామ్రాజ్యవాద ప్రతికూలభావం, జాతీయ సమరానుకూలభావం కూడా— యీ వెర్రి ఆవేశం అంతా— కాంగ్రెస్‌నుండి అధికతరంగా దేశభక్త పక్షాలను అందులోంచి వేరుచేసి తనలోనికి ఆకర్షించుకోడానికీ, సంపూర్ణ జాతీయస్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న ఒక మహోన్నతసంస్థ — కాంగ్రెస్ — పలుకు అపకీర్తిని చుట్టడానికీ ఆపార్టీ చేస్తున్న మరొక కుతంత్రమనీ, పన్నుతున్న పన్నాగమనీ ఆనాడు కాంగ్రెస్ రైతాంగము గ్రహించలేక పోయింది.

కొన్నాళ్ల తర్వాత కాంగ్రెస్ కిసాన్ వాదులు కమ్యూనిస్టు పార్టీ వ్యక్తి సత్యాగ్రహోద్యమానికి ప్రతికూలంగా ఒక క్రమనిర్ణయ

పద్ధతిని నడిపించిన విద్రోహక చర్యలూ వాటి అర్థమూ గ్రహించారు. తమ శ్రేణులలోంచి ఎవరూ పార్టీ ఇచ్చిన గోతులలోకి దిగిపోకుండానూ, తమనుంచి ఆ మహోద్యమానికి భంగం రాకుండానూ జాగ్రత్త పడ్డారు.

కమ్యూనిస్టు పార్టీ సంజ్ఞామాత్రమైన వ్యక్తి సత్యాగ్రహోద్యమాన్ని విధ్వంసం చెయ్యాలని విశ్వప్రయత్నం చేసినా, అది నెమ్మదిగా నిర్ణీత పద్ధతులమీద, ఒక మహోజ్వల ఉద్యమంగా ప్రజలలోకి చొచ్చుకుపోయింది. అనుజ్ఞాతులైన 75 వేల కాంగ్రెస్ యోధులు సత్యాగ్రహంచేసి ద్వితీయ మహా సంగ్రామానికి తమ విముఖతనీ, ప్రభుత్వం భారతదేశాన్ని బలవంతంగా యీ యుద్ధం పాల్గొన చేయుటకు తమ ప్రతికూలతనూ, బాహాటంగా, నిర్భయంగా ప్రకటించేరు; దేశంలో నేటి సామ్రాజ్యవాద పాలనను అంతమొందిస్తామనే నిశ్చయాన్ని ఉద్ఘాటించారు.

క్రమశిక్షణతో నడిపింపబడిన యీ మహోన్నత ఉద్యమాన్ని కమ్యూనిస్టు పార్టీ కూలద్రొయ్యడానికి విశ్వప్రయత్నాలు చెస్తుంటే కిసాన్ కాంగ్రెస్ వాదులు ఆనందంగా దానిలో పాల్గొన్నారు. ఈ దెబ్బతో కమ్యూనిస్టు పార్టీ పాక్షిక దృక్పథాన్నీ, జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో సంపూర్ణ నాయకత్వం వహిస్తున్న కాంగ్రెస్ సంస్థపట్ల వ్యక్త గౌరవాల విహీనతనూ కిసాన్ వర్గం తెలుసుకోగల్గింది.

రష్యా మీద జర్మనీ దండెత్తిన ఆరునెలల వరకూ కమ్యూనిస్టుపార్టీ ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామాన్ని సామ్రాజ్యవాద యుద్ధమే అని ఎంచింది; కిసాన్ కాంగ్రెస్, వాదులూ, కాంగ్రెస్ బ్రిటిష్ యుద్ధప్రయత్నముల పట్ల ప్రదర్శిస్తున్న సహాయ నిరాకరణ విధానాన్ని అంగీకరించి, భారత స్వాతంత్ర్య అవసరాన్ని ఉద్ఘాటించింది. అకారణం, భయంకరం, అమానుషం అయిన యీ దండయాత్రను విని భారతీయులు అన్నిపక్షాల వారూ నిర్ఘాంత పోయారు.

రష్యా ప్రజలు అనేక ప్రతిభావంతమూ సాంఘికాభ్యుదయకరమూ అయిన ప్రముఖ పరిశోధనలను కొన్నింటిని చేస్తున్నారు శ్రామిక ప్రజలు సాంఘిక ప్రగతికై ముందడుగులు వేస్తున్నారు. అందు, చేతనే సోవియట్ రష్యన్ ప్రజానీకానికి భారత స్వరాజ్య

స్వరాజ్యవాదులూ, కిసాన్ కాంగ్రెస్ వాదులూ, సాధ్యమైనంతవరకూ సహాయం చేద్దామనుకున్నారు. కానికాని భారత దేశం ఏమి చెయ్యగలదు? సహాయం చేయగలిగివుంటేనూ సహాయం చేయాలంటేను భారతభూమి రష్యాకి బ్రిటిష్‌సామ్రాజ్యవాద ప్రభుత్వంద్వారా ఎలాగ సహాయంచేయగలదు? ప్రాథమిక పౌరసత్వపు హక్కులనుకూడా తమకు యివ్వ నిరాకరించి, "యుద్ధంలో పాల్గొనుటా మానుటా" అన్న సమస్యనైనా స్వతంత్రంగా వారిని పరిష్కరించుకోనివ్వని బ్రిటిష్ సామ్రాజ్య వాదంయొక్క సహకారాన్ని భారతీయులు ఎలాగ ఆపేక్షించగలరు? ఎలాగ అంగీకరించ గలరు? అందుచేతనే స్వతంత్ర భారత దేశం ఒక్కటే రష్యన్ ప్రజానీకానికి బలవత్తర సహాయం చెయ్యగలిగేదని అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు.

రష్యా జపానులకు స్నేహం ఉన్నా చీనాలోని కమ్యూనిస్టు పార్టీ రష్యా సహాయార్థం జపాన్ సామ్రాజ్యవాదం మీద యుద్ధాన్ని బలవత్తరం చేసింది, అలాగే రష్యా బ్రిటన్‌లకు స్నేహం ఉన్నా భారత కమ్యూనిస్టుపార్టీ రష్యా సహాయార్థం భారత స్వాతంత్ర్య సమరంలో అధికతరంగా పాల్గొందామనీ, బ్రిటిష్ సామ్రాజ్య వాదమును అరికట్టదామనీ నిశ్చయించుకుంది.

కాని 1941 నవంబరు డిసెంబరు నెలలో కమ్యూనిస్టు పార్టీ ఒక తప్పిగంతు వేసింది. ఒక కొత్త నినాదం బయల్దేరదీసింది ఈ యుద్ధం ప్రజాయుద్ధమని ([illegible]) యీ నూత్న నినాదానికి అర్థమేమిటి అంటే, అనేక కథలను—అనేక రకాలుగా చెప్తారు

అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీయే రష్యావిధానానికీ, ప్రయోజనాలకీ అనుగుణంగా భారత కమ్యూనిస్టుపార్టీని యీపిల్లిమొగ్గ వేయించి రాజకీయరంగాన్ని మార్చివేయుమని ఆజ్ఞాపించిందని కొందరు; అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ ఒకలండన్ ప్రతినిధి బ్రిటిష్ అధికారులు ధియోలీ డిటెన్షన్ క్యాంపులోనూ, బైటా, ఉన్న భారత కమ్యూనిస్టు నాయకులను కలుసుకొని సంబంధ బాంధవ్యాలను కలుపుకోడానికి రయితు సహాయం చేరవానీ, మన కామ్రేడులు ఆనాటి నుంచీ మాస్కో నిర్వచనాలతో సంపూర్ణంగా ఏకీభవిస్తున్నారని మరికొందరు; అదేదీకాదు, యుద్ధ కారణం వల్ల అలస్యంగా

హిందూదేశం చేరిన లండన్ తపాలాలో హారీపొలిట్ వ్రాసిన వ్యాసం, ఇతర వ్యాసాలూ కమ్యూనిస్టుపార్టీ కార్యాలయం చేరగానే యీ గమ్మత్తు జరిగింది, అందుచేత ఆ వ్యాసాలే కమ్యూనిస్టుపార్టీ పిల్లిమొగ్గలకు పునాదీ అని మరికొందరు.

ఏది ఎలాగవున్నా కమ్యూనిస్టుపార్టీకిమాత్రం నిజం తెలుసును. కాని అది మనకా నగ్నసత్యాన్ని చెప్తుందా?

“ఇలాగ భారతజాతీయతకు వ్యతిరేకంగానూ, సామ్రాజ్యవాదానికి అనుకూలంగానూ, మారిపోయిందేమిటి మీ దృక్పథం?” అని కమ్యూనిస్టులను ప్రశ్నిస్తే వారు జవాబుగా చెప్పగలిగిందల్లా ఇదే. “రష్యాప్రపంచంలోని కార్మిక కర్షక జాతి అంతటికీ ‘పితృదేశం’ అది కష్టాలలో ఉంది. సామ్రాజ్యవాద ప్రభుత్వాలు వలసరాజ్యాల జనులపట్లా, పీడితప్రజల విషయంలోనూ, రంగుజాతుల విషయంలోనూ, ఏహ్యమైన ఫాసిస్టుశత్రుల హీనప్రవర్తనకు పైకూడా, అతినీచంగా ప్రవర్తించినా, రష్యాకు సహాయార్థం ఆ ప్రభుత్వాలతో చెయ్యికలిపి ప్రప్రథమంగా వాటికి సహాయం చేసినా తప్పులేదు. మానవకోటి అంతా రష్యాకు సహాయార్థం పరుగులెత్తాలి. సోషలిజమ్ యోగపురుషుడైన స్టాలిన్ సామ్రాజ్యవాద నాయకుడైన చర్చిల్‌తో చెయ్యికలపడంలేదూ? అలాంటప్పుడు భారత జాతీయ నాయకులు, రష్యా సహాయార్థం, బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో ఎందుకు సహకరించకూడదు?” అని.

“ఇలాగ జాతీయ నాయకులు సామ్రాజ్యవాదులతో కలిస్తే భారతదేశంమీదా, వలసరాజ్యాలమీదా, బ్రిటిష్ సామ్రాజ్యవాదపు పట్టూ, శక్తీ బలపడతాయి. అందువల్ల సామ్రాజ్యవాదులు ఆ యా దేశాల ప్రజలను యింకా అధికంగా కొల్లగొట్టరా?” అని మనం ప్రశ్నిస్తే, కమ్యూనిస్టుపార్టీ చెప్పగల ప్రత్యుత్తరం. “శ్రీ. చర్చిల్ యీనాడు రష్యన్ శిబిరంలో ఖైదీ, వారిచేతి కీలుబొమ్మ అయిపోతున్నాడు. వారు గీసిన గీటు దాటలేడు. రక్షిత రష్యా రేపు విధానాన్ని చేపట్టి, వలసరాజ్యాల ప్రజానీకమునకు అత్యుత్తమ రక్షణాకారిగా ఉంటుంది. చర్చిల్‌తో ఈ సామ్రాజ్యాన్ని వదులుకొమ్మని, ఆ యా దేశాలకు స్వాతంత్ర్యం యిమ్మని అంటుంది కాని, వీటి సంగతి అడగడం మానేస్తుందా?” అని.

కాని, అర్థవిహీనమైన అసంభవమైన ఈ ప్రత్యుత్తరం అయినా 'కమ్యూనిస్టుపార్టీ' చెప్ప వీలులేకుండా అయింది. రష్యా బ్రిటన్‌లమధ్య జరిగిన ఒక సంధి ప్రకారం, రష్యా బ్రిటిష్ సామ్రాజ్యంలోని అంత రంగిక వ్యవహారాలలో ఇరవై యేళ్ళవరకూ చెయ్యి వేసుకోవని హామీ యిస్తున్నది.

ఏది ఎలాగవున్నా, ప్రపంచంలోని అన్ని దేశాలలో లాగే భారతవర్షంలోకూడా, కమ్యూనిస్టుపార్టీ మాస్కో నిర్వచనాలనే అనుసరించుటకు నిశ్చయించింది అపార్టీ తన నిశ్చయంవల్ల యీమధ్య ముఖ్యంగా యుద్ధం ప్రారంభమయ్యేక సామ్రాజ్యవ్యతిరేక సమర రూపంగా అభివృద్ధి పొందుతున్న వలసరాజ్యాలలోను జాతీయతకు ఎంత పెద్ద దెబ్బతగులుతుందో ఎంత దారుణ పరిస్థితు లేర్పడుతాయో అని యోచించలేదు. ప్రజాస్వామికపాలన కోసం పోరాడుతున్నామని చెప్తూ, తమ వలస రాజ్యాలలోమాత్రం అధికారాన్ని 'ఏమైనాసరే' వదలమని గట్టిగా పట్టుపట్టి కూర్చున్న సామ్రాజ్యాన్ని వలస రాజ్యప్రజల హృదయాలలో, సామ్రాజ్యవాద వ్యతిరేకతను నాశనాన్ని రేకెత్తించిన వర్గాలలోనూ, సమర మార్గంలో పెట్టిన వర్గాలలోనూ, తాము ఒకటన్న బాధ్యత కమ్యూనిస్టు పార్టీ మర్చిపోయింది. సామ్రాజ్యవాద రాజ్యాలనుంచి వారు విజయం పొందేక సామ్రాజ్యవాదాన్ని వదిలేస్తామని గాని, వలస దేశాల ప్రజలకు స్వతంత్రం ఇస్తామని గాని, ఒక నునిశిత వాగ్దానాన్ని, రష్యా హృదయపూర్వక సహాయంతో కమ్యూనిస్టు పార్టీ సంపాదించలేక పోయింది. పోనీ స్టాలిన్ అయినా మిత్రరాజ్యాలతో వారి వలస రాజ్యాలలో సినలైన ప్రజాస్వామిక పాలనా నిర్మాణం గురించి యేమైనా నొక్కి చెప్పడా అంటే, అదీలేదు. పైగా, మిత్రమండలి "ప్రకటన"కు రష్యా కిక్కురుమనకుండా తన సంతకం పెట్టింది. ఆ "అట్లాంటిక్ చార్టరు" లో ఏ సూత్రం వలస రాజ్యాల భావి ఆర్థిక అభివృద్ధికి నిశ్చయంగా క్షేమకరంకాదు. అట్లాంటిక్ చార్టరు భారత దేశానికి వర్తించదని చర్చిల్ అంటే, స్టాలిన్, అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ, తమ ప్రతికూలతనైనా ప్రదర్శించలేక పోయారు.

పరిస్థితులన్నీ యిలాగవున్నా వీటిని కాదని భారత కమ్యూనిస్టు పార్టీ రష్యాయందు తమకున్న భక్తి విశ్వాసాలతోనూ, తమ

సామ్రాజ్యవాద వ్యతిరేక సంస్థలను గురించి వదిలేసి, భారత స్వాతంత్ర్య సమరాన్నీ, భారతీయ క్షేమాన్నీ బలిదానమియ్యడం తల పెట్టింది. కానీ, బ్రిటిష్ యుద్ధ ప్రయత్నాలపట్ల కాంగ్రెస్‌లాగ తటస్థ విధానాన్నైనా అవలంబించలేదు. బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి హృదయపూర్వక సహకారాన్ని సమర్పించింది. అలాగ చెయ్యడంవల్ల ప్రపంచ కమ్యూనిజమ్, సోవియట్ రష్యాల శిబిరంలో సామ్రాజ్య వాదాన్ని బందీగా తాను కట్టివుంచేమనే మహోన్నతమైన వాదాన్ని అందరినీ నమ్మమంది. తనలాగే మోసంలోకి దిగమంది.

కిసాన్ కాంగ్రెస్ వాదులు మాత్రం కమ్యూనిస్టు పార్టీ వాదన అంగీకరించలేక పోయారు: అంగీకరించలేరు వారికి భారత స్వాతంత్ర్యసంపాదనే ప్రధానసూత్రం. ఈ ప్రధాన బాధ్యత నిర్వహించకనే, తక్కిన బాధ్యతలన్నీ వస్తాయన్నారు. వారికి రష్యా ప్రియమైనదే; కాని, భారత దేశం ప్రియతరమైనది. వారికి స్వాతంత్ర్యమును గోల్పోవనున్న రష్యా ప్రజలస్వాతంత్ర్య సంరక్షణపవిత్రకార్యమే కాని, 150 సంవత్సరములనుండి భారతదేశస్వాతంత్ర్యాన్ని విస్మరిస్తున్న దురాక్రమణ, సామ్రాజ్యవాద ప్రభుత్వంనుండి స్వాతంత్ర్య సంపాదన పవిత్రతరకార్యము. భారత ప్రజానీకం బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వం నుండి స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొనేంత వరకూ భారత దేశానికి ఆర్థిక రాజకీయాభ్యుదయం నిజంగా ప్రారంభం కాదు. కిసాన్ కాంగ్రెస్ వాదులు గ్రహించే వాళ్ళా విధంగానే బోధించారు కూడా. శ్రామిక జీవులైన రైతుకూలీలు ఆర్థిక రాజకీయ శక్తి సంపాదన ప్రారంభమగుటకు జాతీయ స్వాతంత్ర్య సముపార్జన షరతు. కాబట్టి భారతీయులూ, ఇతర వలసరాజ్యాలలోని ప్రజలూ, వారి ప్రధాన కార్యకలాపంగా అంతర్జాతీయ బాధ్యతలను భరించడానికి ముందు, జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించాలి. వారు వారి దేశానికి, దాని అభ్యుదయకర సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ శక్తులకు, భంగము లేకుండా, ద్రోహం చెయ్యకుండా, జాతీయవిధులకంటె అంతర్జాతీయ విధులకంటె అంతర్జాతీయబాధ్యతలే ఉత్తమమైనవని అంగీకరించలేరు, దాస్య భారతభూమిలో త్రొక్కి వేయబడి, బానిసలుగా మాడుతున్న భారతీయులు తమకు తామే అయినా పితృ భూమిని లేదని ఎలాగ అనగలరు?

ఇంగ్లాండులో 16 వ శతాబ్దములో "సెటిల్ మెంటు ఆక్టులు" (Settlement acts) ఉండేవి. వీటివల్ల పారిశ్రామికులు గ్రామాల లోనే ఉంచివెయ్యబడ్డారు. ఆ యాక్టులు రద్దుఅయితేనేకాని, వారు సంపూర్ణ పారిశ్రామికులు అవలేరు. నేటి భారతీయుల స్థితి ఇలాగ లేకపోలేదు. వారు మొట్టమొదట స్వతంత్రులవాలి. వానితోపాటు వారి దేశమైన భారతవర్షం సామ్రాజ్యవాద అధికారంనుండి బైటపడాలి. అప్పుడు ఆ పరిస్థితులలో మాత్రమే. వారు మాతృదేశమని భారత భూమికి వందనం చెయ్యాలో, "పితృదేశమని" రష్యా కాళ్ళు పట్టుకోవాలో, నిశ్చయించుకోగలరు!

అందుచేతనే, కిసాన్ కాంగ్రెస్ వాదులు, అఖిలభారత కిసాన్ సంస్థ కార్యదర్శి శ్రీమతి భారతీదేవి రంగా నాయకత్వంక్రింద తాము జాతీయాభిమానమును విసర్జించమనీ, వలసరాజ్యాల స్వాతంత్ర్యసమరాన్ని విస్మరించలేమనీ చెప్పి, కమ్యూనిస్టుపార్టీ అందచేసిన టువంటిదానిని నిరాకరించేరు.

కిసాన్ స్టాండింగ్ కమిటీ నాగపూర్ లో సమావేశమైనప్పుడు కమ్యూనిస్టులు వారి ప్రజాయుద్ధ వాదాన్ని కమిటీకి అందించి, కిసాన్ ఉద్యమం పేరిట దానిని అంగీకరించమన్నారు. కిసాన్ కాంగ్రెస్ వాదులు తమ యావచ్ఛక్తినీ వినియోగించి ఆ ప్రతిపాదనను ఎదుర్కొన్నారు. ఆఖరుకు ఒక సమాధానం కుదిరింది భారత జాతీయ స్వాతంత్ర్యమును గురించి కార్యనిర్వహణకు పూనుకొనే ప్రాతిపదికమీద, కేంద్రములో సంపూర్ణ బాధ్యతాయుత ప్రజాస్వామిక జాతీయ ప్రభుత్వమూ, రాష్ట్రములలో సర్వజనాంగీకారమైన మంత్రివర్గములూ, ఏర్పడినప్పుడే యీయుద్ధం ప్రజాయుద్ధం అవగలదని. అవుతుందనీని— ఆ సమాధానం.

ఇది కిసాన్ కాంగ్రెస్ వాదులకు నిజమైన విజయము! కిసాన్ వాదులూ, వారి నాయకులూ యీవిధంగా భారతజాతియెడ పట్ల తమ కున్న అనంత భక్తి గౌరవాలను ప్రదర్శించేరు; తమకు సోవియట్ రష్యా పట్ల నున్న సానుభూతి చేత తమ జాతీయ విధులనుండి వేరగుటకూ, కమ్యూనిస్టులకు లొంగిపోడానికీ అంగీకరించమని ప్రకటించేరు.

అఖిలభారత కాంగ్రెస్ కమిటీ ఆగస్టు(1942) లో సమావేశమైనప్పుడు, యిలాంటి కారణాల చేతనే యీ తీర్మానాన్ని అంగీకరించుటచేత ఇది సరియైనదనీ, జాతీయ దృక్పథాన్ని అనుసరించే ఉన్నదనీ, నిశ్చయమైంది. కాంగ్రెస్ కూడా కొన్ని షరతులతోనే సహకరించుటకు అంగీకరించిందన్నమాట.

అంతేకాదు, కమ్యూనిస్టు పార్టీకి, తాను కిసాన్ సంస్థలమీద గట్టిపట్టు సంపాదించ గలిగినా, కిసాన్ ఉద్యమం పేరిట, బ్రిటిష్ యుద్ధ ప్రయత్నాలకు సంపూర్ణ సహకారమిచ్చే విధానాన్ని గాని, జాతీయాశయ విద్రోహ కరమైన విధానాన్ని గాని, కిసానుల ముందుంచి, వారి అంగీకారాన్ని పొందే ప్రయత్నించుటకు ధైర్యం చాలిందికాదు: ఇందుకు కారణం భారత కృషిక ప్రజానీకానికి తమ జాతీయోద్యమం పట్లనున్న అధికమైన భక్తి గౌరవాలే! కిసాన్ కాంగ్రెస్ వాదులు ఏసంస్థలోనున్నా, బైటనున్నా, కమ్యూనిస్టులు కిసాన్ ఉద్యమాన్నికూడా బ్రిటిష్ సామ్రాజ్య వాదంతో పడుపువృత్తికి దింపకుండానూ, కిసానులకు న్యాయ సమ్మతమూ, సహజమూ, అభ్యుదయ కరమూ అయినా జాతీయతను సోవియట్ రష్యా ఆశయాలకు బలి చెయ్యకుండానూ చెయ్యగలిగారు.

భారత కిసాన్ వర్గాన్ని జాతీయాశయ విద్రోహానికి ప్రోత్సహించే ప్రయత్నాలలో కమ్యూనిస్టు పార్టీ పరాజయం పొందినా, చీటా సమావేశానికి (మే 1942 లో) ఇతర కథములతో ప్రయత్నించ వరసిద్ధమయ్యే పోజరయింది.

అయితే అప్పటి కప్పుడే అఖిల భారత కిసాన్ సంఘకు పోటీగా అనేక సంస్థలు బయలుదేరాయి; ఆ సంస్థనుండి అనేక రాజకీయపక్షాలు విడిపోవడం ప్రారంభించెయి. ఇంతకుముందు చెప్పినట్టు 1941 లో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఆసంస్థనుండి విడిపోయి. అఖిల భారత ప్రాతిపదిక మీద పోటీగా ఒక సంస్థ లేవదీసింది. మహాయుతోటి కొన్ని కారాలలో యీ పోటీ సంస్థ అఖిల భారత-[illegible] జరుపబోతున్నది కిసాన్ కాంగ్రెస్ నాగపూర్ సమా[illegible]లో చేసిన "కొన్ని షరతులకు లోబడి సహకారాన్ని ప్రభుత్వానికిస్తాము" అనే తీర్మానాన్ని నిరసిస్తూ ఫార్వర్డ్ బ్లాక్ వెళ్ళిపోయింది.

అసలు సంస్థకు పోటీగా తమ సంస్థ నొకదాన్ని తయారు చేదామని ఆలోచనలు ప్రారంభించింది.

మరి, యిలాంటి పరిస్థితులలో కిసాన్ కాంగ్రెస్ సంస్థలో నిజమైన కర్షకులు అల్పసంఖ్యాకులై పోయారంటే ఆశ్చర్యమేముంటుంది! ప్రభుత్వ దమన నీతి చేతా, యుద్ధకాలంలో రైళ్ల మొదలైన సౌకర్యాలలోని యిబ్బందులవల్లా, బీటా సమావేశానికి సభ్యులను చేర్పించుటలోనూ, ప్రతినిధుల ఎన్నికలలోనూ, సరియైన పరీక్ష లేకపోయింది అంతేకాదు: ఇంతవరకూ కిసాన్ సంస్థలు కిసాన్ వర్గానికి సంజ్ఞామాత్ర సంస్థలుగా ఉండేటట్లే నిర్మించబడ్డాయి కాని, ప్రత్యేక రాజకీయ పక్షాలూ, వాటిలోని అంతఃశాఖలూ, తమ ఆదర్శ ప్రాతిపదికల కొరకూ, బలాధిక్యత కొరకూ జరిపే పోటీలనూ, చికాకులనూ భరించగలిగినంత బలంగా నిర్మించ బడలేదు. అందుచేతనే జిల్లా, రాష్ట్రీయ కిసాన్ సంస్థల కార్యకలాపాలలోనూ, సభ్యుల చేర్పించుటలోనూ, ఎన్నికలలోనూ, సక్రమమైన పరీక్షా, పెత్తనం లేవు. కిసాన్ సంస్థ ప్రారంభించిన మొదటి నాలుగు సంవత్సరాలలోనూ భారత దేశమంతటా యీ మహోత్సాధానికి బాహ్య కుడ్యం నిర్మించుటకు ఆచార్యరంగా ప్రయత్నించారు. ఆరోజులలో యీ సంస్థలోకి — ఏపార్టీకి చెందిన — వ్యక్తులు వచ్చినా సరే, కిసానుల కనీసపు కోరికల ప్రణాళికను అనుసరించి సామ్రాజ్యవాద వ్యతిరేక సమరంలో పాల్గొంటే చాలునని అనుకున్నారు.

కాని: కమ్యూనిస్టు పార్టీ యింతటి విశాల హృదయంతో లేదు వారు ఏ సంస్థలో ప్రవేశించినా, వారి దృక్పథం ఒక్కటే — ఆ సంస్థలో అధికారమూ, ఉన్నత స్థానములూ కావాలి. ఈ సంగతి 1940-42 మధ్య కాలంలో కిసాన్ కాంగ్రెస్ వాదులకు బోధపడింది. అప్పుడే వారికీ, కమ్యూనిస్టు పార్టీకీ మధ్య నిజమైన రాజకీయాభిప్రాయ భేధాలు ఏర్పడ్డాయి.

బీటా సమావేశంనాటికి కమ్యూనిస్టుపార్టీ చాలా రాష్ట్రీయ సంస్థలను హస్తగతం చేసుకోగలిగింది. అయితే, వారు పెద్ద పలలాగ జిల్లా తాలూకా సంఘాలను నిర్మించారనీ, కిసాన్ జనుల భక్తి గౌరవ విశ్వాసాలను చూరగొన్నారనీ అనుకోడం చాలాపొరపాటు. ఉదాహరణంగా: సంయుక్త పరగణాలలోనూ, వంగరాష్ట్రంలోనూ

అత్యధికంగా నున్న కమ్యూనిస్టు పార్టీ కిసాన్ సంఘాలనుచూడండి. వాటిలోకి రైతు జనాన్ని రానివ్వకూడదనే నిశ్చయంతో కిసాన్ ప్రాతినిధ్యం, వాటికి లేకుండా చెయ్యాలనే వాటిలోకి రానివ్వ లేదు. వాటిని 'పేరుకుమాత్రంవుండే' సంఘాలుగానే వుంచారు. కానీ, ప్రాతినిధ్యంవున్న కిసాన్ కాంగ్రెస్ సంఘాలున్నాయి. వాటితో సోదరభావ నిర్మాణానికేనా కమ్యూనిస్టులు అంగీకరించ లేదు. ఆచార్య రంగా యీ రెండుపక్షాలకు చెందిన కిసాన్ సంస్థల మధ్య సౌభ్రాతృత్వ నిర్మాణానికి ఎంతైనా ప్రయత్నించారు; లాభం లేక పోయింది.

కమ్యూనిస్టులు, యీ పరిస్థితులలో, "ఉపాయాధిక్యత" తో కృత్రిమ బలంతో బీటా సమావేశానికి వచ్చారు. కిసాన్ కాంగ్రెస్ వాదులు సంయుక్త వరగణాలలోని సభ్యత్వం కృత్రిమ మైనదనీ, ఆరాష్ట్ర ప్రతినిధుల యెన్నికలు పేరునకు మాత్రమే జరిగిన ఒక మాయా నాటకం అనీ, వారని ప్రతినిధులుగా ఎన్నుకున్న సంఘాలు కాగితంమీద మినహాయించి సజీవంగా ఎక్కడా లేవని చెప్పారు: అందుచేత సమావేశానికి వచ్చిన ప్రతినిధులలో నాలుగో వంతుమంది నిజమైన ప్రతినిధులుగా లెక్కించ కూడదనీ, వారికి వోటింగు హక్కు ఉండకూడదనీ అన్నారు. కాని లాభం లేకపోయింది.

దీనికి తోడుగా కిసాన్ కాంగ్రెస్ వాదులకు అనుకోని ఒక పరిస్థితి యేర్పడి కమ్యూనిస్టు పార్టీకి అధిక బలాన్ని యిచ్చింది. 1935–36 లలో ఆచార్య రంగా అఖిల భారత కిసాన్ సంస్థ స్థాపిస్తున్నప్పుడు, స్వామీ సహజానంద సరస్వతీ, ఇందూలాల్ యాజ్ఞిక్, వారితో కలిసి కిసాన్ ఉద్యమంయొక్క విధానాన్నీ, కార్యక్రమాన్నీ నిర్ణయించుటలో చాలా సహకారం చేసారు. కాని, రానురాను, ముఖ్యంగా 1939 నుండీ, కమ్యూనిస్టుపార్టీ భారతదేశంలో బలపడ్డ కొద్దీ, వీరిద్దరూ పార్టీ రాజకీయులను అధికంగా చెవివట్టనిచ్చారు. 1940 — 41 లో వీరు జైలులో వున్నప్పుడు కమ్యూనిస్టుపార్టీ శక్తి వీరిని 'ఎర' గా కబళించి వేసినట్లు కనబడుతుంది. జయిలులోనుండి వచ్చిననాటినుండీ వారిద్దరూ కిసాన్ ఉద్యమ దృక్పథంలో సమూలమైన మార్పులు కావాలని ప్రారంభించారు. వీరు చెప్పే మార్పులు కమ్యూనిస్టుపార్టీ ప్రజాయుద్ధ నినాదానికి చాలా దగ్గరగావున్నాయి.

బీహారు రాష్ట్ర కిసాన్ వర్గం ఆంధ్ర తమిళ రాష్ట్ర కిసాన్ కాంగ్రెస్ వర్గాలనూ, ఇతర రాష్ట్ర కిసాన్ కాంగ్రెస్ వర్గాలను, అనుసరించకుండా, కమ్యూనిస్టుపార్టీ నిర్వచనాలను అనుసరిస్తుందని నిశ్చయమైంది; అందుచేత కిసాన్ కాంగ్రెస్‌లో చీలికలు వచ్చాయి.

బీటా సమావేశంలో కమ్యూనిస్టుపార్టీ నాగపూర్ సమావేశంలోకంటే రెండుమంత్రాలు హెచ్చుగా చదివింది _ జాతీయ నాయకులు క్రిప్సు ప్రతిపాదనలను శిరసావహించలేదని విచారించింది: స్వయం నిర్ణయాధికార సూత్రం పేరిట ముస్లింలీగుకు "పాకిస్థాన్" యిచ్చివేయమంది; జాతీయ స్వాతంత్ర్య సమరం ప్రారంభించాలనే గాంధీజీ ఉద్దేశానికి భయకంపిత అయింది; గాంధీజీ ప్రారంభించిన "క్విట్ ఇండియా" అనే నినాదం దేశానికి నాశనమనిఅంది;

అంతటితో కమ్యూనిస్టులు ఆగలేదు; కిసానులు స్వరాజ్య సమరంలో నాయకత్వం వహించాలనే భావం పోయింది! సామ్రాజ్యవాద దురాక్రమణమీద అసహ్యంకూడా పోయినది! గాంధీ రాజకీయాల పట్ల కిసాన్లు జాగ్రత్తగా ఉండాలనీ, అద్యతనభావిలో జరుగబోయే జాతీయ సమరానికి వ్యతిరేకంగా కిసాన్ ప్రజానీకం పోరాటం సాగించాలనీ, కూడా ప్రతిపాదించారు!

1933 నుండి నేటివరకు కమ్యూనిస్టులు తాము భారతజాతీయత కోసం పాడిన ప్రతీ పాటకూ, చేసిన ప్రతీ ప్రకటనకూ, యీనాటి తమవాదం వ్యతిరేకంగా ఉన్నదని ఆలోచించలేదు లెనిన్‌యొక్క యుద్ధాన్ని గురించిన వ్యాఖ్యానానికీ, యింతవరకూవారు చెప్పినవిప్లవాపజయ ప్రవృత్తి (Rveolutionary defeatism) నినాదానికీ, ఈవాదం సంపూర్ణంగా వ్యతిరేకమన్న సంగతిని వారు గుర్తించలేదు. అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీయొక్క, వలసరాజ్యాల ప్రణాళికనే, వీరి నూతన ప్రతిపాదనలు తప్పు అంటున్నాయని అయినా "ఖాతరు" చెయ్యలేదు. వారు మాస్కో నిర్ణయాలకే బద్ధులయారు; రష్యా ప్రయోజనాలనే గుర్తించారు.

కాని కిసాన్ నాయకులకు నగ్న సత్యం బోధపడింది కిసాన్ సంస్థకూడా రాజకీయ వివాదాలకు రంగభూమి ఎలాగ అయిందో, కమ్యూనిస్టులు ఒక్క కిసానులనే తమ స్వప్రయోజనాలకోసం

రష్యా ప్రయోజనాల కోసం ఎలాగ కొల్ల గొట్టాలని ఆశిస్తున్నారో బోధపడింది. అంతేకాదు కాంగ్రెస్‌కూ అలాంటి యితర రాజకీయ పక్షాలకూ వేరుగా ప్రత్యేకంగా ఉండేటట్లు కిసాన్ వర్గాన్ని ప్రత్యేక రాజకీయ ప్రమాణంగా నిర్మించ బూనుటలో తాము చేసిన పొరపాటును కిసాన్ కాంగ్రెస్ నాయకులు గ్రహించేరు మాస్కో మానస పుత్రులైన కమ్యూనిస్టుల చేతా, బ్రిటిష్ మానసపుత్రులైన మహాదార వాదులచేతా, ఉద్యోగాధికార వంధా పరులచేతా పీడింప బడుతున్న జాతిని భారత దేశంలో రెండే రెండు పక్షాలు రెండే రెండు పంథాలు ఉండగలవని కిసాన్ నాయకులు గ్రహించారు. ఆ రెండు పంథాలలో, రెండు పక్షాలలో ఒకటి స్వాతంత్ర్యానికి తీసుకువెళుతుంది రెండవది బానిసత్వానికి తీసుకువెళుతుంది మొదటిది దేశభక్తులదీ, రెండవది దేశద్రోహులదిని.

ఆచార్య రంగా 1945 మార్చి 11 వ తేదీని కారాగారం విముక్తులయ్యారు. బీటా సమావేశానికి వారు హాజరగుట కిసానుల అదృష్ట బలం. కిసాన్ కాంగ్రెసు నాయకులకు వారు మార్గదర్శకులై, సరియైన మార్గంలో నడిపేరు. వారి అధ్యక్షతన కిసాన్ కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీనీ, దాని నూతన మిత్రులు స్వామీజీ, యాజ్ఞిక్ జీలనూ ఎదిరించి నిలబడి, నాగపూర్ సమావేశం ఉద్ఘాటించిన "షరతులకు లోబడి సహకారం మిస్తా" మనే తీర్మానానికి మించి అధికంగా వెళ్లకుండా చెయ్యగలిగారు; కమ్యూనిస్టులు తమ ప్రణాళికను ఉపసంహరించుకొనేటట్లు చేశారు కిసాన్ కాంగ్రెస్ అంతకు ముందే ప్రజారక్షణ సమితులను యేర్పాటు చేసి, జయప్రదంగా నిర్వహిస్తున్నది. ఈ సమితులయేర్పాటుల్లో తప్ప అధికంగా ప్రభుత్వంతో నిత్య సంబంధాలు పెట్టుకో కూడదని కిసాన్ నాయకులు యీ సమావేశం చేత ఒక గిరిగీత గీయించారు

ఈ అపజయం కమ్యూనిస్టులను చాల కలత పెట్టింది. కిసాన్ నాయకులకు వారు తమ పంజావిప్పి గోళ్ల రుచిని చూపించగల మహాదవకాశం కోసం నిరీక్షిస్తున్నారని బోధపడిపోయింది, కిసాన్ సంస్థ ప్రజాస్వామిక ప్రగతి పథకమూ, అభివృద్ధికీ కమ్యూనిస్టులు అడ్డుతగులుతుంటే, ఆసంస్థలో వారితో కలిసి తాము అట్టే కాలం ఉండలేమని కిసాన్ కాంగ్రెస్ వాదులకు స్పష్టమైంది. స్వామీజీ కమ్యూనిస్టులతో

కలిసి ఉన్నారు కాబట్టి, కమ్యూనిస్టులు కిసాన్ వేదికనుండి చేసే ప్రజాయుద్ధం నినాదం ప్రజానీకంలోకి యెక్కకుండా చెయ్యడం కిసాన్ కాంగ్రెస్‌కు అసాధ్యమైంది. కమ్యూనిస్టులు ఎలాగ రైతులను కాంగ్రెసు నుండి వేరుచేసి, తమలోకి ఆకర్షించుకోడానికి ప్రయత్నిస్తున్నారో వారికి విశదమే. అందుచేతనే కిసాన్ కాంగ్రెసువాదులు కిసాన్ సంస్థ నుండి కమ్యూనిస్టులను బైటకు త్రోసి వేయుటకో గాను బైటకు వచ్చివేయుటకో, తగిన అవకాశం కోసం నిరీక్షించారు.

అఖిల భారత జాతీయ కాంగ్రెసు సమరాన్ని ప్రారంభించుటకు నిశ్చయించింది. సుప్రసిద్ధ ఆగస్టు (1942) తీర్మానానికి కిసాన్ కాంగ్రెసు జేజేలు పెట్టి సుస్వాగతం చెప్పింది, కమ్యూనిస్టులు మాత్రం యిదంతా గాంధీజీ ఆడే "జూదం" అన్నారు;

కాంగ్రెస్ మీదను, భారత జాతీయ ప్రజానీకం మీదను, ప్రభుత్వం తన "బిజిలీ శక్తులను" పురికొల్పింది — ఆ నాటికీ కిసాన్ కాంగ్రెస్ స్థానం భారత జాతీయతా రక్షణార్థం పోరాటం సాగిస్తున్న యోధ కిసాన్ ప్రజానీకం ప్రక్కనూ, కాంగ్రెస్ ప్రక్కనూవుంది, కమ్యూనిస్టులు మాత్రం ప్రజానీకాన్ని బలి పెట్టడానికీ, జాతీయ రక్షణలకు విద్రోహం చెయ్యడానికీ, తను యావచ్ఛక్తినీ వినియోగించారు. బాధలు పడుతున్న ఆ అమూల్య ప్రజానీకం పక్షాన దానికి రక్షణగా కమ్యూనిస్టు పార్టీ, ఆపార్టీ చేతులలో కీలుబొమ్మలైన, దాని అధ్యక్షుడూ, కార్యదర్శీ, చేసిన యీ విద్రోహానికి బదులుగా కిసాన్ కాంగ్రెస్ ఒక్క మాటయినా ఆడలేక పోయింది.

కిసాన్ స్టాండింగ్ కమిటీ అక్టోబరు నెలలో బొంబాయిలో సమావేశమై ఒక తీర్మానాన్ని అంగీకరించింది.

ఆ తీర్మానం: బ్రిటీష్ సామ్రాజ్య వాదుల కెదురునిలిచి, స్వీయ రక్షణ మార్గాలను అవలంబించిన దేశభక్తి పరులైన కిసానులను కిసాన్ వర్గం నుండి వేరు చెయ్యాలని.

ఈ తీర్మానానికి అర్థం: కిసాన్ వర్గాలలోనున్న కిసానులు దేశభక్తి పూరితులైన సోదర కిసానులకు విద్రోహం చెయ్యాలని.

దానినే కిసాన్ కాంగ్రెస్ వాదులు (కిసాన్ దేశభక్తులఎడల) "మహా విద్రోహం" అని అంటారు.

కిసాన్ సంస్థ యీ విధంగా తన పట్ల కిసానులకుండే భక్తి గౌరవాల పేరిట కిసానులమీద మహా ద్రోహాలను ఆచరిస్తుంటే, కిసాన్ కాంగ్రెస్ నాయకులు మరి భరించ లేక పోయారు; కిసానుల పట్ల యింతటి విద్రోహాకరమైన మార్గాన్ని చూప సాహసించిన యీ సంస్థనుండి రాగల భ్రమ, ప్రమాదాలను కిసానులకు చెప్పి, జాగ్రత్తగా ఉండమని హెచ్చరించ నిశ్చయించారు. కమ్యూనిస్టులు యీ సంస్థలో ఉండి దాని మీద అధికారం చెలాయించ గలిగినంత కాలం, యీ సంస్థ కిసానులను జాతీయ పంథానుండీ, సామ్రాజ్యవాద వ్యతిరేక ధర్మాలనుండీ, వేరుగా నడిపిస్తుందని స్పష్టమై పోయింది

వెంటనే కిసాన్ నాయకులందరూ కలసి యీ సంస్థను త్యజించి బైటకు వచ్చేశారు. వలస రాజ్యాల జాతీయత మీదా కాంగ్రెస్ ఉద్ఘాటించే సామ్రాజ్యవాద వ్యతిరేక బోధనలమీదా భక్తి గౌరవాలున్న అది రాష్ట్రీయ సంస్థలు వారి అడుగు జాడలలో నడిచేయి, యీ సంస్థతో నున్న సంబంధ బాంధవ్యాలను బాహాటంగా తెగగొట్టు కొన్నాయి.

వీరందరూ అప్పుడు ఆ శుభ ముహూర్తంలో ఫైజ్‌పూర్ కిసాన్ కాంగ్రెస్ సమావేశంనాటి జాతీయాదర్శములనూ, విప్లవ సిద్ధాంతాలనూ సింహావలోకనం చేశారు. 1942 నాటి జాతీయ విప్లవ ఆదర్శముల ననుసరించి కిసాన్ కాంగ్రెస్‌ను పునర్నిర్మాణం చేశారు.

ఇది కిసాన్ కాంగ్రెస్ జన్మ వృత్తాంతం.

కిసాన్ శ్రేణులలో కమ్యూనిస్టులకు స్థానమిచ్చి, వారితో సహకరిస్తూ పనిచేసిన యీ 6 ఏళ్ళలోనూ కిసాన్‌లకు వారితోనున్న అనుభవములనుండి కిసాన్‌లు కొన్ని ముఖ్య పాఠాలను నేర్చుకున్నారు. వాటిలో ముఖ్యమైన పంక్తులు యివి—

చరిత్ర ప్రసిద్ధమైన కమ్యూనిస్టుల కిసాన్ వ్యతిరేకదృక్పథంలో మార్పు ఏమీ లేదు. వారు రైతు ప్రజానీకపు భావాలూ, అవసరాలు మీదా, ప్రారంభ కుతూహలం, ఉద్వేగాల మీదా, ప్రజా సహకారం మీద ఆధార పడిన కిసాన్ సంస్థను ప్రజానీక ప్రాతిపదిక మీద నిర్మించటానికి మనస్ఫూర్తిగా ప్రయత్నించరు.

ప్రత్యేకమైనశక్తిగా కాని, జాతీయ విప్లవ శక్తులకు అంతర్వాహినులుగా గాని, రైతుల రాజకీయ చైతన్యం, సంస్థ స్వతంత్ర కృషిపై విశ్వాసం, అభివృద్ధి చెందడమంటే కమ్యూనిస్టులకు తగని భయం.

రైతువర్గం తమంతట తామే ఆలోచించుకొని, రాజకీయశక్తిని చేబట్టుటకై ఒక రాజకీయ కార్యక్రమాన్ని నిర్ణయించుకొని, కాంగ్రెస్ సంస్థద్వారా పనిచేసినా స్వాతంత్ర్య సంపాదనానంతరం కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్య సంపాదనకు ప్రయత్నిస్తారన్నా, కమ్యూనిస్టులకు యిష్టంలేదు

వారు కిసాన్ రాజకీయాలూ, రాజకీయశక్తి, త్వరితగమనంతో అభివృద్ధి పొందకుండా అరికట్టుటకు అశిస్తున్నారు... లేకపోతే ఏకైక కూలీ నియంతృత్వ సంపాదన కష్టమూ, ఆలస్యమూ అవుతుంది. రష్యాలోలాగే యిక్కడ కూడా కిసాన్లను నీళ్లుచేదే సేవకులుగానూ, కట్టెలు కొట్టుకొని జీవించేవారిగనూ ఉంచి, కూలీ సంఘాలూ వారికి నాయకత్వం వహించిన కమ్యూనిస్టు పార్టీ... రాజ్యాన్ని, సంఘాన్నీ ఏలాలని వారి ఆకాంక్ష.

ప్రజాస్వామికంగానూ, అభ్యుదయకరంగానూ అభివృద్ధి పొందకుండా ఉండేటట్లు చూడడానికి దేశంలోని అన్ని కిసాన్ సంఘాలలోనూ కమ్యూనిస్టు పార్టి తన మనుష్యులను ప్రవేశపెట్టింది.

తమ బాగుకోసం తమ నాయకత్వం క్రింద ఉంచడానికి వినా వలస రాజ్యాల స్వాతంత్ర్య సంపాదన మీద సునిశిత దృష్టి లేనేలేదు కమ్యూనిస్టులకి.

కమ్యూనిస్టులకు రైతువర్గం అంటే ప్రతికూలత, విముఖత, దురభిమానం, జన్మతః ఉన్నవి... 1936వ సంవత్సరం వరకూ భారతకిసాన్ వర్గాన్ని ముట్టడానికైనా అంగీకరించలేదు... అయితే ఆనాటు కిసాన్ సంస్థలలోకి వారు రావడానికి కారణం — కిసాన్ సంస్థలకు సత్వరమైన అభివృద్ధి లేదనీ... ఆసంస్థలు కాగితం - మీద - నామ్‌కే వాస్తేగా ఉన్నాయిగాని, సజీవంగా ఎక్కడా లేవనీ... బుజావు చెయ్యడానికీ, వాటిని జాతీయ నాయకత్వం నుండి తప్పించి తప్పుమార్గాల పట్టించడానికీ మాత్రమే.

వారికి వలస రాజ్యాల జాతీయతలోగల విప్లవశక్తి బోధపడ లేదు. వలసరాజ్యాల జాతీయ విప్లవాన్ని కూలీ వర్గవిప్లవం యొక్క విభాగంగానూ, ఉప ఫలితంగానూ తప్ప దానికి వ్యక్తిగతమైన శక్తి యిచ్చి రూపొందించలేదు. వారి దృష్టిలో కూలి వర్గవిప్లవమూ, దాని సర్వతోముఖ సంస్థాపనపొందిన సోవియట్‌రష్యా సంపూర్ణప్రాధాన్యం వహించినవి; ఎల్లప్పుడూ వాటినే బలపరచాలంటారు; జాతీయ విప్లవం, వలసరాజ్య ప్రజానీకం వాటి ప్రయోజనాలకు ప్రతికూలం అయితే, జాతీయవిప్లవాన్నీ వలసరాజ్య ప్రజానీకాన్నీ వాటికి (అంటే సోవియట్ రష్యాకు) కూలీవర్గవిప్లవానికీ . బలిపెడతారు. సామ్రాజ్య వాదానికీ, ఫాసిస్టు దృక్పథానికీ వ్యతిరేకంగా వారు చేసే ప్రకటనలూ, కృషీ వలసరాజ్య ప్రజలనూ, పీడితప్రజలనూ, తమ వర్గ ప్రయోజనాలలోకీ, సోవియట్ రాజకీయాలలోకీ లాగుకోటానికే కమ్యూనిస్టులు "బుర్ఖా" వేసుకొనుట, ఆవ్యతిరేకపు సోవియట్ ప్రయోజనాల కుపకరించినంత వరకే!

అందుచేతనే కిసాన్లు నిజమైన జాతీయ స్వాతంత్ర్యాన్ని కోరితే... కమ్యూనిస్టులను వదలక తప్పదు.

కిసాన్లు స్వతంత్ర భారతభూమిలో నిజమైన, శక్తివంతమైన రాజకీయబలం అపేక్షిస్తే...కిసాన్ మజదూర్ ప్రజారాజ్య స్థాపన ఆకాంక్షిస్తే ... వీటి అన్నిటికీ ముందుగా; అతిస్వల్పమైన ఏకైక కూలీవర్గ ప్రయోజనాలకూ, కూలీవర్గ సంరక్షకులమని స్వయంనిర్ణీతంగా దొంగవేషంవేస్తున్న కమ్యూనిస్టుపార్టీ ప్రయోజనాలకూ, బలి అగుటకు అంగీకరించకపోతేనూ ... కమ్యూనిస్టు రాజకీయాలను పరిత్యజించవలసిందే!

1942 ఆగస్టు నుండి కమ్యూనిస్టులు కిసానుల ఆర్థిక అంతస్థు పునాదులనుండీ పెరికి పారవేయడానికి ఎన్నెన్ని చేశారో, కిసానులు ఏనాటికైనా మరచిపోగలరా? కూలీవర్గ ప్రయోజనాలకూ, పూంజీ వర్గ ప్రయోజనాలకూ కిసాన్ ప్రగతిని బలిపెట్టారు; పారిశ్రామిక కూలీల జీతాలు హెచ్చుచేయాలని పోరాడుతూ...అందుకుతగినట్టు ధాన్యం ధర హెచ్చుఅగుటకు అడ్డుచెప్పారు. యుద్ధ ఋణపత్రాల కొనుగోలుకూ, వంగదేశంలో "అపాంసాస్త్రి" విధానానికీ (Self denial policy) సహాయంచేసి, కిసానుల ఆర్థిక వినాశనానికి తోడ్ప

ద్వారా అన్యాయమైన ధాన్యపు రిక్విజిషన్లనూ, అనిర్ణీత ధాన్య సంపాదననూ (Arbitrary procurement) కిసాన్ల నెత్తిని పులుముటకు ప్రభుత్వానికి సంపూర్ణ సహకారం యిచ్చేరు.

ఈ విధంగా భారత కమ్యూనిస్టులు తమ కిసాన్ సంస్థలను కిసాన్లపైబడి మేత మేయుటకే వినియోగించారు. ఆ సంస్థలు భారత దేశ రైతాంగానికి గుండెల మీద కుంపటిలా అయినాయి.

అయితే...ఇది కూడా కర్షక వర్గానికొక మహోదాశీస్సే!

కమ్యూనిస్టులను కిసాన్ సంస్థలలోకి జొరబడనిచ్చుట చేత... వారిని ఆ సంస్థలో అధికారం చెలాయించనిచ్చుట చేత...కిసాన్ సంస్థలను కొల్లకొట్టుకోనిచ్చుట చేత...ఉండే ప్రమాదా లేమిటో భారత కర్షక వర్గం కన్ను విప్పి చూచి గ్రహించ గలిగింది.

# 2

# విషబీజాలు

ఇంతకు పూర్వం మనం రైతాంగానికి సంబంధించినంతవరకూ కమ్యూనిస్టు పార్టీ మన తత్వాన్ని పరిశీలించి, దాని ఉద్దేశాలు చూచాం. ఇక, ఈనాడు భారత కమ్యూనిస్టులు వారి జాతీయాశిపట్ల రైతాంగం యెడల వ్యతిరేకంగా అవలంబిస్తున్న విధానాన్ని, నీతి నియమాలు లేని ఎత్తులనీ, వీటిని తీర్చిదిద్దుతున్న అదృశ్య ప్రాతిపదికలనూ, లోలోపల పనిచేస్తున్న శక్తులను, పరిశీలిద్దాము.

ఏనాటికైనా భారత కమ్యూనిస్టులు వలస రాజ్యాల విప్లవం యొక్క సంపూర్ణ భావాన్ని, దాని ప్రముఖ విశ్వవ్యాప్తినీ, గ్రహిస్తారని ఆశించాము; వలస రాజ్యాలలో విప్లవవర్గ ప్రథమ శ్రేణి రైతులదే అని గ్రహిస్తారను కున్నాము; కార్మిక వర్గనాలో రైతు వర్గాన్ని ఏచిన్న విభాగంగానో ఉంచాలనే ఉద్దేశంతో సాంఘిక విప్లవానికి రైతు సంఘాలను అంటగట్టాలనే తప్పుడు భావాన్ని పాశ్చాత్య

వాదనకు వేరుగానుండి, పలస రాజ్యాలలోని కమ్యూనిస్టులైనా రైతు సేవ చేస్తారేమోనని భావించాము. కాని, యీ ఆశలన్నీ నిరాశ లైనాయి.

ఇందుకు కారణం — ఏనాడో మార్క్సు లెనినులు కర్షక వర్గానికి వ్యతిరేకంగా ప్రకటించిన దురభిమానాలను, భయాలను కమ్యూనిస్టులు వదలిపెట్టక పోవడం, క్రమానుగతంగా వస్తున్న కర్షక వర్గ వ్యతిరేక భావాలను వదలి పైకి వెళ్లలేక పోవడమే.

చైనా పరిస్థితులను, భారతదేశంలోని అనుభవాలను, మనం దృష్టిలో ఉంచుకుంటే, కమ్యూనిస్టులు ఆనాటినుండే వారి వెర్రి ఆశ అయిన కార్మికవర్గ నియంతృత్వం కోసం మాత్రమే తొందరపడే వారని, రైతులను కొల్లగొడుతున్నారని, యీనాడు మనకు బోధ పడుతుంది.

భారత దేశపు జనాభా 40 కోట్లలోనూ నూటికి ఎనభై మంది రైతులే. భారత కమ్యూనిస్టు పార్టీని అసంఖ్యాకమైన రైతాంగపు ఆకాంక్షలనూ, సౌభాగ్యాన్నీ, నాశనంచేయ నిశ్చ యింప జేసి, ఆ పార్టీని భారత జాతీయతకు, రైతాంగానికి వ్యతి రేకంగా పనిచేసే మాయలమారి సంస్థగా మార్చగలిగిన రైతువర్గ వ్యతి రేక భావాలూ, దురభిమానాలూ, భయాలూ, ఏవి ?

సామ్యవాద భావాలను సంస్కరించిన మార్క్సు, ఏంజల్సు, యిద్దరూ కూడా రైతులకు, వారి విప్లవ అంతస్తుకూ, అవసరాలకూ, ధారణాశక్తికీ, ప్రపంచ సాంఘిక విప్లవంలో వారి స్థానానికీ,— వీటి అన్నిటికీ వ్యతిరేకంగా, దురభిమానాలతో నిర్ణయాలు చేశారు. ఈ దురభిమానాలకు నిదర్శనం లేదు; అవి చరిత్రకు వ్యతిరేకములు కూడా.

మొట్టమొదట 1848 లో వీరిద్దరూ కమ్యూనిస్టు ప్రణాళికలో తమకు కర్షక ప్రజా వర్గాలలో విశ్వాసం లేదని ప్రకటించారు. "ప్రజ" అంటే, ఉద్యోగస్తులూ, మేధావంతులూ, పారిశ్రామికులూ, విద్యాధికులూ, వీరందరి కూటమి అయిన వర్గం.

ఆనాడు వారు కర్షక ప్రజా వర్గాల గురించి యీవిధంగా వ్రాశారు "మధ్య తరగతిలో క్రిందివర్గాల చిన్న చిన్న ఉత్పత్తిదారులూ దుకాణ దారులూ, రైతులూ—వీరందరూ మధ్యతరగతి విభాగాలుగా

తమ స్థితులు నశించిపోకుండా ఉండాలని మాత్రమే బూర్జువావర్గానికి వ్యతిరేకంగా పోరాటం సాగిస్తారు. అందుచేత వారు విప్లవవాదులు కారు; మార్పును అంగీకరించని ఛాందసులు మాత్రమే! అంతకంటే అధికం — వారు విప్లవ వ్యతిరేకులు కూడాను. వారు చరిత్ర చక్రాన్ని వెనుకకు తిప్పుదామని ప్రయత్నిస్తారు. వారు ఎప్పుడైనా విప్లవ వాదులు కాగల్గితే, అద్యతన భావిలో కార్మికవర్గంలోకి తప్పనిసరిగా మారవలసి వస్తుందనే నమ్మకమే అందుకు కారణం...అంటే, వారు వారి హక్కులను సంరక్షించుకోరు; దృక్పథాన్ని వదులుకోటం కార్మికవర్గపు పంథా అనుసరించడానికి మాత్రమే!"

"కాపిటల్" అన్న గ్రంథంలో రైతాంగము గురించి "మార్క్సు ఉవాచ" అని ఏంజల్సు యీవిధంగా వ్రాశాడు:

"అనాగరికుల సాంఘిక వ్యవస్థలోని అసభ్యతనూ, సరసత లేకపోవడాన్ని, నాగరిక దేశాలలోని అనంతకోటి దరిద్రాలతోనూ, బాధలతోనూ, మేళవింపుచేస్తూ, మానవ సంఘానికి సగం బైటనే నిలబడిఉన్న సభ్యతలేని ఒక ప్రత్యేకవర్గం యిది."

"ప్రపంచరైతాంగపు సవాల్" (The Challenge of the World Peasantry) అన్న గ్రంథంలోనూ, "జాతీయ విప్లవ మార్గపు ముఖ్యమైన పంక్తులు" (The Outlines of the National Revolutionary Path) అనే గ్రంథంలోనూ ఆచార్యరంగా ఈతప్పుడు వాదాన్ని అంతటినీ ఖండించారు. ఇది చరిత్రకు వ్యతిరేకమని, రైతులకూ, చేతిపని వారలకూ హానికరమని, రుజావుచేయుబడింది. సెర్వియన్ రచయిత 'ప్రిబిచేవిచ్' తాను వ్రాసిన "లివింగ్ స్పేస్" (Living space) అన్న గ్రంథంలో యీ వాదాన్ని దుయ్యబట్టెడు

ఈ వాదాన్ని గూర్చి —

మొదటి సంగతి ధనికవాద విజయంవల్ల ఊరూ పేరూ లేకుండా పోతుందేమో నని భయపడ వలసిన వర్గంకాదు రైతులది. ఎందుచేతనంటే వ్యవసాయానికి కావలసిన పనిముట్లను, వ్యవసాయ సంపదను, వ్యక్తిగతమైన ఆస్తిగా లెక్కిస్తుంది కమ్యూనిస్టు ప్రణాళిక. ...వీటిమీద నెమ్మదిగా, అధికంగా, హక్కులను సంపాదిస్తూ బలపడుతూ ఉన్న యీనాటి స్వతంత్ర రైతువర్గంకూడా అధునాతన కూలీవర్గమువలెనే అధునాతన ధనికవాదము యొక్క సృష్టియే.

రెండో సంగతి — కర్షక వర్గం మధ్యతరగతిలోని ఒక పక్షం గానో, ఒక విభాగంగానో లేదు; ధనిక వాదాన్ని ఎదుట నశింప జేయడానికే, స్వతంత్ర జాతిగా వారను లవడానికి, కార్మిక వర్గానికి ఎంత హక్కు ఉందో, అంతే హక్కు ఉన్న ప్రత్యేక వర్గంయిది. ఆసియా ఖండంలోనూ, ఆఫ్రికా ఖండంలోను చేలి పనివారల వర్గం డా యిలాంటిదే!

రైతువర్గం బావి భాగ్యంలేని వర్గం అనీ, విలయం కాక తప్పదనీ, మార్క్సు తొందరగా చేసిన నిర్ణయం తప్పు: యీ సంగతిని చరిత్రకూడా రుజువు చేసింది. అందుచేత వారు చెప్పిన వాక్కులు కాకనీ, మార్పు కోరని ఛాందసులు మాత్రమేననీ మార్క్సు చేసిన సిద్ధాంతం ఘోరమైన దోషం.

ఇక రైతులు తప్పని సరిగా కార్మికవర్గంలోకి మారిపోతారనే మార్క్సు వాదం కూడా తప్పుల తడక. గ్రామీణ ప్రజానీకం లోని అధికతర పక్షాలూ, పారిశ్రామికంగా పెంపొందిన దేశాలలోని కార్మిక వర్గంలోని పక్షాలు కొన్నీ, వేరు వేరుగా స్వతంత్రంగా, ఆర్థికంగా తమను తాము పోషించుకోగల శక్తిలో ప్రత్యేక వర్గాలుగా తయారు అవుతున్నాయి వీటికి కూడా సక్రమ నిర్మాణం, వర్గ చైతన్యం, ప్రత్యేకమైన తాహతూ, ఉన్నాయి.

సోవియట్ రష్యాలో రైతులను రైతులుగా ఉంచకూడదని, వారిని నశింప జేయ్యాలని, కార్మిక వర్గంతో మిళితం చెయ్యాలని ప్రచండమైన ప్రయత్నాలు జరిగాయి వారి వర్గ సంఘాలను స్థాపించుకొనే పాటి హక్కు కూడా వారికి లేదన్నారు; సమిష్టి వ్యవసాయాన్ని, కేజి యంత్రాల సహాయంతో నడపబడే వ్యవసాయాన్ని ప్రవేశపెట్టారు

కాని, యీనాటికీ ఆదేశంలో కర్షకులు ప్రత్యేకంగానూ వేరుగాను ఉన్న తరగతిగానే ఉన్నారు కార్మికవర్గంతో కలిసి పోవుటకు అంగీకరించ లేదు కర్షకులు అనుసరించే వృత్తి వల్లనే ఆ వర్గానికీ, కార్మిక వర్గానికి ప్రత్యేక విశిష్టతలలోను, గుణాలలోను, భేదం ఏర్పడు తున్నదనీ, కర్షక వర్గానికి ప్రత్యేకం విభిన్నం, వర్గ

గతం అయిన ప్రయోజనాలున్నాయనీ, పాత సూత్రాలను పఠించే బోల్షివిక్ పార్టీ గుర్తించలేదు. కాని, ఆ సంగతి అప్పటికే రైతాంగానికి తెలుసు.

చైనా కర్షక వర్గం, భారత రైతాంగం, చాలా కాలంనుంచీ ప్రాక్పశ్చిమాల ఫాసిజమ్, సామ్రాజ్యవాదాల ఎదురు దాడులను ధైర్యంగా, జయప్రదంగా, ఎదిరించి నిలబడి, మార్క్సు, ఏంజెల్సు ఉద్ఘాటించిన కర్షక వర్గ వ్యతిరేక సిద్ధాంతాలు తప్పు అని ప్రకటిస్తున్నాయి. "ప్రపంచ సాంఘిక విప్లవంలో ప్రత్యేకమైన ప్రముఖ స్థానం యిది" అని ముక్త కంఠంతో చెప్తున్నాయి

మార్క్సు జోస్యం చెప్పిన కార్మిక విప్లవ యుగం కాదు యిది, లెనిన్ చెప్పిన వలస రాజ్యాల జాతీయతతో సమ్మిళితమైన గ్రామీణ విప్లవయుగం.

లెనిన్, అతని లండను ప్రతినిధి పామీదత్తు, అంగీకరించక పోయినా, యీనాటి వలస రాజ్యాల గ్రామీణ విప్లవంలో, "ప్రజా" వర్గం సహాయంతో, మార్గదర్శకత్వంతో, నడిపింప బడుతున్న కర్షక వర్గం విప్లవ శక్తులలో ప్రథమ శ్రేణిగా ప్రముఖ స్థానం ఆక్రమించినట్టుగా కార్మిక వర్గం ఆక్రమించ లేకుండా ఉంది; కార్మిక వర్గం గమనార్హమైన విప్లవ శక్తిగా లెక్కలోనికే రాలేదు. ఈనాడు ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా, ఆగ్నేయ యూరప్ ఖండాలలో పురోగమనం, శక్తివున్న విప్లవ శక్తులలో ప్రథమ శ్రేణి రైతాంగానిదే; వారే ఆయా దేశాలలోని జన సంఖ్యలో అధిక సంఖ్యాకులు

రైతులు విప్లవ ప్రతికూలురనీ, మానవ సంఘానికి బైటనే సగానికి పైగా ఉన్నారని, మార్క్సు చెప్పిన మాటలు తప్పని "ప్రపంచ రైతాంగపు సవాల్" అనే గ్రంథంలో రుజావు చేయబడింది. రైతు వర్గానికి కూడా ఏ యితర వర్గానికీ తీసిపోని-రష్యన్ కార్మిక వర్గానికి కూడా తీసిపోని-విప్లవ విజయానికి అఖండమైన విప్లవ సంప్రదాయాలు, ఉన్నాయనికూడా రుజావుచేయబడింది. బాల్కన్ రైతులు అనేక విప్లవాలను సాగించి నేటి తమవాక్కుల, వోదానా సంస్థను ఎలాగ తెచ్చుకున్నరో "ప్రెటిచేవిచ్" వర్ణించాడు;

* * *

మార్క్సు తరువాత వచ్చిన సోషలిస్టులకు చాలా నిజమైన సిసలైన మార్క్సు సిద్ధాంతాలనే తూచా తప్పకుండా అనుసరిస్తామని గర్వం అయితే, ఏంజల్సు చెప్పినట్లు, మార్క్సు మాటలకు అధికమైన విలువ నిచ్చి లెక్క పెట్టుకున్నా, అవి ఆనాటి ఆర్థిక పరిస్థితులను దరిదాపుగా చూపించే సిద్ధాంతంలోని ఒక భాగం మాత్రమే నన్న సంగతి వీరు మరచి పోయారు. మార్క్సు ఏంజల్సు నాటికి ఆసియా, ఆఫ్రికా దక్షిణ అమెరికాలలోని వివిధ జాతుల విషయంలో మహా పండితులకు కూడా మిడి మిడి జ్ఞానమే ఉండేది. ఆయా జాతుల చరిత్రా, పురాతన మానవ సంఘ చరిత్రా, పురాతత్వ శాస్త్రం, ఇప్పుడున్నంత అధికంగా అభివృద్ధి చెంది ఉండలేదు, నిజానికి మార్క్సు ఏంజల్సు ఆయా జాతుల చారిత్రక, రాజకీయ, ఆర్థిక పరిస్థితుల గూర్చి అధికమైన జ్ఞానాన్ని సంపాదించలేదు. సంపాదించకుండానే కర్షకవర్గానికి వ్యతిరేకంగా కొన్ని సిద్ధాంతాలనూ, దురభిప్రాయాలనూ, ప్రకటించారు. మార్క్సును అనుసరిస్తున్న యీ సనాతన వాదులు యీ ఇరవయ్యో శతాబ్దంలో కూడా ఆనాడు మార్క్సు కర్షక వ్యతిరేక ధోరణిలో ప్రకటించిన సిద్ధాంతాలనేమి, దురభిప్రాయాలనేమి, సూత్రప్రాయంగా అంగీకరించాలంటారు.

ఈ విధంగా అంగీకరించడ మనేది కూడా మార్క్సు లెనిన్ల బోధనలకు వ్యతిరేకమే *

అయితే, వీరు యీ తప్పెందుకు చేశారు?

"నాటి అయిన నిర్ణయంతో, ముందుగా నిర్ణీతమైన ఒక లక్ష్యానికి వెళ్ళటమే పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క జాడ" అని మార్క్సు ఉద్ఘాటించాడు. యూరప్ ఖండ దేశాలలోనే కాకుండా, తక్కిన ఖండాలలోని దేశాలలో కూడా సాంఘిక, రాజకీయ, ఆర్థిక సంప్రదాయాలు, విధానాలు, పరిస్థితులు, యుగధర్మాలు, మారిపోతున్నాయని గుర్తించకుండా, వీరు మార్క్సు వ్రాసిన యీ పంక్తుల కనుగుణంగా అంతా జరగా లంటారు.

లెనిన్ "ప్రభుత్వం, విప్లవం" అన్న గ్రంథంలో ఉద్ఘాటించినట్లు మార్క్సు తన నిర్ణయాలను యూరప్ ఖండ దేశాలకు చెంది

* చూ 'తార్కిక భౌతికవాదం" 7వ ప్రకరణం.

పట్టు తయారు చేశాడు. ఈనాటి మార్క్సువాదులు పిడుగుకూ, బియ్యానికీ ఒక్కటే మంత్రం చదువుతారు. ఆనాటి సూత్రాలే యీనాడు కూడా ప్రపంచంలోని అన్ని దేశాలకూ ప్రయోగిస్తామంటారు "ప్రతి చారిత్రక యుగానికి, యితర యుగాల కన్నిటికీ వేరైన అద్వితీయమైన శాసనాలు కొన్ని ఉంటా"యని (ఇది మార్క్సు చెప్పిన సంగతే) వీరు మరచిపోయారు.

బహుశః యీ సంగతులనూ పరిస్థితులనూ, ఆలోచించే కాబోలు తాను మార్క్సువాదిని కాను పొమ్మన్నాడు మార్క్సు.

"మానవ సంఘం జాగీరుదారీ పద్ధతి నుండి ధనిక వాదం వైపు వేసే ముందడుగులో కర్షకులూ, వారి ఆర్థిక ప్రతిపత్తీ, నాశనమై పోతా"యని మార్క్సు, ఏంజల్సు, లెనిన్‌లు ఎందుకు అన్నారు? అంటే అందుకు కారణం, మార్క్సు చెప్పినట్టుగా, రైతులు మధ్య తరగతిలో ఒక భాగమనుకున్నారు. అదే మార్క్సు ఏంజల్సులు చేసిన గొప్ప తప్పు కూడా. లెనిన్ కూడా "కర్షకులు ధనిక వాద వర్గంలో చివరివారు" అని దురభిప్రాయ పడ్డాడు.

ధనిక వాదం ముందంజ వేస్తుందని, ధాన్యోత్పత్తి దార్లను దరిద్రులుగా చెయ్యటం, వారిని భూములనుండి వేరు చెయ్యటం, యీ విధానానికి ప్రాతిపదిక అని మార్క్సు అన్నాడు. అయితే, సమిష్టిగా ఏర్పచబడిన రష్యన్ రైతాంగం ఈనాటికి కూడా కార్మిక వర్గంతో మిళితం కాలేదు; పోనీ సగమైనా కూలీ వర్గానికి చెందారా అంటే అదీ లేదు. సంపూర్ణ వర్గ చైతన్యం ఉన్న కర్షకులు గానే ఉన్నారు అంటే మార్క్సు భావించినట్టు జరగ లేదన్నమాట.

ఆనాడు లక్షలాది మానవులనుండి వారి జీవితాధారాన్ని హఠాత్తుగా పడగొట్టిగాని, బలవంతంగా తీసుకొనిగాని, వారిని కార్మిక విపణి వీధిలోకి అనాథలైన కార్మికులుగా కలిపి వేయడమే విప్లవ విధానం అని మార్క్సు అనుకున్నాడు, మొట్టమొదటి ఉత్పత్తిదారులను యీ విధంగా దరిద్రులుగా చెయ్యడంలో ఎంత నిర్దయా, ఎంత వినాశన కాంక్ష, శక్తిని కల్గినిస్తున్నారో అందుకు ఎంత అవమానకరము నీచము హీనము అయిన శక్తినిస్తున్నారో మార్క్సుకు తెలుసును "రైతాంగం విలయం కాక తప్పదు" అన్న తప్పునిర్ణయాన్ని,

దురభిప్రాయాన్ని, మార్క్సు ప్రకటించి వుండకపోతే, కోట్లకొలది రైతు జనులని యీ విధంగా అమానుషంగా దరిద్రులుగా చెయ్యడం గొప్ప తప్పిదమేనని ఆతనే అకుంఠితకంఠంతో నిర్వచించి వుండును.

“వెట్టిబడిదారీ విధానం ఆచరిస్తున్న యీనీచపు పద్ధతులను రైతు క్రమపద్ధతులపై నడుస్తూ అరికట్ట ప్రయత్నిస్తే వారు విప్లవ వాదులు కాదని, మార్పు అక్కరలేని ఛాందసులనీ, అన్నిటికన్నా అధికం వారి అభివృద్ధి నిరోధకులనీ “కమ్యూనిస్టు ప్రణాళిక”లో వున్నది మార్క్సు వాదులు అంటూవుండడం చాలా విషాదకరమైన విషయం.

* * *

మార్క్సు కర్షకులకు వ్యతిరేకమైన ధోరణిలో చెప్పినదానిలో శేష్య సూత్రం —

“విశ్వ వ్యాపకమైన మధ్యతరగతి ప్రపంచం అంతరయ్యే వరకూ వుంటుందనే తీవ్ర కర్షకుల ఆర్థిక సమస్య” అని అంటాడు. “మానవ సంఘంలో లోపలనే కుములుతున్న శక్తులూ, ఆకాంక్షలూ, యీవిధమైన ఉత్పత్తిని సంకెళ్లుగా భావిస్తున్నాయి” అని చెప్పి “ఈ వుత్పత్తి నాశనం చెయ్య బడాలి, నాశనం చెయ్యబడుతున్నది. కూడా” అని నిర్ణయించాడు.

అంతకంటే హెచ్చు ... “జనులను భయానకంగా, విషాదకరంగా, దరిద్రులను చేసే యీవిధానము చరిత్రకు నాంది” అని మార్క్సు వాదించాడు.

కర్షక కార్మిక వర్గాల ఆర్థిక వ్యవస్థను శక్తివంతంగా చెయ్యడానికి సహకారసంస్థకున్న శక్తిని మార్క్సు గ్రహించలేకపోయాడు. ఇందుకు కారణం అసంస్థ నిర్మాతలైన లెజిపయాన్, ఫ్రెంచి సోషలిస్టులమీద ఆతనికున్న దురభిప్రాయం; అలాగ గ్రహించలేక, కర్షక కార్మిక వ్యవస్థ పోవాలని. ధనికవాద పురోగమనానికి అడ్డుతగిలితే అన్నిశక్తులలాగే అవిపోతాయని, భావించి ఘోరమైన తప్పిదం చేశాడు.

అయితే, సహకార సంస్థతో మిళితమైన కర్షక ఆర్థిక వ్యవస్థ, సంఘంలో లోపలనేవుండి సంఘాన్నంతటినీ ఊగిసలాడించే పురోగమన శక్తులలో ఒకటిఅన్నసంగతి క్రిందటి శతాబ్దానికిచెందిన

మార్క్సు గ్రహించలేదంటే తప్పులేదు; కాని, ఈనాడు, ఇరవయ్యో శతాబ్దంలో, మార్క్సును తూచా తప్పకుండా, అనుసరిస్తున్న యీ సనాతనవాదులు ఇంత చిన్నసంగతిని గ్రహించలేదంటే క్షమించకూడని దోషమే అవుతుంది.

ఏంజల్సుమాత్రం కర్షక ధనిక వర్గాలకున్న సంబంధం యింత కంటె తక్కువ కరడుగట్టిపోయిన, మిక్కిలి వాస్తవికమైన, ధోరణిలోనే ప్రదర్శించాడు. అతనిమాటలు యివి;

"నిశ్చయంగా, చిన్నరైతులకు సహాయంగానే మనం ఉన్నాము; మనం అతని జీవితాన్ని సాధ్యమైనంత సుఖవంతంగా చెయ్యాలనే సర్వవిధాలా ప్రయత్నిస్తాం. సహకార సంస్థలోనికి మారేటప్పుడు, అతను అంగీకరిస్తే, మార్పు సులభంగా ఉండేటట్లు చేస్తాం. ఇంకా ఆవిధంగా మారడానికి అతను నిశ్చయించుకోకపోతే, నిశ్చయించుకోడానికి తగినంత వ్యవధి యిస్తాము."

ఈవిధంగా ఏంజల్సు చెప్పినతర్వాత, యీ 60 ఏళ్లలోనూ, స్కాండినేవియానుండి నెదర్లాండ్సు వరకూ, ఇటలీనుండి ఐర్లాండు వరకూ, అమెరికానుండి జపాన్ వరకూ, అనేక దేశాలలో, రైతులు అనేకులు తమ వ్యవసాయికవిధానాలలో అత్యధికంగా సహకార మార్గాన్ని అనుసరిస్తున్నారు. సోషలిస్టులు సహాయంచెయ్యకపోయినా సరే, కొన్నిచోట్ల వ్యతిరేకంగాకూడా ఉన్నాసరే, యీవిధానం అనుసరించబడుతున్నది. ఈనాడు సోవియట్ రష్యాలో కార్మిక నియంతృత్వం అమితోత్సాహంతో, తన సర్వశక్తులనూ కేంద్రీకరించి ఈవిధానాన్ని ముందుకు నెట్టుతున్నది.

అంటే, కర్షక వర్గమయినా, వారి ఆర్థిక వ్యవస్థఅయినా నాశనంచేయబడుటకు బదులు...గుర్తించబడ్డాయి అన్నమాట; కర్షకుల ప్రాముఖ్యాన్ని బలపరచారు అన్నమాట.

ఈ పరిస్థితులలో కూడా మార్క్సు ప్రకటించిన కర్షక వ్యతిరేక భావాలమీద ఆధారపడే రష్యాలోను, యితరదేశాలలోను, సనాతన కమ్యూనిస్టులు అందరినీ తిడతారు. పాపం! వారు కలలు కంటున్న కర్షక నిర్మూలన విధానానికే సహాయంచేదామని ప్రయ-

త్తిస్తున్నారు; కర్షక వర్గానికన్న భావికౌన్నత్యంలో జాతికి నమ్మకం లేదు.

రష్యాలో సోవియట్ నియంతృత్వంలో కార్మికవర్గం అత్యున్నతస్థానం ఆక్రమించి, ప్రభుత్వానికి ముద్దుబిడ్డ అయింది కాని, అక్కడి కోల్‌ఖోజ్ రైతులు రైతులుగానే ఉన్నారు కార్మిక వర్గంతో మిళితమై కార్మికులవలేదు

అంటే, వారు భావించినట్లుగా నైతేనేమి, మార్క్స్ ప్రకటించినట్లుగా నైతేనేమి, "సాంఘిక విప్లవం" యింకా ఆఖరవలేదన్నమాట

"సాంఘిక విప్లవం" ఆఖరవదు కూడా.

కర్షక వర్గానికి వ్యతిరేకంగా సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ కమ్యూనిస్టుల ప్రణాళిక తయారయిన తర్వాత యీ నూరు సంవత్సరాలలోనూ ఆర్థిక వ్యవస్థయొక్క చరిత్ర యిచ్చిన తీర్పు యిది.

ప్రపంచంలో యీనాడు 120 కోట్ల రైతులు వ్యక్తిగతంగా గాని, సమిష్టిగా గాని, వ్యవసాయం చేస్తున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోనూ, ఫ్రాన్సు, జర్మనీలలోనూ, ఉన్న గ్రామీణ ఆర్థిక వ్యవస్థను మాత్రమే దృష్టిలో పెట్టుకొని ఆనాడు మార్క్సు జోస్యం చెప్పిన కర్షకుల సర్వనిర్మూలనానికి సూచనలేవీ కనబడటం లేదు. పైగా, దినదినం ఆ వర్గపు ఆర్థిక వ్యవస్థ, ఉచ్ఛదశలోకే వస్తున్నది

జమీందారీ పద్ధతిలో దాస్యం చేస్తూ బానిసలుగా ఉన్న రైతులు జమీందారీ పద్ధతి పోగానే దాస్య శృంఖలాల నుండి విముక్తులు అయిన తర్వాత అభివృద్ధి నందుతున్న యీ పారిశ్రామిక యుగంలో యీనాడయినా, మరోనాడయినా పద్ధతి అంటూ లేని కార్మిక వర్గంకింద తయారవుతుందని మార్క్సు, అతని సనాతన వాదాన్ని అనుసరించే వారూ, భావించారు. ధనిక వాదం బలపడుతున్న కొద్దీ, ధనిక వాదులు కర్షకులు జమీందారీ పద్ధతినుండి విముక్తులను చేసిన కొద్దీ, వినూత్న వాస్తవిక హక్కులతో ఆకాంక్షలతోనే ఒక కొత్త కర్షక వర్గం తయారవుతుందనీ, వారు గ్రహించలేదు.

నిజానికి ఆనాడు అన్ని దేశాలలో, పట్టణాలలోను గ్రామాలలోను జీవిత విధానానికి కావలసిన వ్యవసాయోత్పత్తినీ, విభజననూ, తన అదుపు ఆజ్ఞలలోకి తెచ్చుకొని, ధనికవాదం ఒక విశ్వశక్తిగా మారుతోంది. ప్రపంచ ధనిక వాదం మధ్య తన ఉత్పత్తి, విభజన (పంపకం) చర్యలను సుసంఘటితంగా స్థాపించుకున్న ఒక వినూత్న కర్షక సంస్థ ఏర్పడుటకు ఆ మహాశక్తి ప్రోత్సహిస్తుంది. ఆనాటి కర్షక వర్గం స్వయంరక్షణకోసం స్వయం కృషిమీద ఆధారపడ్డ సంస్థలను తయారు చేసుకుంటుంది. కాని, యీ సంగతులన్నీ వారు గ్రహించలేరు.

ఈ సంగతులనే కొంతవరకు మాచాయగా సూచించాడు మార్క్సు యీ క్రింది పంక్తులలో—

"జమీందారీ పద్ధతి పోగానే, స్వల్ప పరిమాణంలో నయినా, భారీకాని వ్యవసాయమే ప్రత్యేక చేతి పరిశ్రమలూ పెట్టుబడిదారీ ఉత్పత్తి పక్కనే బయలు దేరాయి.

కాని, ఆతనూ లెనిన్ కూడా జమీందారీ పద్ధతినుండి విముక్తులై, రాజకీయ ఆర్థిక రంగాల్లో అప్పుడే పాదమూపుతున్న అసంఖ్యాకులైన కర్షకుల అవసరాలకీ, యివ్వవలసినంత ప్రాముఖ్యతను యివ్వలేదు.

ఈ మార్పును గూర్చి వెబ్బు "సోవియట్ కమ్యూనిజమ్"లో యిలాగ వ్రాశారు,

"బూర్జువా పారిశ్రామిక విప్లవం దాస్య శృంఖలాలలో నున్న వారిని కర్షకులుగా మార్పించెనని, రష్యాలోనే ఇతరయూరోపియన్ దేశాలలోను, మొదటి వ్యవసాయక విప్లవంగానే, చాలా మంది విజ్ఞులు గుర్తించేరు"

అయితే 19వ శతాబ్దం రెండో సగభాగంలోనూ, 20వ శతాబ్దంలోనూ, అనుసరించబడుతున్న విధానం ఏమిటి?

బానిసత్వం, వెట్టిచాకిరీలనుండి విముక్తులగుట మొదట శాశ్వతభూమి సాగుబడి హక్కునీ, భూమిమీద సంపూర్ణ అధికారాన్నీ సంపాదించునంత వరకూ అనేక కొత్త హక్కులను వేర్వేరు దేశాలలో అసంఖ్యాకులైన కర్షకులు సంపాదించ గలిగారు; సక్రమ పద్ధతిలో గాని, బలవంతంగా గాని, అనేక పెద్ద జమీందారీలు ముక్కలు

ముక్కలుగా చేయబడి, రైతులకు పంచిపెట్టబడ్డాయి. రైతులు జమీందారీ పద్ధతినుండి, యితర కష్టనష్టాలనుండి, అన్యాయమైన పన్నులనుండి బైటపడుతున్నారు. ఈనాటికికూడా అనేకమంది రైతులు తమ భూముల విషయంలో కొత్తహక్కులను సంపాదించు కుంటున్నారు. నేడు యీదేశంలో రేపు పరొక దేశంలో! 1911 నుండీ లాటిన్ అమెరికాలోని కర్షకులూ, 1919 నుండీ బాల్కన్ రాజ్యాలలోని కర్షకులూ, మేల్కొని పోరాటం సాగిస్తున్నారు. 1925 నుండి చైనా కర్షకులు సమిష్టిగా ముందడుగు వేస్తున్నారు. 1920 నుండి భారత దేశంలోనూ, యీనాడు ఆఫ్రికాలోనూ, కర్షకులు తమ "ప్రత్యేక ఆవరణ" (రిజర్వు) లలో తమ జీవితాన్ని గడిపే ప్రయోజనానికి యూరోపియన్ తోటలను విభజించుకోడానికీ, హక్కులను సంపాదించుకుంటున్నారు.

ఇదంతా మార్క్సు, ఏంజెల్సు "కమ్యూనిస్టు ప్రణాళిక"ను నిర్మించి ప్రకటించిన తరువాతనే!

* * * * * *

వ్యక్తిగతంగా గాని, చెదరిపోయి గాని, ఉన్న ఉత్పత్తి విధానాలలో మార్పు నిశ్చయంగా ఉంటుంది" అని ఆనాడు జోస్యంగా మార్క్సు చెప్పిన నిర్ణయం కాని, యీనాటి వరకూ యంత్రాలపై భారీ పరిశ్రమలను నడుపుతున్న దేశాలలోనైనా పెట్టుబడిదారీ వ్యవసాయానికి నిశ్చయమైన ప్రాతిపదిక సాధించబడలేదు. మార్క్సు జరగక తప్పదని నిర్ణయించిన విధంగా అత్యధిక సంఖ్యలలో గ్రామీణ జనులు దరిద్రులుగా చెయ్యబడలేదు

కర్షకుల ఆర్థిక వ్యవస్థను సహకార పద్ధతి వేరైన వ్యవస్థ అని మార్క్సు అనుకున్నాడు. అందుచేతనే ఎవరూ అనుసరించలేరని ఇలాంటి ప్రతిపాదనలు చేశాడు. ఆసియాలోనూ, ఆఫ్రికాలోనూ ఉన్న కర్షకుల సహకార సాంప్రదాయాలను, వాటి వైశాల్యాన్నీ వాటి విలువను సంపూర్ణంగా అర్థం చేసుకొనలేక పోయాడు. సహకార సాంప్రదాయాలంటే ఉత్పత్తి విధానం, ప్రకృతి శక్తుల తీర్చి దిద్దుటకై సంఘమునకున్న ఉత్పత్తియొక్క సాంఘికశక్తుల అత్యధిక అభివృద్ధిని.

సహకార పద్ధతిమీద అప్పులుయిచ్చేటప్పుడే ఏకంగా వస్తువుల కొనుబడి, పంటల అమ్మకము మొదలైన చర్యలు వ్యవసాయానికి కావలసిన ధాన్యాన్ని ఎరువులను పనిముట్లను కొనుట వీటి ఉపయోగములకై వినూత్నమార్గాలలో పరిశోధనలను సాగించుట, వ్యవసాయక శాఖలో అభివృద్ధికి కావలసినంత సహకారం యీనాడు అన్ని దేశాలలోనూ సర్వసామాన్యమైన పరిస్థితి కాని, మార్క్సు ఆనాడు యీవిషయాల గూర్చి స్థైర్యంగా ఆలోచించి వాటిని గూర్చి నిర్ణయాలను చెయ్యలేక పోయాడు.

నిజానికి భారత దేశంలో చైనాలో ఆఫ్రికాలో చెరువులూ కాలువలూ బాగు చేసుకోడంలోనేమి భూమివిస్తారం కాకుండా సంరక్షించుకోడంలోను ఈతిబాధలతో పోరాడటంలోను తమ పశు సంపద యొక్క సతానౌన్నత్యాన్ని రక్షించుకొనడంలోను ప్రతిదినం చేసే యితర వ్యవసాయిక చర్యలలోను, తమ సంప్రదాయ సిద్ధమైన మార్గాలను అన్నివిధాలా సహకార పద్ధతులమీదనే కర్షకులు అభివృద్ధి చేసుకుంటున్నారు.

వ్యవసాయిక పశుసంపదల గుణవిశిష్టతలో సంస్థలు, అమ్మకం, అప్పులు మొదలగువాని వివిధ మార్గాలలో, వాటి విలువలలో, కర్షకుల వర్గచైతన్యంలో, వారి సంస్థలోని జీవితంలో, వారి ఆలోచనా విధానంలో, ఔన్నత్యంలో, యీనాడు 20 వ శతాబ్దంలో అత్యధికంగా విప్లవకరమైన మార్పులువచ్చాయి. ప్రపంచంలో అన్ని దేశాలలో, 19 వ శతాబ్దపు రెండో సగభాగంలోఉన్న కర్షకునికీ, 20 వ శతాబ్దపు మొదటి సగభాగంలోఉన్న కర్షకునికీ, గుణవిశిష్టతలలో చాలా భేదం ఉందని అందరూ గ్రహిస్తున్నారు.

అంటే, మార్క్సు కర్షక వ్యతిరేకంగా ఆనాడు ప్రకటించిన భావాలేమి, నిర్ణయాలేమి, అనుమాన భయాలేమి, యీనాటి కర్షక వర్గానికి ఏవిధంగానూ చెందకుండాఉన్నాయి అన్నమాట

అయితే, యీనాటికికూడా మార్క్సు అనుచరులలో సనాతన వాదులు కర్షకులు అభివృద్ధి నిరోధకులేనని నమ్మమంటారు మనలను. "ఆపాదమస్తకం బురదతో నిండిపోయి, ప్రతి రోమకూపంలోంచి రక్తాన్ని కక్కుతూ, ప్రపంచంలోకి వచ్చిన" ధనికవాదంతో కర్షకవర్గం పోరాడుతుంటే, ఈ సనాతనవాదులలో కొందరు, వలసరాజ్య

ప్రపంచంలో నేటివరకూ రూపొందిన కార్మికవర్గానికి కర్షకవర్గ సహాయం చేస్తున్నదనీ, కార్మికవర్గం పేరిట అధికారం చలాయించే ఘోర కమ్యూనిస్టుపార్టీ నియంతృత్వానికి కర్షకవర్గం దారి సరిచేస్తున్నదనీ, పాపం ధైర్యం చెందుతున్నారు.

మార్క్సు నమ్మినట్టే, నిశ్చితమైన ఒక నిర్ణీతస్థానానికి రైతులోకం నడవక తప్పదని వీరుకూడా నమ్ముతారు. అంటె, మార్క్సుతో పాటు పరిణామ — 'పూర్వనిర్ణీత' వాదాన్ని, కర్మవాదాన్ని, వీరుకూడా నమ్ముతున్నారన్నమాట* ఇంగ్లండు ఐర్లండు దేశాల కర్షక వర్గానికి పట్టిన దుర్గతే ప్రపంచంలో యితర దేశాల కర్షకవర్గానికి పట్టడం నిశ్చయమని వీరు నమ్ముతున్నట్లు తెలుస్తుంది —

మార్క్సువాదులలోని సనాతన వాదులు యీ దృక్పథాన్ని సమర్థించుతూ యిట్లా వాదిస్తారు "మార్క్సు యీ విధమైన అంచనా విధానాన్ని అనుసరించాడు ఇంగ్లాండు ఐర్లాండులలోని కర్షక వర్గం ఎట్లా నశించిపోయిందో అతను జాగ్రత్తగా పరిశీలించాడు అందుచేత మార్క్సు నిర్ణయించినట్లు, ఇతర దేశాల కర్షకవర్గం ఆదే దుర్గతినుండి ఎంత విశ్వప్రయత్నం చేసినా తప్పించుకోలేదు"

మార్క్సు గావించిన పరిశోధనలు విలువను ఎవరైనా ప్రశంసించి, అంగీకరిస్తారు, మేమూ అంగీకరిస్తాము కాని, మార్క్సు — గావించిన పరిశోధనాలు, చేసిన నిర్ణయాలు ఆరోజులలో, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలోని కర్షక వర్గాలను గూర్చి మహాపండితులకు కూడా మిడి మిడి జ్ఞానమే ఉండేది. అందుచేత, మార్క్సు గావించిన పరిశోధనలు చేసిన నిర్ణయాలు, తప్పనిసరిగా యూరప్ ఖండంలోని కొన్ని దేశాలకు ముఖ్యంగా పడమటి యూరప్‌ఖండ దేశాలకు మాత్రమే చెందుతాయని మనం గ్రహించాలి.

పడమటి యూరప్ ఖండంలో కర్షక వర్గాన్ని ఎదుర్కొన్న కష్టాలు చికాకు పరిస్థితులు, యితర ఖండాలలోని కర్షక వర్గాన్ని కూడా యీ నాడు ఎదుర్కొంటున్న మాట నిజమే! కాని, ఈనాడు యీ దేశాలలో, ఆనాటి అచ్చటి విషాదాంత కథకాదు. ఈ చికాకు పరిస్థితుల్ని, కష్టాల్ని యిప్పటి రైతులు ఎదుర్కొని పోరాడి

* చూ. 'తార్కిక భౌతికవాదం' — 7వ ప్రకరణంలో.

గెల్చారు. ధనికవాదం యీనాడు పరాజయాన్ని పొందింది. స్వీయ రక్షణకోసం ప్రయత్నిస్తున్నది.

రైతులను, తోట పారిశ్రామికులను, పంటుపంట దారులను అర్ధరైతులని చెప్పి వారిని తిరిగి బానిసలుగా, పనిముట్లుగా, జీవచ్ఛవాలుగా తయారు చెయ్యడానికీ, వారిని హీనపర్చడానికీ, వారిని నిర్మూలించటానికి ధనికవాదం ఉపయోగించిన భయంకర విధానాలు మనం జ్ఞాపకం ఉంచుకుంటే, ప్రపంచ రైతు వర్గం సంపాదించిన యీ విజయాన్ని, దానిలోని గొప్పతనాన్ని మనం గుర్తించగలము.

ఆఫ్రికాలో, లాటిన్ అమెరికాలో, భారత వర్షంలో, ఫసిఫిక్ దీవులలో, అట్లాంటిక్ దీవులలో, కర్షకుల మీద ధనికవాదం యీనాడు 20వ శతాబ్దంలో సాగించిన దాడులలో ఉపయోగించిన విధానాలు, క్రిందటి అయిదు శతాబ్దాలలో ఆంగ్లేయ ధనిక భూస్వాములు ఉపయోగించిన నీచ, హీన, విధానాలకు ఏవిధంగా తీసిపోకుండా ఉండటం ఆశ్చర్యకరమైన విషయం.

కర్షక వర్గాన్ని బాధించుటకు, మోసగించుటకు, దరిద్రులుగా చేయుటకు, అనుసరించబడ్డ విధానాలను మార్క్సు అతిశ్రద్ధగా పరిశీలించి, పరామర్శించాడు. ప్రపంచ కర్షక వర్గానికి వ్యతిరేకంగా సల్పే దాడులలో ధనిక వాదం ఉపయోగించే విధానాలు సామెతలుగా నిలచిపోయాయి. వాటిని మేము సంగ్రహంగా యిచ్చట ప్రదర్శిస్తున్నాము.

రైతుల పట్ల ఆంగ్లేయ జమీందారులు, బ్యాంకు వాదులు, అవలంబించిన దమన విధానములను మార్క్సు ఉద్ఘాటించిన వాటినే, తమ వలస రాజ్యాలలో యీనాడు బ్రిటిష్, బెల్జియన్, ఫ్రెంచి, డచ్చి జమీందారులు అవలంబిస్తున్నారని చూపడానికి మార్క్సు వ్రాసిన "కాపిటల్" నుండి నిజానికి అతను వ్రాసిన ప్రధాన సంపాదన అన్న ప్రకరణంలో "ఇంగ్లీషు రైతు" అని వ్రాసిన దానికి బదులు "వలసరాజ్యాలరైతు" అని మనం చదువుకుంటే, యూరోపియన్ తోట యజమానులు వారిచెప్పు చేతలలో నున్న ధనిక వాద నిరంకుశాధికారులు, గత ఏభై ఏళ్లలోనూ వలసరాజ్య కర్షక వర్గం మీద ఉపయోగించిన, దమన విధానాన్నే ఆప్రకరణంలో తెలుస్తుంది.

15 వ శతాబ్దం నుండి 19 వ శతాబ్దం వరకూ ఉన్న ఆంగ్లేయ జమీందారులు చేసినట్లే, న్యాయశాస్త్రానికి సంబంధం లేకుండా ఏదో చట్టం పేరు చెప్పి యీ సామ్రాజ్య వాద భూస్వాముల దురాక్రమణ సాగించారు. ప్రభుత్వ భూములను కొల్లగొట్టడం, వాటి పరిమాణాలను సాధ్యమైనంత అధికంగా హెచ్చించడం యీ విధంగా "యీ పెద్దమనుష్యులు" ఒక కొత్తయుగాన్ని ప్రారంభించారు. కొన్ని జిల్లాలను ప్రత్యేక జమీలకు యిచ్చేసేవారు; ఒక్కొక్కప్పుడు వాటిని అన్యాయంగా ఆక్రమించి జమీలలో కలిపివేసేవారు.

ఈ విధంగా కెన్యాలో, వెస్టుఇండీస్‌లో, జరిగింది. అక్కడ ఆఫ్రికా దేశస్థులకు, రెడ్ యిండియన్లకూ; ఉన్న కులహక్కులను, వంశ పారంపర్యంగా వస్తున్న హక్కులను, గుర్తించకుండా, వారికి చెందిన లక్షల కొద్దీ ఎకరాల భూములను కొద్దిమంది యూరోపియన్ తోటయజమానులకు, ఆక్రమణ దారులకు యిచ్చేశారు.

"ఈ దురాక్రమణ విధానమూనా బూర్జువా పెట్టుబడి దారులు నెలవు చేశారు; పంటభూములుకూడా సాధారణ వ్యాపార వస్తువులుగా మారిపోవాలని, భారీ వ్యవసాయానికి ప్రాతిపదిక అధికం కావాలనీ, అనాధలైన కార్మికుల సంఖ్య అయితేనేమి, వారి సరాఫరా అయితేనేమి, హెచ్చు అవాలని, తాము అట్లా చేశామంటారు బూర్జువా పెట్టుబడి దారులు" అని మార్క్స్ అన్నాడు;

అప్పటి విధంగానే యిప్పుడు కూడా, ఉన్నత ఆర్థిక వ్యవస్థకు ముద్దు బిడ్డ అయిన బ్యాంకు తత్వానికి సామ్రాజ్యవాదులైన జమీందారులు నేస్తులు. నేటి వంగరాష్ట్రంలోని జమీందారులు యీ విషయానికి ఒక ఉదాహరణ. ఈ ఉన్నత ఆర్థిక వ్యవస్థనే "ఆర్థికమూలధనం" అంటాడు లెనిన్.

ఆనాడు "ప్రజల భూములను దొంగిలించడానికి శాసనాలు పనిముట్లుగా" ఉపయోగించాయి. నేడు కూడా అవి అలాగే ఉపయోగిస్తున్నాయి. ఆనాటి యింగ్లీషు జమీందారుల లాగే, నేటి సామ్రాజ్యవాదులు కూడా "వలస రాజ్యాలలోని ప్రజల బీదతనం మీదనే తమ ఐశ్వర్యాన్ని ఆధారపరచాలని" నమ్ముతున్నారు. అందుచేతనే ఆయా దేశ ప్రజల మీద ఇంటిపన్ను, తలపన్ను, విధించి ఆ యా పన్నులను ద్రవ్యరూపంలో చెల్లించాలని అన్నారు అంటే "వారికి

కావలసిన ధనం కోసం మార్కెట్టుకు వెళ్లవలసిన అగత్యం" కలిగించారు అడవులనుండీ, భూములనుండి ఉత్పత్తిఅయిన వస్తువులను అమ్మకుంటే వచ్చినధనం పన్నులు కట్టుకోడానికి సరిపోకపోతే, వారు సామ్రాజ్యవాదులు తయారుచేసివుంచిన ఉద్యోగాలు చేసుకుందామని పట్టణాలలోకి వచ్చేవారు: రాగానే — వేరుమార్గం లేకనే వారు అవిధంగా వచ్చారన్న సంగతి మరిచిపోయి — వారిని తిరుగబోతులని, ముష్టివాళ్లని, చెప్పి పట్టుకొని శిక్షించేవారు.

దోచుకోబడి, దరిద్రులుగా చెయ్యబడిన, ఆంగ్లేయ కర్షకులను గురించి మార్క్సు చెప్పిన మాటలు, యీనాడు బాధలు, హింసలు, పడుతున్న వలసరాజ్యాల కర్షకవర్గంలో చాలా విభాగాలకు తూచా భేదంలేకుండా చెందుతాయి.

"ఈవిధంగా" భూములనుండీ బలవంతంగా గెంటివేయబడీ, స్వగృహాలనుండి తరిమివేయబడీ, కర్షకం తిరుగబోతుతనాన్ని అంగీకరించక తప్పిందికాదు: అప్పుడు అమానుషమైన భయంకర పిశాచిక శాసనాలు, అవర్గాన్ని కొరడాలతో కొట్టి వాతలు ముద్రవేసి అతికఠినంగా హింసించాయి చివరకు అవర్గం కార్మిక విధానానికి కావలసిన క్రమశిక్షణను అంగీకరించింది."

అయితే, ఆంగ్లేయ ఐరిష్ కర్షక వర్గాలలాగ వలసరాజ్యాల కర్షకవర్గం సామ్రాజ్యవాద ధనికతత్వం చేసే దాడులకు లొంగిపోలేదు. యూరోపియన్ తోటల ఆర్థికవ్యవస్థకు వ్యతిరేకంగా వారు పరిస్థితులకు తగినట్టు, ప్రత్యేకమైన మార్గాలలో, సమిష్టిగా, విద్రోహక చర్యలను సాగించారు * ఆఫ్రికాలోని ఫ్రెంచి, బెల్జియన్, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు దక్షిణ అమెరికాలోని స్పెనిష్, పోర్చుగీస్,

---

* 'రాబర్టుపెయిన్సు' తాను వ్రాసిన 'రష్యా' అన్నగ్రంథంలో కర్షకులు తమకు యిష్టంలేని సంగతిని అడ్డడానికి ఎంతటి శక్తిసామర్థ్యాలను ప్రదర్శిస్తారో చెప్తూ, ఒకరష్యన్ కమ్యూనిస్టు చెప్పిన మాటలను వ్రాశాడు — "రైతులు వారికి యిష్టంలేని పనిని అడ్డడానికి అసాధారణమైన సమైక్యతతో పనిచేస్తారు" గోల్డుకోస్టులో పని చేస్తున్న రైతులు తాముపండించిన కోకోను "లివర్ మిల్సు"కు అమ్మం పొమ్మన్నారు. పాపం వారు తన "ఆఫ్రికన్ సామ్రాజ్యానికి" నీళ్ళు వదలుకోవలసి వచ్చింది.

అమెరికన్ సామ్రాజ్యాలు, తమ అమానుషమైన దోపిడి వ్యూహాలను నెమ్మదిగా, ఒకదాని తర్వాత ఒకటిగా, పాపం, వదులుకోవలసి వచ్చింది.

ఆఖరుకి, నీగ్రోలను, ఎర్ర యిండియన్‌లను, యితర వలసరాజ్య ప్రజలను, వారి యిష్టంవచ్చినట్టే వారిని బ్రతుకనివ్వవలసివచ్చింది. కాలం విషయంలో, అనుసరించే విధానం విషయంలో, తోటల యజమానులు సూచించే సూచనలను అనుసరించనుండా, వారి సులువు బరువులను అనుసరించిమాత్రం వారిని అధునిక వ్యాపారసేద్యం చెయ్యనివ్వవలసివచ్చింది. అమెరికాలోని మెక్సికో, బ్రేజిల్ దేశాలలో రైతులు యూరప్‌లో బాల్కన్ రైతులు గత 20 ఏళ్లల్లో తమ తమ జమీందారుల కెదురు నిలబడి వారి జమీలను ముక్కలుముక్కలుగా చేశారు; ఆ భూములను — అంటే, తమ పిత్రార్జితమైన భూములను — రైతులు పంచుకొన్నారు.

భారతవర్షంలో గత 35 ఏళ్లలోనూ కొందరు రైతులు పోయిన తమ హక్కులను తిరిగి సంపాదించుకుంటున్నారు. మరికొందరు కొత్త హక్కులను సంపాదించుకుంటున్నారు. రైతులను కొల్లకొట్టుటకు సామ్రాజ్యతత్వం తయారు చేసిన మహోపాయాలు వారి జమీందారులకు పెట్టని కోటలు జమీందారులు ఆకోటలు మధ్య సురక్షితంగా కూర్చొని, తమ అన్ని శక్తులనూ ఒక అపూర్వ నిశ్చయంతో వీరికి వ్యతిరేకంగా ఉపయోగిస్తున్నాకూడా, వీరు ఆ హక్కులను సంపాదించుకుంటున్నారు

చైనాలో సన్-యట్-సేన్, చంగ్ కై షేక్, కమ్యూనిస్టులు, రైతుల అధిక హక్కుల కోసం, స్థానిక జమీందారుల పిడికిట నుంచి వారిని తప్పించడం కోసం, తమ శక్తి సామర్థ్యాలను ఉపయోగించారు.

ఈ విధంగా పెట్టుబడిదారీ వర్గాలు, జమీందారుల కూటమి, చేసే దోపిడినుండి, ఎదురు దాడుల నుండి కర్షక వర్గం తప్పించుకొని, విజయాన్ని సంపాదించింది. పురోగమన శక్తితో తొణికిసలాడే ఒక సరికొత్తవర్గంగా జన్మించింది. దానిని నశింప చేయడానికి యితర ప్రతికూల వర్గాలు చేసే దాడులనుండి తట్టుకొని రైతులు నిలబడగలి

వరకూ ప్రపంచ ఆర్థిక వ్యవస్థను పరిశీలించుటకు అవకాశములున్న లెనిన్, బుఖారీ, రాల్ఫ్‌ఫాక్స్, ఎమిల్ బరన్స్, యితర కమ్యూనిస్టు నాయకులూ, యిలాగే చెప్పడానికి కారణ మేమిటి? వారు దీనికి ఏ విధంగా సమాధానం చెప్పగలరు?

సోవియట్ రష్యాలో కర్షకులు సమిష్టీకరణమునకు ఎదురు నిలచి కర్షక వ్యతిరేక ఉద్యమాన్ని జయించ గలిగారు. సర్ జాన్ రస్సెల్ ఆగష్టు 1943లో యిలాగ ఉద్ఘాటించాడు

“సమిష్టి వ్యవసాయంలో వున్న రైతులు తాము సమిష్టి వ్యవసాయం కోసం నూరు రోజులు కృషి చేయాలి. మిగిలిన రోజులలో వారు తమ స్వంత భూముల మీద పనిచేసుకోవచ్చు, అర ఎకరం మొదలు రెండున్నర ఎకరాలు వరకూ విస్తీర్ణం ఉన్న భూములను (వీటినే ‘తోటలు’ అంటారు) ఇంటివి, ఆభూముల మీద భరించగలన్ని పశువులను, వ్యక్తిగతంగా ఉంచుకొనడానికి హక్కును వారు సంపాదించారు. వారిలోని కర్షక స్వభావం లేచి నిలబడి యంత్రాగారాలలోని కార్మికవర్గంతో వారు మిళితమైపోయి, ఒకే వర్గంగా కాకుండా చేసింది”

అంతే, బోల్షివిక్ రష్యాలో సమిష్టి వ్యవసాయంలోని కర్షకులు కూడా బోల్షివిక్ సనాతన తత్వాన్ని, కమ్యూనిస్టుపార్టీ నాదమును కాదు పొమ్మన్నారు. జయించారు అన్నమాట. అయినా కమ్యూనిస్టులు మాత్రం వారి సనాతనతత్వాన్ని వదలరు, కర్షక వ్యతిరేకంగా ఉపాయాలను పన్నడం మానరు

ఈ విషయాలను చర్చిస్తూ ‘స్ట్రాస్’ అన్న రచయిత తాను వ్రాసిన “సోవియట్ రష్యాలో” “మొదట్లో కర్షకులను సమిష్టీకరించే ప్రయత్నాలు విజయవంతమైనా, తుదకు మాత్రం రైతులు రైతులుగానే ఉండి పోయారు” అని అంటారు.

* * *

మన గ్రామీణ నాగరికతను, గ్రామీణ ప్రజాధీనమైన రాజ్యతంత్ర సంస్థ, గ్రామీణ ఆర్థిక వ్యవస్థ యొక్క నిర్మాణ ప్రణాళికను మార్క్స్ తప్పుగా అర్థం చేసుకొని, వాటిపట్ల కారణం లేని దురభిమానాన్ని ప్రకటించాడు.

ప్రపంచం అంతటా, అన్ని దేశాలలోను, క్షామ ప్రమాదం వుండిగాని, యుద్ధ సమయాలలో వినాశాల ముట్టడి వలన యితర

కాలాల నుండి సరాఫరా కష్టమైనప్పుడు గాని, రాకపోకలు తెగిపోయినప్పుడు గాని, తిండి విషయంలోనూ, పరిశ్రమల విషయంలోనూ, తమకు తాము పోషించుకొని, రక్షించుకొనగల గ్రామాలు, పట్టణాలు, జిల్లాలు, ఉండాలని యివి కేవలం యితరులమీద ఆధారపడకుండా ఉండేటట్టు చెయ్యాలని, యీనాడు విస్తృత ప్రయత్నాలు జరుగుతున్నాయి. మహాత్ముడు, భారతీయ నాయకులు, చైనా నాయకులు, యీ విధంగా స్వయంపోషకమైన ఆర్థిక వ్యవస్థ నిర్మాణానికి, దాని అభివృద్ధికి, ప్రయత్నిస్తున్నారు. పారిశ్రామికంగా ముందడుగు వేస్తున్న అమెరికా సంయుక్త రాష్ట్రాలుకూడా కేంద్రీకృతమైన పారిశ్రామిక గ్రామీణ ఆర్థిక వ్యవస్థకోసం ప్రయత్నిస్తున్నవి. పారిశ్రామికంగానూ, వ్యవసాయికంగాను, స్వయంపోషితములైన ఖండాలు రష్యాలో అక్కడక్కడ నిర్మించబడ్డాయి: అవి ఒకదానితో యింకొకటి సంబంధం కలిగి ఉన్నాయి: యిట్లాంటి స్వయంపోషిత ఖండాలు ఉండటంవల్లనే జర్మనీ ఎదురు దాడులను ప్రతిఘటించి రష్యా నిలబడగలిగింది.

కాని, మార్క్సువాదు ఈవిధానం ధనికవాద ప్రయోగమునకు ఏవిధంగానూ సహాయం చెయ్యదని కొన్నిసమయాలలో ఆటంకం కలుగుచేస్తుందనికూడా, అనుకున్నారు, అందుచేతనే యిలాంటి విధానాన్ని మార్క్సు అంగీకరించి గుర్తించలేదు

గ్రామాలలోని "కులములు" గూర్చి మార్క్సు యిలాగ అన్నాడు —

"గ్రామాలలోని భూములను సమానహక్కులతో కలిగియుండటం, వ్యవసాయం, చేతిపరిశ్రమల కలయిక, మార్పులేనివిధంగా శ్రామిక విభజన — గ్రామాలలోని కులములు వీటిమీద ఆధారపడి ఉన్నాయి."

మహానుభావుడు మార్క్సు, "మార్పులేనివిధంగా శ్రామిక విభజన" అని అంటాడు కాని మహాభారతంలోను, మనుస్మృతిలోను, నిరుద్యోగి అత్యవసర పరిస్థితులలో వృత్తిని మార్చుకోవచ్చునని అన్నారు.

మరొకచోట అంటాడు —

“...ఖర్చు కాగా మిగిలినదే వ్యాపారవస్తువుగా మారుతుంది. ఈవిధంగా తమను తాము పోషించుకొనగల సంఘాలలో ఉత్పత్తి విధానం చిక్కులు లేకుండా చాలా సులభంగా ఉంటుంది. (ఆసియా ఖండపు సంఘాలు యిలాంటివి) కాబట్టే ఆసియాఖండపు సంఘాలలో మార్పులేదు...”

“మార్పులేకుండా ఉండటం” అంటే ఏమిటి? ‘మార్క్సు’ భావమేమి? ప్రాణాధార ఆర్థిక వ్యవస్థ ప్రతిపత్తికి తగినంత పనిని, నిరుద్యోగం లేకుండా చేసే పూచీని, తగిన జీవనాధారాన్ని, యివ్వగలిగితే ఇంకా కావలసిందేమిటి? మార్పులేకపోవటంవల్ల చెరుపు ఏమున్నట్టు?

* * * * * *

“వర్గపోరాటం అనివార్యంగా కార్మికవర్గ నియంతృత్వానికే దారి తీస్తుందని నేను రుజువుచేశాను” అని మార్క్సు వ్రాసిన కాని 1870–72 లో, పశ్చిమదేశంలో పొంగిపొర్లుతున్న ఫ్రెంచి కర్షక వర్గానికి విజ్ఞప్తి చేస్తూ, అప్పుడే ‘కమ్యూన్’గా తయారయిన అత్యల్ప సంఖ్యాకులైన పారిస్ కార్మికుల నాయకత్వాన్ని అంగీకరించమని ప్రార్థించాడు.

అయితే, “సహజంగానూ అత్యవసరంగానూ” కార్మిక వర్గ నాయకత్వాన్ని కర్షకులు ఎందుకు అంగీకరించాలి?” అని మార్క్సు ఆలోచించలేదు. ‘జాక్వెరీ’ విప్లవం * మొదలు 1797–99 నాటి ఫ్రెంచి విప్లవం దాకా, తిరుగుబాట్లలోను, విప్లవాలలోను, అప్పుడే తయారవుతున్న కార్మిక వర్గం కన్న ఫ్రెంచి కర్షక వర్గానికే హెచ్చు అనుభవం ఉన్నదే! జాకోబిన్ పార్లమెంటు చేయబోయే నిర్ణయాలను సరిగా ఊహించి, జమీందారీ రికార్డుల నన్నిటినీ, కర్షకులే తగలబెట్టేశారు. లౌకికంగాను, మత విషయాలలోను, జమీందారీ పద్ధతిని నశింప చేశారు.

---

* 1358 లో ఫ్రాన్సులో, జమీందారుల నిరంకుశాధికారం పైన, దమననీతి పైన, తిరగబడ్డ రైతుల ముఠాకు ‘జాక్వెరీ’ అని పేరు. జాకోరీలు ప్రాణాలకు తెగించి పోరాడేరు. విప్లవం అణచడానికి జమీందార్లు చాలా ప్రయాసపడ్డారు.

అలాంటి ఫ్రెంచి కర్షకవర్గాన్ని... నీతి నియమాలులేని వాగ్ధాటుల సాహసకత్వాన్ని, స్వాతంత్ర్యంలేని వారి స్వతంత్ర ప్రజ్ఞాసామర్థ్యాన్ని అంగీకరించమనటం... వాస్తవికత కాదేమో!

విప్లవం సాగించగలది కార్మికవర్గమే; అదిమాత్రమే కర్షకుల సమస్యలను పరిష్కరించగలదని, వారి బాధలను నివారించగలదని ఫ్రెంచి కర్షకులకు మార్క్సు చెప్పారు. అంతేకాదు యీనాడు మార్క్సువాదులుగా రాజకీయాల్లో గాని, ప్రభుత్వంలో గాని, సమానమైనభాగం పంచిపెడతామని అలవి అవని వారికి కష్టాలు లేకుండా చేస్తామనిమాత్రం అన్నారు

"ఫ్రెంచి కర్షకవర్గం ఆనాడు మార్క్సు యిచ్చిన సలహాను వినివుంటే, కార్మికవర్గం దానిని యేవిధంగా ఆదరించిఉండునో!" అని అంటే, రష్యాలోని పరిస్థితులే మనకు సమాధానం చెప్తాయి. సోవియట్ కార్మికవర్గ నియంతృత్వం నేటి కర్షకవర్గాన్ని ఆదరిస్తున్నట్లో, అలాగే ఆనాటి ఫ్రెంచి కార్మికవర్గంకూడా ఆనాటి కర్షకవర్గాన్ని ఆదరించిఉండును.

రష్యన్ రైతులు సమిష్టీకరణానికి అంగీకరించిన తర్వాత కూడా వారిని అప్పటి కార్మికవర్గ నియంతృత్వం యేవిధంగా ఆదరిస్తున్నదో మాపుటకు రెండు ఉదాహరణలు ఇస్తున్నాము:

రైతునుండి భూమి శిస్తును పంటలో పంతుగా తీసుకొనే విధానం భారతవర్షంలోలాగే రష్యాలోకూడా అమలులో ఉంది. అంచనావేసిన పంటలో నూటికి 15 వంతులుగాని, 20 వంతులుగాని పంటను ప్రభుత్వానికి రైతు యిచ్చుకోవాలి—అంచనావేసిన పంట పండినాసరే, పండకపోయినా సరే!

ప్రభుత్వం పంటలను స్వాధీనం చేసుకున్నప్పుడు వాటికి నిర్ణయించే ధరలు బజారు ధరలకంటె చాలా తక్కువగా ఉంటాయి. ధాన్యాదులకు నగరాలలో ప్రజలు చాలా తక్కువధర యిస్తుంటారు; తాము ఉత్పత్తిచేసే వస్తువులకుమాత్రం సాధ్యమైనంత హెచ్చుధరలను తీసుకుంటారు.

ఈవిధంగా జరగటం సహకారసంస్థలద్వారానే! ఈధరల కత్తిరింపు ఎప్పుడూ రైతుకు ప్రతికూలంగానే ఉంటుంది.

అన్ని పేరులమీద కత్తిరింపులూ అయిపోయాక, సమిష్టి వ్యవసాయంలో రైతుకు మిగిలేది నూటికి నలభై వంతుల పంట!

అంటే, మన దేశంలోని వాటా పంటదారులకు మిగిలిన పాటి కూడా అయినా మిగలదన్నమాట.

రష్యాలో గ్రామీణ పరిస్థితులకు అనుసరించి తయారు చెయ్యబడిన శాసనాలు ఏవీ లేవు.

అంటే, రష్యాలో పంటలు పండించే రైతు ప్రభుత్వ వర్గానికి చెందిన కార్మికుని కంటె హీనమైన పరిస్థితులలో జీవిస్తున్నాడన్న మాట.

(౧౦-౫-౪౪ "హిందూ" నుండి)

# మార్క్సువాది : మార్క్సు తత్వం

## 3

నేటి రష్యన్ నియంత స్టాలిన్‌కు లెనిన్ ప్రమాణ పురుషుడు. లెనిన్ "మార్క్సువాది అంటే ఎవరు?" అన్న ప్రశ్నకు జవాబు మాత్ర ప్రాయంగా యిలా చెప్పాడు.

"వర్గపోరాటాన్ని గుర్తించడం కార్మికవర్గ నియంతృత్వాన్ని గుర్తించడమేనని ఎంచుకోగల భావవ్యాప్తి ఉన్న వ్యక్తే మార్క్సువాది"

తాను "వర్గసమరం నిశ్చయంగా, తప్పని సరిగా కార్మికవర్గ నియంతృత్వానికే దారి తీస్తుందని" ఋజువు చేశానని మార్క్సు వాదిస్తాడు. (ప్రభుత్వం, విప్లవం పుట 30) లెనిన్ యిలా చెప్పటకు యీ వాదమే కారణం.

నిజానికి యీనాటి కమ్యూనిస్టుల విశ్వాసం కూడా యిదే. కనుక, ప్రపంచంలో 100 మిలియన్ల కన్నా అధికంగా నున్న రైతులకు కమ్యూనిస్టుల సాంఘిక విధానంలో గౌరవ ప్రదమూ, సురక్షితమూ, పురోభివృద్ధి కరమూ, అయిన స్థానం ఉన్నదని అనుకోగలమా?

కౌట్‌స్కీ (Kautsky) అతని అనుచరులూ, మార్క్సు తూప దేశాలను సామ్యవాద భావగతిని పరిశీలించి "బూర్జువా సమరం అంతరయ్యే వరకే వర్గ సమరం ఉంటుంది" అని చెప్పారు. అంటే ధనికవాదం పడిపోయేక, సామ్యవాద సిద్ధాంతాల స్థితికి కార్మిక నియంతృత్వం ఉంచనవసరం లేదన్నారు అన్నమాట.

సోవియట్ రష్యా, రిపబ్లికన్ స్పెయిన్‌లలోని స్థితిగతులను బట్టి, రెండు మహాసంగ్రామములలోని అనుభవాలను బట్టీ, ఆలోచిస్తే బూర్జువా అధికారానికి ఎదురుగా విప్లవం సాగించి దానిని పడగొట్టేక కొద్దికాలం వరకైనా ప్రజాస్వామిక నియంతృత్వం తప్పని సరిగా ఉంటుందని నిశ్చయించవచ్చును. అయితే, ఆనియంతృత్వం రష్యాలోలాగ ఏదో ఒకవర్గపు నియంతృత్వం కాకుండా, అన్నివర్గాల సమ్మేళనము యొక్క అధికారమైతేనే, అన్ని శ్రామిక వర్గాలకు, యితరులకు సంతుష్టి నివ్వగలుగుతుంది. ఎలాంటి పరిస్థితులలోనైనా, రాజకీయాలలో నియంతృత్వం విశ్వసింపరాని భయంకర అనుభవము; అందుచేత, అది నిజమైన ప్రజాస్వామిక నియంతృత్వం కాకుండా, ఏదో ఒక వర్గపు నియంతృత్వమైతే విరుగుడు లేని విషం అన్నమాట.

కమ్యూనిస్టుపార్టీ యిలాంటి ఏకవర్గ నియంతృత్వాన్ని అంగీకరించి, దాని స్థాపనకు నడుము కట్టింది పోనీ, ఆ ఏకవర్గంలోని వర్గం లోని వర్గం ప్రపంచంలోని ప్రతీ దేశంలోనూ అత్యధికసంఖ్యాకులుగా నున్న కర్షక వర్గమా అంటే, కాదు, మహాస్వల్పంగా నున్న కార్మికుల వర్గం!

ఈపిడివాదం చాలనట్టు లెనిన్‌తోపాటు "వర్గ సమర సిద్ధాంతము కార్మికవర్గ నియంతృత్వాన్ని, రాజకీయంగా దాని గొప్పతనాన్ని తప్పని సరిగా ఋజువు చేస్తుందని" కమ్యూనిస్టులు విశ్వసిస్తారు.

మార్క్సు, ఏంజిల్సు, లెనిన్, ఆనాటి పాశ్చాత్య పారిశ్రామిక దేశాలనే దృష్టిలో ఉంచుకున్నారని, అందుచేతనే అక్కడ విప్లవ సమరంలో అభివృద్ధి పొందుతున్న కార్మిక వర్గపు ప్రముఖ పాత్రను గూర్చి పిచ్చినమ్మకాలు పెట్టుకున్నారని, సుస్పష్టమే. ప్రాగ్దేశాలలోని అతని అనుచరులు కూడా శ్రామిక జనులను, పీడిత ప్రజలను, అందరినీ ఒక క్రమశిక్షణలోకి తెచ్చి, నాయకత్వం

వహించి, సుస్థిరంగా, మార్గదర్శిగా ఉండగల సమర్థత ఒక్క కార్మిక వర్గానికే ఉంది. నవయుగ స్థాపనకు నడుము కట్టగల వర్గము అదే" అని లెనిన్ ఉపదేశించిన మంత్రాన్నే పునశ్చరణ చేస్తున్నారు.

అయితే, కర్షకులకు, మధ్యతరగతిలో కింది మెట్టు మీద నున్న వారికీ, సగం కూలీలుగా ఉన్న వారికీ, వారి వారి ఆర్థిక సాంఘిక ప్రవృత్తి దృష్ట్యా మార్గదర్శిగా ఉండగల సమర్థత యూరోపియన్ దేశాలలోనైనా ఒక్క కార్మిక వర్గానికే ఉందనటం తప్పు!

నిజానికి, యూరోపియన్ దేశాలలోని కర్షకులకు "ప్రజకు" రష్యాలో స్థాపించబడ్డ కార్మిక వర్గ నియంతృత్వం యేవిధంగా మార్చినా, ప్రోత్సాహకరంగానూ, ఉత్తేజకరంగానూ, కనబడలేదు: అందుచేతనే కమ్యూనిస్టుపార్టీ యివ్వజూపిన కార్మిక వర్గపు నాయకత్వాన్ని, మార్గదర్శకత్వాన్ని, వారు యీనాటివరకూ అంగీకరించ లేదు.

పైగా ప్రకృతి శాస్త్రాల్లో వివిధంగా "ఇది కార్యం, ఇది కారణం" అని నిశ్చయం చెయ్యగలట్లో, అదే విధంగా ప్రముఖ రాజకీయ సంఘటనలను జోస్యం చెప్పగలమని [illegible] కోతలు కోసే మార్క్సిస్టు వాదులు తమ పత్రికలలో కూడా అనుకోనివిధంగా కర్షకులూ, ప్రజా, పనిచేయ నారంభించారు.

యూరోపియన్ దేశాలలో ఫాసిజమ్ అధికార ప్రాబల్యం లోకి వచ్చుటకు కారణాలు — ఒకటి: ఏదో ఒక అధికారం చేతికొస్తే, కార్మిక వర్గ నియంతృత్వం ఎక్కడ వచ్చి పడుతుందో అన్న భయం; రెండు: కమ్యూనిస్టులు కర్షక ప్రజా వర్గాల పట్ల బహిరంగంగా ప్రదర్శిస్తున్న తృణీకార భావమూ, అసహ్యమూను.

ఆగ్నేయ యూరోపియన్ దేశాలలోని కర్షకులకు కూడా రష్యన్ కార్మికవర్గ నియంతృత్వం పట్ల అనాదరణ కలుగుటచేతనే, వారు కమ్యూనిస్టు పార్టీతో కలియుటకు అంగీకరించలేదు. స్వతంత్రమైన కర్షక సంఘాలను, రాజకీయ పక్షాలను, తయారుచేసుకున్నారు. సహకారోద్యమం ప్రాతిపదికగా నున్న కర్షక సామ్యవాదం అనే ఆదర్శ ప్రాతిపదికను అభివృద్ధి చేసుకున్నారు.

1930 నుండీ 1945 వరకూ ఉన్న ప్రపంచ సంఘటనలను పరిశీలించాక, సామ్యవాదులు నేర్చుకోవలసిన పాఠం ఇది —

ప్రపంచంలో ఏ దేశంలో నైనా సరే, నిజమైన కష్టజీవులందరూ ఏదో ఒక వర్గపు నియంతృత్వానికి - ఆ వర్గం కార్మికులదయినా, మధ్యతరగతిదే అయినా, కర్షకులదే అయినా - అంగీకరించరు. వారు అంగీకరించే అధికారానికి ప్రాతిపదిక ప్రజాస్వామిక కర్షక కార్మిక ప్రజారాజ్య నినాదము మాత్రమే!

అయితే కమ్యూనిస్టులు ఇంకా తమ కర్షక వ్యతిరేకమైన దృక్పథాన్నే అనుసరిస్తూ న్నారెందుచేత?

వారు యీ విధమైన దృక్పథాన్ని అనుసరించడం కర్షక ప్రజా వర్గాల విప్లవశక్తి సామర్థ్యాలు తెలియక పోవడం చేతనే" అని చెప్తే మనం నమ్మలేము. బాల్కన్ రాష్ట్రాలలోని రైతుల విప్లవోద్యమాన్ని దాని ప్రాముఖ్యమును, దాని అంతరార్థాన్ని గ్రహించక కాదు; మార్క్స్, లెనిన్‌లు వారిలో కల్పించిన కర్షక వ్యతిరేకమైన దురభిప్రాయాలే యీ తప్పు దృక్పథానికి కారణం.

ఇందుకు మరొక కారణం కూడా ఉంది. రష్యాలో బోల్షవిక్ పార్టీ వాడు వారి సంసారాన్నంతా సర్దుకొని, కర్షకుల పక్క దృష్టి తిప్పేసరికి కర్షకవర్గ నాయకత్వం సోషలిస్టు రివల్యూషనరీల చేతులలో ఉంది. ఆనాటినుండీ (1905 నుండీ 1917 వరకూ) సోషలిస్టు రివల్యూషనరీల నెత్తిని అపకీర్తి చుట్టుటకు వారి నాయకత్వం శక్తిలేనిదని ప్రపంచానికి చాటడానికి బోల్షవిక్ పార్టీ విశ్వప్రయత్నం చేసింది.

ఆనాటి వివాదంలో రష్యన్ కర్షకవర్గం అతి తీవ్రమైన విప్లవ వర్గమనీ, విప్లవ శక్తులకు ప్రథమశ్రేణి కాగలదని, సోషలిస్టు రివల్యూషనరీలు అన్నారు.

అబ్బే, అలాకాదు; కార్మికవర్గమే విప్లవశక్తులకు నిజమైన ప్రథమశ్రేణి" అని బోల్షవిక్ పార్టీ అంది. ఈ సాంఘిక విప్లవనాయకత్వాన్ని తనకే పట్టాభిషేకం చేసి మార్క్స్, ఏంజెల్సు అవతారం చాలించారని కూడా చాటుకోడం ప్రారంభించింది.

సరి! ఆనాటి నుండీ కర్షకులకు విప్లవం చేయుటకు సామర్థ్యం లేదని వారు క్రమబద్ధంగా తమ సంస్థను తయారు చేసుకొలేరని బోల్షవిక్ పార్టీ ప్రచారం ప్రారంభించింది. ఆనాటి వివాదం లోని అనుభవాలను, సాంప్రదాయాలను, గ్రహించకుండానే ప్రపంచంలోని అన్ని దేశాల కమ్యూనిస్టులూ యిదే ప్రచారం ప్రారంభించారు.

ఒకనాటి సూత్రాలు యివి – ఈ వివాదం దృష్టిలో నుంచుకొని చదవాలి వీటిని.

“మార్క్సు తత్త్వం అంటే కార్మికవర్గం తన స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగించే విధానము యొక్క వాదం” అని లెనిన్ ప్రకటన.

భారత దేశంలోనేమి, చైనాలోనేమి, కమ్యూనిస్టుల చర్యలు వారికి మార్క్సు లెనినుల ఉపదేశాలను మరిచిపోకుండా ఉన్నాయని ఋజువు చూపిస్తున్నాయి.

ఈ పంక్తులలో మార్క్సు సనాతన తత్త్వంలో కర్షకులకు స్థానం ఏమిటి? నిజానికి అభ్యుదయకరం, శుభకరం అయిన మార్పు కమ్యూనిస్టులలో కలుగుతుందని భారత రైతాంగం చైనా కర్షకులు వారివారి నాయకులు విశ్వసించడం వారి తప్పిదమే!

అయితే, ఆయా దేశాల కర్షకవర్గాలు వారి నాయకులు ఆవిధంగా విశ్వసించడానికి ఒక ప్రమాణం ఉంది

“అనుభవమే గొప్ప గురువు ఎవరు సరియైన దారిలో వెడుతున్నారో అది చూపుతుంది” అన్న లెనిన్ ఉపదేశాన్ని కమ్యూనిస్టులు గ్రహిస్తారని పాపం వారు తలంచారు

# లెనిన్ : రైతులు

## 4

రైతులు తమ పక్షాలను అభివృద్ధి చేసుకుంటున్నారు. సహజమైన శక్తిసామర్థ్యాలు అవి కలిగి ఉన్నట్లు, రాజకీయాధికారాన్ని అవి ఆశించేటట్లు, ఆ పక్షాలను తయారు చేసుకుంటున్నారు.

కాని, యీ విషయంలో లెనిన్ కు ఎలాంటి అభిప్రాయాలు ఉన్నాయో పరిశీలిద్దాం.

మార్క్సులాగే అన్ని తరగతులనూ నాశనం చెయ్యాలని లెనిన్ కూడా ఆకాంక్షించేడు. ఆఖరుకి ఒకే ఒక తరగతి – కార్మికుల

తరగతి - ఉండాలని అతని ఉద్దేశం. అందుచేతనే "'వామ పక్ష' కమ్యూనిజమ్" (Left wing Communism) లో యీవిధంగా అన్నాడు,

"తరగతులను నాశనం చెయ్యటం అంటే, భూస్వాములను, పెట్టుబడి దారులను నశింపచెయ్యటం కాదు. ఆపని మనం చాలా సులువుగా చెయ్యగలిగాము. తరగతులను నాశనం చెయ్యటంఅంటే, చిన్న చిన్న సరకుల ఉత్పత్తిదారులను కూడా వదలించుకోడం అన్నమాట. వారిని నశింప చెయ్యలేము. బలవంతంగా అణచివేయ లేము." (పుట 20)

అంటే, కమ్యూనిస్టు పార్టీ హయాంలో రైతులు, చేతిపని వారలు, కూడా 'వినాశము' చేయబడతా రన్నమాట!

రైతుల గురించి, చేతిపని వాళ్ల గురించి, బోల్షివిక్ పార్టీని 'హెచ్చరిస్తూ' లెనిన్ యిలా అన్నాడు.

"ఛోటా బూర్జువా వర్గంలాగే నీతి లేకుండా పళ్లు కంపు కొడుతూ వ్యక్తిగతమైన భావాలతో నిండిన అహంకారంతో వెర్రి ఆనందమునకూ, నిరాశకూ మధ్య కొట్టుకుంటూ యీవర్గాలే కార్మిక వర్గానికి చుట్టూ ఉన్నాయి ఎటు చూసినా రైతులూ, చేతిపని వారలే ఉన్నారు. కంటికి కనపడకుండా, తమకు కూడా తెలియకుండానే, తమ దైనిక చర్యలలో కార్మిక వర్గాన్ని శక్తిలేని దానిగా చేస్తూ, బూర్జువా వర్గం కోరే ఫలితాలనే సంపాదిస్తూ, బూర్జువా వర్గాన్ని తిరిగి స్థాపించటానికి ప్రయత్నిస్తూ, కోటాను కోట్లుగా నున్న చిన్న ఉత్పత్తి దార్లను ఓడించటంకన్న కేంద్రీకృతమైన బూర్జువా వర్గాన్ని ఓడించటం వేయిరెట్లు సులువు. దుర్భేద్యమైన కార్మిక వర్గపు క్రమశిక్షణను ఎవరు ఎంత కొద్దిగా బలహీన పరచినా, అది కార్మిక వర్గానికి వ్యతిరేకంగా బూర్జువా వర్గానికి సహాయం చేసినట్లే లెక్కించ వచ్చు."

అబ్బ! ఎంతటి భయంకర ప్రబోధం! ఎంతటి నీచ భావాలు! కార్మికుల "నైతిక బలాన్ని తగ్గించే" రైతులంటేను, ప్రాబల్యమంటేను, లెనిన్‌కు ఎంత భయం! రక్షక వర్గాన్ని "వర్గంగా నశింప చెయ్యాలనే" లెనిన్ నిశ్చితాభిప్రాయం సంపూర్ణంగా రక్షక వ్యతిరేకం; తప్పుల పుట్ట; విప్లవ వాదానికే ప్రతికూలం. అయినా ఇలాంటి

భయాలు ఉన్నప్పుడు అవిస్పష్టమైన అభిప్రాయం ప్రకటించాడంటే- తప్పులేదు, వింతలేదు.

సంస్థను నిర్మించటంలో కిష్టికల రసన్న ప్రతిభను, విజయవంతంగా విప్లవాన్ని సాధించటంలో వారికున్న శక్తిసామర్థ్యాలను వారు ప్రత్యేక సంస్థలను తయారు చేసుకొను సమైక్యతను, స్వతంత్ర రాజకీయాలలో అధికారాన్ని, నాయకత్వాన్ని, సంపాదించుకోడానికి వారికున్న ఆకాంక్షను, లెనిన్ తప్పుగా అర్థం చేసుకున్నాడు. అందుకేనా, కర్షక వర్గంలో ప్రజావర్గంలో లోలోపలనే మెలిగి పోతున్న విప్లవ చైతన్యాన్ని చోటా బూర్జువా తత్వమని లెనిన్ కొట్టివేశాడు.

“కర్షకుల విప్లవ చైతన్యానికీ, కార్మికుల విప్లవ చైతన్యానికీ కావలసిన అవసరాలలోనో, షరతులలోనో, ఏదో ఒక ప్రముఖతత్వంలో తక్కువగానో, గొప్పగానో, భేదం ఉంది” అని లెనిన్ ఉద్ఘాటించాడు. కాని, ఆగ్నేయ యూరోపియన్ దేశాల రైతులు, చైనా రైతులు. ఈనాటి పరిస్థితిలో, యుద్ధానంతర కాలములో, నిర్మించుకున్న ఉత్కృష్ట సంస్థలను అధికారాన్ని సంపాదించుకొని పెంపొందించుకొన్న అపూర్వ ఐక్యతాన్ని సమైక్య శక్తినీ పరిశీలించినట్లయితే కర్షక వ్యతిరేకంగా లెనిన్ చేసిన యీ ఆలోచన ఎంత తప్పో సులువుగా తెలుసుకోగలరు.

యూరోపియన్ కర్షక వర్గానికి సంఖ్యాధిక్యతలో నున్న బలాన్ని విప్లవ విజయానికి ఆవర్గం యొక్క అవసరాన్ని ఆవర్గంలో అంతర్లీనంగా నున్న మొక్కవోని విప్లవకాంక్షను లెనిన్ గ్రహించాడు. “సాంఘిక శక్తికి గుర్తు రైతాంగం అనేక యూరోపియన్ దేశాలలో ప్రముఖంగా ఉన్న కర్షక వర్గం ఎక్కువగా పీడించబడి, బాధ పడుతున్నది. అయితే వినాశనాన్ని ఎదుర్కొన్నప్పుడు వారి జీవిత స్థితిగతులను నిశితమైన ఆవేదంతో మార్పును పొందుతుంది. ఎంతటి చెడుకునైనా ఎదుర్కొంటుంది; తుదకు వారిని అతివాద విప్లవానికే నడిపిస్తుంది” అని లెనిన్ ఉద్ఘాటించాడు.

కాని కార్మిక వర్గమే గొప్పది అన్నవాదన యీ ఉద్ఘాటన వల్ల ఎక్కడ దెబ్బతింటుందో అని కాబోలు, వెంటనే యిలా అన్నాడు- “వీరు ఐకమత్యం లేకుండా, సంస్థలో క్రమశిక్షణతో పట్టుదలను ప్రజ

వాళ్ళు తమ 'పెటిషన్' తీసుకొని పార్లమెంటుముందు ప్రదర్శనాలు జరపాలని వారి ఉద్దేశం. కాని డ్యూక్ ఆఫ్ వెల్లింగ్‌టన్ తన సైన్యాలతో వచ్చి యీ 'మహాసభ'ను భయపెట్టి, చెదరగొట్టివేశాడు.

కార్మిక వర్గానికి యిబ్బందులున్నంత కాలం యీ ఉద్యమం చాలా హెచ్చుస్థాయిలో నడిచింది: పన్నులు తగ్గటం, వర్తకం బాగుపడటంతో వారి స్థితిగతులు మారాయి; యీ ఉద్యమం అంతరైపోయింది.

ఈ విషయాన్ని స్పష్టం చేస్తూ ఫాక్స్, "కమ్యూనిజమ్" అనే గ్రంథంలో యిలా అన్నాడు:

"ఆరోజులలో కార్మికవర్గం రాజకీయంగా చాలా తక్కువ స్థాయిలో ఉండేది. యంత్రాన్ని నడిపించే యజమానిని దూషించడానికి బదులు యంత్రాన్నే దూషించిన రోజులున్నాయి. భావిని గూర్చి యోచించుటకు బదులు గతకాలంపైన దృష్టిని కేంద్రీకరించిన దినాలుకూడా ఉన్నాయి..." (పుట 26)

అయినా, కార్మికవర్గానికి అనుకూలంగా కాక వ్యతిరేకమైన దురభిప్రాయాలను, చరిత్రకు ప్రతికూలమైన భావాలను, లెనిన్ ప్రకటించడం చాలా ఆశ్చర్యకరమైన సంగతి

---

** "పారిస్ కమ్యూన్"— ఫ్రాన్సులో 'మ్యునిసిపాలిటీ'కి "కమ్యూన్" అంటారు 1789 లో ఒక 'విప్లవసంఘం' పారిస్‌లో యీ పేరుతో స్థాపించబడ్డది గాని 1794 లో అది రద్దుఅయింది. 1871 లో రెండో పారిస్ కమ్యూన్ స్థాపితమై, జర్మన్ సైన్యాలు పారిస్‌నుంచి వెళ్ళిపోగానే, పారిస్‌ను ఆక్రమించింది. "జాతీయ ఎసెంబ్లి"కి బదులు కమ్యూన్‌ల కూటమి ప్రభుత్వాన్ని సాగించాలని అన్నది. "ట్యూలరీస్" (రాజభవనం)నీ, విల్లిహోటల్‌నీ, యింకా అనేక ప్రభుత్వ భవనాలనీ, తగలపెట్టేశారు, ఈ విప్లవాన్ని 'జాతీయ దళాలు' వచ్చి అణచివేశాయి.

అయితే, తాను ఉద్దేశించిన విప్లవానికి కర్షకుల సహాయాన్ని ఆర్జించడానికిమాత్రం లెనిన్ సిద్ధపడ్డాడు: వారికిమాత్రం ప్రాముఖ్యం లేని స్థానాన్నే యిచ్చాడు.

ఉదాహరణగా — 1893 లో "గ్రామాలలోని దరిద్రులు" గూర్చి వ్రాస్తూ, నాటి రష్యా అంతటా విప్లవంచేసి, తిరుగుబాటు చెయ్యాలని అన్నాడు... కాని ప్రత్యేకమైన ప్రముఖపాత్ర నిర్వహించమన్నాడా?

అబ్బే... వారు పట్టణ కార్మిక ప్రజకు సహాయంగా మాత్రమే నడవాలన్నాడు.

తుదివరకూ పోరాటాన్నేమో కర్షకులు సాగించాలి... దాని ఫలితంగా స్థాపింపబడే స్వాతంత్ర్యంమాత్రం — "కార్మిక కర్షక స్వాతంత్ర్యం!" అంటే, ఆ వ్యవస్థలో ద్వితీయస్థానాన్నిమాత్రమే కర్షకులు ఆక్రమించుకోగలరన్నమాట!

ఇంతకుపూర్వం జరిగిన కర్షక విప్లవాలలో నాగరిక కార్మికుల సహాయం లేకపోవడంచేతనే కర్షకవర్గం అపజయాన్ని పొందిందని ఊహించి లెనిన్ యిలా అన్నాడు —

అంటే, యే విప్లవానికైనా నాయకత్వం వహించడానికి, మార్గదర్శకులవడానికే, ఒక్క నాగరిక కార్మికులకే సామర్థ్యం ఉందని లెనిన్ విశ్వాసం!

కాని, సోషలిస్టు రివల్యూషనరీల ప్రయత్నాలను ఎదుర్కొంటూ, కర్షకులకు ఎవరి నాయకత్వం అవసరంలేదని, వారి సంగతి వారు చూచుకోగలరని చెప్తూ, "ఏం, కర్షకులు చంటిపిల్లలా యేమిటి వాళ్లు యింకొకరినుంచి ఆజ్ఞలను పుచ్చుకోడానికి?" అని ప్రశ్నించాడు.

*　　*　　*　　*

సోషలిస్టు రివల్యూషనరీలు ప్రతిపాదించిన ఆర్థిక ప్రణాళికలో ముఖ్యమైన పంక్తులు యివి—

1. రైతులలో సహకారసంఘాలను నెలకొల్పాలి.

2. వారు 'మీర్' అంటే, గ్రామపంచాయతీలలో బలపడాలి.

రైతులు వారి భూములను అమ్ముకోనే హక్కు లేకుండా చెయ్యాలని సోషలిస్టు రివల్యూషనరీలు చేసిన ప్రతిపాదనను ప్రతిఘటిస్తూ, సామ్యవాదం సిద్ధించాక కార్మికవర్గం బూర్జువా వర్గాన్ని జయించాక, భూములను సంఘమంతటికీ చెందేటట్టు చేస్తాం, భూమిని అమ్మే హక్కు ఎవరికీ ఉండదు" అని లెనిన్ ఉద్ఘాటించి, తాను యింతకుముందు చెప్పినది తానే కాదన్నాడు.

తాను ఏనాడో జరగాలనే విషయాన్ని సోషలిస్టు రివల్యూషనరీలు అనాడే - వెంటనే - జరగాలని ప్రతిపాదిస్తే, లెనిన్ ఎందుకు ప్రతిఘటించాడు? ఈ ప్రశ్నకు లెనిన్ యిచ్చిన జవాబు "ప్రతి విషయానికీ మొదటి మెట్టు, ఆఖరి మెట్టు ఉంటాయి. వానిలో ఒక దానిని రెండవ దానిగా భ్రమించ కూడదు" అని.

అయితే, మొదటి మెట్టూ, ఆఖరి మెట్టు రెండూ ఒకటే అయి, రెండూ ఒకవిధమైన ఫలితాలనే యివ్వగలవని నిశ్చయమైనా ప్రతిఘటించడంలో అర్థమేమిటి?

సోషల్ డెమొక్రాటులు (కార్మిక నాయకులు), సోషలిస్టు రివల్యూషనరీలు (కర్షక నాయకులు) కాకపోవుట చేతనే కాదు యీ ప్రతిఘటన!

'మీర్'లో - గ్రామ పంచాయతీలో రైతుల సమైక్యత అయితేనేమి, కర్షక వర్గపు ఏకీకృత వ్యవస్థ అయితేనేం. సోషలిస్టు రివల్యూషనరీల నినాదములుగా ఉన్నంతవరకూ, లెనిన్ వాటిని ప్రతిఘటించాడు. కాని, సోషలిస్టు రివల్యూషనరీలు పోయి తనవంతు వచ్చేసరికి యితర గ్రామీణ ప్రజలతోపాటు కర్షకులతోను, మోతుబరి రైతులతోను, కనీసం కొన్నిరోజులపాటు సమైక్యతాభావాన్ని కార్మికులు కలిగి ఉండాలని ప్రతిపాదించాడు. ఈ ప్రతిపాదనకు కారణము "కర్షకులు సమాన హక్కులు కోరుతున్నారు కాబట్టి కర్షక ప్రజానీకం ఒక సమైక్యతతో ముందడుగు వేస్తారు." అని.

మరొకచోట లెనిన్ యిలాగ హెచ్చరిస్తున్నాడు—

"దరిద్రులైన రైతులూ, మోతుబరి రైతులూ కలిసి ఒకరి ప్రక్కనొకరు నిలబడి జమీందారీ బానిసత్వము నుండి విముక్తులగు

టూ పోరాడాలి. ఒకరి సహాయం ఒకరికి లేకపోతే, వారు విముక్తులు కాలేరు సరికదా నాగరిక కార్మికులతో సమ్మేళనమగుటకు తగిన స్వాతంత్ర్యమైనా సంపాదించలేరు" *

కాని, కర్షక వర్గం సమైక్యత పొందాలనే యీ ధోరణిని హెచ్చుకాలం లెనిన్ అనుసరించలేదు "బూర్జువా ప్రజాస్వామిక విప్లవము"ను ప్రారంభించే వరకే దానిని అనుసరించాడు. "బూర్జువా ప్రజాస్వామిక విప్లవం" అంటే, బూర్జువా వర్గాన్ని శక్తివిహీనంగా చేశాక, నిరంకుశ ప్రభుత్వం కావాలనే వర్గానికి వ్యతిరేకంగా జరిగే ప్రజా స్వామిక విప్లవం.

ప్రజాస్వామిక విప్లవాన్ని సాధించిన తర్వాత సామ్యవాద విప్లవాన్ని సాధించడానికి "కర్షకవర్గాన్ని విభజించటం" లేక "రైతు వర్గాన్ని ముక్కలు ముక్కలుగా చేయడం" అనే విధానాన్ని అవలంబించాలని లెనిన్ ఉపదేశించాడు. రైతాంగ శక్తిని నశింపచెయ్యాలనే ఉద్దేశంతోనే యీ కర్షక వర్గ విభజన విధానాన్ని లెనిన్ ప్రారంభించాడు.

లెనిన్ యీ విషయంలో యిలా ఉద్ఘాటిస్తున్నాడు; "బలాన్ని ఉపయోగించి బూర్జువా ప్రతిఘటనను అణగద్రొక్కటానికీ, చోటా బూర్జువావర్గం, రైతాంగం కదలకుండా స్తంభింపజెయ్యడానికీ, అర్ధ కార్మిక (సగం కూలీల) వర్గాన్ని కూడా కార్మికవర్గం తన పక్షంలో చేర్చుకోవాలి. అప్పుడే కార్మికవర్గం సామ్యవాద విప్లవాన్ని సాధించ గలదు."

కర్షక వర్గానికి వ్యతిరేకమైన ధోరణిలోని లెనిన్ 1803 లో ప్రదర్శించుటకు ప్రారంభించాడు. 1905 ఏప్రిల్ నాటికికూడా దానిని

---

* ఒక చిన్న విషయాన్ని మనం యిక్కడ గమనించాలి. నేటి భారత రైతాంగం తెలిసో తెలియకనో, లెనిన్‌ను తూచా తప్పకుండా అనుసరిస్తూ సమైక్యతతో భూస్వాములకు ఎదురు నిలుస్తుంటే, భారత కమ్యూనిస్టులు వారిని విమర్శిస్తున్నారు. లెనిన్ సిద్ధాంతాలకే ఆ విమర్శ వ్యతిరేకమని బహుశః భారత కమ్యూనిస్టులకు తెలీదు.

తను మార్చుకోలేదు. 1905 లో అన్నమాటలు "కార్మికవర్గం చేతుల లోనూ, బీదరైతుల చేతులలోనూ రాజ్యాధికారం మనం ఉంచాలి," అని.

వెనుకముందులను జాగ్రత్తగా ఆలోచించాకనే "కర్షకవర్గ విభజన" అన్న నూరోపాయాన్ని లెనిన్ ప్రారంభించాడు. మధ్య తరగతి రైతులు బూర్జువా వర్గం పక్కకు ఒరుగుతారేమోనని, దానిని బలపరుస్తారేమోనని అనుమానమే యిందుకు కారణం.

అయితే, యీమధ్య తరగతి రైతులంటే ఎవరు?

లెనిన్ వీరిని యిలా వర్ణించాడు, "వీరు చిన్నచిన్న భూములను సేద్యంచేసుకొనే వ్యవసాయదారులు. ఈ భూములు వీరి ప్రత్యేక ఆస్తులుగానైనా ఉంటాయి; లేదా, వీటిని కౌలుకు (గుత్తకు) తెచ్చుకుంటారు. ఇవి చిన్నవేఅయినా, మామూలు పెట్టుబడిదారీ విధానం రోజులలో, సాధారణంగా రైతుకుటుంబానికి తిండికి సరిపోయినట్లు పండుతాయి; అతని పశువులకు కావలసినంత గడ్డి దొరుకుతుంది. మంచిదినాలలో కొద్దిగానైనా దాచుకొని, ముందుముందు పెట్టుబడికింద మార్చగలిగినంత పంట పండుతుంది. ఈ రకం రైతులు తరుచు పైకూలీలను ఉపయోగిస్తారు."

(స్టాలిన్ వ్రాసిన "కర్షకవర్గం గురించి" లో 12, 13 పుటలు) నుండి

మధ్యతరగతి రైతులగురించి లెక్క యిలా చెప్పాడు లెనిన్.

"చాలా బీదరైతులను, గుర్రంగాని, భూమిగాని లేని $3\frac{1}{2}$ మిలియనుల రైతులను, ఒక్కగుర్రంఉన్న $3\frac{1}{2}$ మిలియనుల రైతులను, కలుపుకుంటే మొత్తం 10 మిలియనుల రైతుకుటుంబాలు ఉన్నాయి. ఇందులో మధ్యతరగతి కర్షకుల సంఖ్య 2 మిలియనులు."

(లెనిన్ వ్రాసిన "గ్రామీణ దరిద్రులకు" నుండి)

లెనిన్ ఉద్దేశంలో "చాలా బీదరైతులు" అంటే గుర్రం, భూమీ లేని $3\frac{1}{2}$ మిలియనులమందీని.

అంటే, పది మిలియనుల వరకూఉన్న రైతువర్గంలోంచి, మూడున్నర మిలియనుల రైతుల సహాయంతో మాత్రమే పారిశ్రామిక కార్మికవర్గం సామ్యవాద విప్లవాన్ని సాధించాలి అన్నమాట!

అయితే, మిగిలిన 7 మిలియనుల కర్షకుల గతియేమిటి?

"ఒక్క గుర్రాన్ని కలిగియున్న 3½ మిలియనుల కర్షకులను చోటా బూర్జువావర్గంక్రింద నిర్ణయించి కార్మికవర్గంలోకి తీసుకుంటారు. మరొక్క తరగతికి చెందిన రెండు మిలియనుల కర్షకులను కార్మికవర్గం సమైక్యతనందుతూ, ఒక నిశ్చయమైనరూపాన్ని పొందుతున్నప్పుడు శక్తిలేకుండా చేసి, కార్మికవర్గం ఒకరూపాన్ని సమైక్యతను పొందాక, చోటా బూర్జువా వర్గంగా లెక్కించబడ్డ 3½ మిలియనులతో పాటు పిదప, కగిన కట్టుదిట్టాలు చేసుకొని; కార్మికవర్గంలోకి చేర్చుకుంటారు" అని నిర్ణయించబడింది.

మిగిలిన 1½ మిలియనుల మోతుబరి రైతులు ("కులక్"లు) ఏమవుతారు? వారి గతి యేమిటి?
సామ్యవాదం లేకుండా నిర్దయంగా వారు "ధ్వంసం" చేయబడతారు.

కర్షక వర్గ సమైక్యతతో విప్లవం జరిపి రాజ్యాధికారాన్ని ఆక్రమించేమోనని, అప్పుడు కార్మిక వర్గం సురక్షితంగా ఉండదేమోనని లెనిన్ భయం. కర్షక వర్గం పుట్టుకా అంతం లేని వర్గంకాదనీ, సర్వకాలములలోనూ ఉండవలసిన వర్గం కాదనీ అతని భావం. అది నలిక వర్గంలోని ఆఖరి తరగతి అని నిర్ణయించి, నశింపచేయబడాలని అన్నాడు, అందుచేతనే కర్షక వర్గపు "నీతి నియమాలు లేని ప్రాబల్యానికి" అరిచి రక్తం భయంతో కరడు కట్టిపోయింది.

లెనిన్‌లో యీ ఆర్భాటపు ఆలోచనలు ప్రారంభమవగానే, హేనికరమైన యీ కర్షక వ్యతిరేక ఉపాయాలు ధర్మంగానూ, సహజంగానూ కనబడ్డాయి,

కర్షకులు అధికారాన్ని ఆక్రమిస్తారేమోనని అనుమానించే "బహుళ కర్షకులు అంత దేశాన్నీ అంత అధికారాన్నీ తీసుకుంటారేమో!" అని లెనిన్ అన్నాడు. 1917 లోని రష్యా విప్లవంనాటికి రష్యన్ కర్షక వర్గంలో రాజకీయ చైతన్య సంచలనం ఎంత అధికంగా ఉందో యీ ఉద్ఘాటన సూచిస్తుంది.

బోల్షివిక్ పార్టీ కార్మిక వర్గం కోసం అధికారాన్ని తెచ్చుకోవాలని అన్ని శక్తులూ కేంద్రీకరిస్తుంటే, సోషలిస్టు రివల్యూషనరీలు కర్షకులకు - కార్మికవర్గం సహాయంతోనైనా - బలాన్నీ, అధికారాన్ని సంపాదించుకోసమని సలహా లివ్వలేదు. వారికి మార్గదర్శకులు కాలేదు

ఈ రెండు రాజకీయ పక్షాల మధ్యా కక్షలూ, కార్పణ్యాలూ పెచ్చుపెరిగి పోయాయి. ఆఖరుకి బోల్షివిక్ పార్టీ ప్రత్యేకంగా ఒక్క కార్మిక వర్గంలోనే బలపడిపోయింది. సోషలిస్టు రివల్యూషనరీలు ఒక్క కర్షక వర్గంలోనే బలపడిపోయారు. ఈ విధంగా ఆ రెండు పక్షాల రాజకీయ సాంఘిక ప్రాబల్యాలు వేరై పోయినాయి.

"కర్షకులు సంపూర్ణ అధికారాన్ని తీసుకుంటారేమో నని అనుమానాన్ని భయాన్ని మనస్సులో పెట్టుకొని నేనీ రూఢి అయిన గ్రామీణ కార్యక్రమాన్ని తయారు చేస్తున్నాను. ఈ విషయంలో ఒక ప్రక్క వ్యవసాయిక పారిశ్రామికులకూ, బీద రైతులకూ, మరొక ప్రక్క కర్షక భూస్వాములకూ మధ్య యేర్పడ్డ కొత్త సంఘటనలను, గాఢంగా అలుముకొంటున్న బేదాభిప్రాయాలను జ్ఞప్తియందు ఉంచుకొంటున్నాను;" అని లెనిన్ అన్నాడు.

(స్టాలిన్ : "గ్రామీణ కార్యక్రమం" - పుట 17)

అంటే, రైతులు సంపూర్ణ అధికారాన్ని చేపట్టకుండా అడ్డుటకు రైతులలోని ప్రత్యేక పక్షాల మధ్య అణిగియున్న అభిప్రాయ బేధాలను లెనిన్ రెచ్చకొట్టుటకు ప్రారంభించాడన్నమాట. "కార్మిక వర్గానికీ, బీదరైతులకూ నియంతృత్వమన్న నినాదాన్ని మనం అవలంబించక పోతే సోషలిస్టు రివల్యూషనరీలు, మెన్షవిక్కులు కలిసిపోయి, సమైక్యానంది యుందురు. వారు కలిసిపోయివుంటే, వారిని ఈశ్వరుడైనా జయించలేకపోయి ఉండును. కాని, మనం యీ నినాదం అనుసరించడం చేతనే యీ రెండు వర్గాలు కలిసిపోయే ఉపాయాన్ని జయించగలంత శక్తివంతమైన రాజకీయ వర్గాన్ని తయారు చెయ్యగలిగాం" అని స్టాలిన్ ఆనాటి సంగతులను ఆనాటి కర్షక విభజనోపాయాన్ని వర్ణిస్తూ చెప్పాడు.

మరొకచోట యిలా అన్నాడు. "అక్టోబరు నాటిలోని పరిస్థితుల గూర్చి ఒకమాట కులకుల ప్రతిఘటనను, మధ్యతరగతి కర్షకుల చంచలత్వాన్ని ఎదుర్కొని కూడా మనం జయించ గలిగాము అంటే అందుకు కారణం బీదరైతుల సహాయమే !"

రైతువర్గానికి నైతికంగా బలహీనతను కలుగజేసి, కార్మిక వర్గ నియంతృతాలను సాధించడానికే "కర్షక వర్గ విభజనోపా

యాన్ని" అంటే, మోతుబరి రైతులు, మధ్యతరగతి రైతులు, బీద రైతులు అని వారిని భాగించడం, వారిలో వారికి కావేషాలు హెచ్చించడం — లెనిన్ ప్రతిపాదించాడని యీ సంగతులన్నీ స్పష్టం చేస్తున్నాయి.

ఆనాటి పరిస్థితులను స్టాలిన్ తప్పుగా వర్ణిస్తున్నాడని, సంపూర్ణ కర్షక వర్గ సహాయంతోనే కార్మిక వర్గం అధికారాన్ని సంపాదించిందని లెనిన్ సహా అంగీకరించాడని, "పోక్ రోవస్కీ" అనే ఆయన అన్నాడు.

ఈ ఆరోపణలకు జవాబు యిస్తూ, "మనం కర్షక వర్గం అంతటినుండీ, అన్ని వర్గాల రైతులనుండీ కొంత సహాయాన్ని పొందామనడం నిర్వివాదమైన అంశము" అని స్టాలిన్ అన్నాడు.

స్టాలిన్ కార్మిక వర్గ పక్షపాతి; కర్షకులను నాశనం చెయ్యాలని విశ్వ ప్రయత్నం చేశాడు. కాని, అంతర్యుద్ధకాలంలో విప్లవ పక్షాలకి రైతులు అన్ని విధాలా చేసిన అమూల్య సహాయాన్ని ఎలా మరిచిపోగలడు ?

స్టాలిన్ యింకా యిలా అన్నాడు — "అయితే, రైతాంగం అంతా అక్టోబరు నెలవరకు మాత్రమే మనలను బలపరిచారు; అక్టోబరు తర్వాత, మనం బూర్జువా విప్లవాన్ని ఆఖరు చేసే వరకే మనకు సహాయం చేసారు"

అంటే, ఒక్క కార్మిక వర్గమే నియంతృత్వం స్థాపించడానికేమి, రాజకీయాధికారాన్ని ఆక్రమించడానికేమి కర్షక వర్గం అంతా సహాయపడ లేదని, పడరని అన్నమాట.

రష్యన్ కర్షక వర్గంలోని అన్ని పక్షాలూ కార్మిక వర్గ నియంతృత్వం స్థాపించబడుటకు కంగీకరించవని లెనిన్‌కు తెలుసు; అందుచేతనే కర్షక వర్గాన్ని విభజించటం అనే మాయోపాయం పన్ని, అందులోని వేరు వేరు పక్షాలను ఒక దానిమీదకు యింకొక దానిని ఉసికొల్పేరు.

అయితే — యిలాటి కర్షక వ్యతిరేకమైన భయాలకు రాజకీయంగా తప్పు ఆలోచనలను, పెంపొందించడం వ్యవసాయిక చర్యలను సహకార పద్ధతులలోనికి మార్చుకొనే వ్యవసాయిక ధనిక వర్గాన్ని స్థాణువుగా, కదలిక లేకుండా చెయ్యాలని, సోషలిస్టు

రివల్యూషనరీలు సలహాయిస్తే, అసలహాను కర్షకులు అంగీకరించకూడదనడం జారిస్టుల నిరంకుశ పరిపాలనా విధానానికి ప్రతికూలంగా పోరాటం సాగించమని కర్షకులకు సలహాయిస్తూ, అక్టోబరు నెలకు ముందురోజులలోను, ఆనెలలోను, ఆతర్వాతను వారు పోరాడుతున్న లక్ష్యం "కర్షక కార్మిక నియంతృత్వమ"ని మాటిమాటలలో చెప్పి, విప్లవంలో జయించాక, "విభజనోపాయాన్ని" పట్టుకొని వారిమీద ఎదురు తిరగటం తాము చెప్పిన కర్షక కార్మిక వర్గనియంతృత్వంలోని కర్షక వర్గమంటే "సంపూర్ణ రైతాంగంకాదు; అందులోని అతిబీద రైతుల భాగం మాత్రమే" అని ఉద్దేశమంటూ అర్థం చెప్పడం; యిదంతా ఏ నైతికసూత్రాలను ప్రమాణంగా తీసుకున్నా కమ్యూనిస్టు నీతినే ప్రమాణంగా తీసుకున్నాకూడా న్యాయంగాను, ధర్మంగాను ఉన్నదా?

కాని యుద్ధంలోను, ప్రేమలోను ఎట్టిపనులైనా న్యాయ సమ్మతమనే అంటారు పెద్దలు. లెనిన్, స్టాలిన్‌లు యిద్దరూకూడా యుద్ధం చెయ్యటం కార్మికవర్గ నియంతృత్వంకోసం కాని,కర్షక వర్గనియంతృత్వం కోసంకాదు.

ఏ విప్లవంలోనైనాగాని ఏమెట్టుమీదనైనాగాని, "ఏవర్గానికి అధికారం వస్తున్నది? అన్న ప్రశ్నే వీరి నినాదం: అంటే "ఏవర్గం అపజయం పొందింది, ఏవర్గం చేతులలోనుంచి ఏవర్గం చేతులలోకి అధికారం వస్తున్నది?" అనే విషయం ఆలోచిస్తారు; అదే వీరి దృక్పథాన్ని నిర్ణయిస్తుంది.

అన్యాయం, అధర్మం అయిన యిదే సనాతన మార్గాలలో ప్రపంచ కర్షకవర్గాన్ని యితర దేశాలలోని కమ్యూనిస్టుపార్టీలు మోసగించవని హామీ ఏదీ లేదే !

*   *   *

ఇక చాలా బీద కర్షకులను ఎలాగ మోసగించారో యిక్కడ చిత్రిస్తున్నాం.

స్టాలిన్ 1927 లో "రష్యాలో ప్రభుత్వం బీదరైతుల కార్మికుల వర్గాల నియంతృత్వంకాదు." అని ప్రకటిస్తూ యిలా వ్రాశాడు.

"బీద రైతుల కార్మికుల నియంతృత్వం అనే నినాదంతో అక్టోబరు నెలవరకూ మనం ముందుకు వెళ్లాము. అక్టోబరు నెలలో

యీ నినాదం ఫలించింది. మన పక్షంలో సోషలిస్టు రివల్యూషనరీలను లాంఛన ప్రాయంగా కలుపుకున్నాం; నాయకత్వాన్ని వారితో పంచుకున్నాము. అయితే, ఆ పక్షంలో మనం - అంటే. బోల్షివిక్కులము అధిక సంఖ్యాకులుగా వున్నాము. కాబట్టి నిజానికి అనాటికే కార్మికవర్గ నియంతృత్వం ఏర్పడింది అన్నమాట. కొద్దిరోజులతర్వాత సోషలిస్టురివల్యూషనరీలు బైటకు వచ్చేశాక యీపక్షం అఖరైపోయింది. అందులో చాలా బీద కర్షకుల, కార్మికుల నియంతృత్వం లాంఛన ప్రాయంగా కూడా అంతమైపోయింది. రాజకీయ మార్గదర్శకత్వాని యింకొకరితో పంచుకోలేని, పంచుకోని ఒక పక్షం చేతులలోతే అంటే బోల్షివిక్ పార్టీ చేతులలోకి నాయకత్వం వచ్చేసింది. మనం యీనాడు కార్మికవర్గ నియంతృత్వం అదే అని వ్యవహరిస్తాం.”

(స్టాలిన్ “కర్షక వర్గం గురించి” పుట 9)

అంటే సిగ్గూ, లజ్జా, లేకుండా కష్టజీవుల అన్ని తరగతులను వాటి పార్టీలను, మింగివేయించి ఒకేఒక పార్టీకి, ఒకేఒక వర్గమునకు కమ్యూనిస్టుపార్టీకి, కార్మికవర్గానికి నియంతృత్వం యిస్తామనే నిర్ణీత నిశ్చయాన్ని లెనిన్ ప్రకటించాడు. *

అఖరికి, పాపం, బీదరైతులుకూడా అధికారంనుంచి అంత కంటె “అధికార భాగస్వామ్యంనుండి” అని అంటే బాగుంటుంది- త్రోసివేయబడ్డారు.

వలసరాజ్యాలలోను, రంగుదేశాలలోను, కమ్యూనిస్టుపార్టీ వారి చేతులలో పడిపోయిన కర్షకవర్గాలకు, చేతిపనివారలకు, యిదే గతి

---

* ఇక్కడ చిన్న సంగతినిగమనించాలి: లెనిన్ యిలా ప్రకటించాడు, కాని భారతదేశంలో తనతో, తనలో కలిసి ఉండే, యితర రాజకీయ పార్టీ కక్షులను ఉంచవని కాంగ్రెస్ నిర్ణయిస్తే, భారతకమ్యూనిస్టుపార్టీ ఆ జాతీయ మహాసంస్థను దుయ్యబడుతున్నది. ఒకరికి ఒకనీతి, తమకు మరొకనీతి రెండింటివల్లా తమకే లాభముండాలి అనే కమ్యూనిస్టుల ద్వంద్వనీతి సూత్రాలకు తగినట్టేఉంది యీ చర్య.

పట్టదూ? రష్యాలో యీ పార్టీ వలలో సోషలిస్టురివల్యూషనరీలు చిక్కుకున్నట్టే, భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ తమ నియంతృత్వంలో యిస్తామన్న భాగస్వామ్యమునుగాని, మరేదో అధికారమునుగాని, ఆశించి కొన్నికొన్ని వర్గాల రాజకీయ నాయకులు వారి వలలో పడిపోయారు. వీరికి ఆనాటి సోషలిస్టు రివల్యూషనరీల గతినే పోలియుండదని, అంతకన్నా వేరుగా ఉంటుందని, నిశ్చయమేమిటి?

లెనిన్ చెప్పినట్లు బీదరైతులు సహాయం చేసి, బలపరిస్తే, విప్లవవాదులు మాత్రమే ధనికవాదుల ప్రతిఘటనను భేదించి, వారిని సంపూర్ణంగా నాశనం చేయగలరు. "అని అనుకున్నంతకాలం, వారు బీదరైతుప్రక్కన ఉన్నారు: వారిసహాయం అర్థించి, "నీవేమాకు దిక్కు" అని అన్నారు వారి సహాయం అవసరం లేనప్పుడు నియంతృత్వంలోని భాగస్వామ్యంనుంచి వారిని త్రోసివేశారు.

"వలతరాజ్యాలలో తప్పుకోవలోపడి, కమ్యూనిస్టులతో చేతులు కలిపిన రైతుమిత్రులను యింతకంటె చక్కగా చూస్తారా?" అనప్రశ్నకు రైతుదేశమైన 'రెడ్ చైనా'లో చైనీస్ "కమ్యూనిస్టులు నిర్వహిస్తున్న రాజ్యాంగ విధానం జవాబునిస్తుంది, రెడ్ చైనాలో చైనీస్ కమ్యూనిస్టులు అచ్చటి రైతుల పేరటకాదు రాజ్యం చెయ్యడం! ప్రపంచ కార్మికవర్గం పేరిట వారా రైతురాజ్యాన్ని పరిపాలిస్తున్నారు!

అంటే, కార్మికవర్గం, తనపేరుతో నడిచే తన అధికారం కొరకే, తన పార్టీబలం కొరకే, తక్కిన ప్రతివర్గాన్ని ఉపయోగించుకుంటుందని మనం గ్రహించవచ్చును.

"మాటలలో ఎలాగున్నా, చేతలలో బీదకర్షకులను కార్మికులుగా అంగీకరించి వారిని కార్మికవర్గం నియంతృత్వం తనలోకి తీసుకుందికాదూ?" అనిఅంటే, లేదు; వారిని "సగంకార్మికులు"గానే ఎన్నుకున్నారు.

లెనిన్ * ఏభయ్యో జన్మదినోత్సవసందర్భంలో "* బోల్షివిక్కులు కార్మిక కర్షక వర్గాల విప్లవ ప్రజాస్వామిక నియంతృత్వం స్థాపించేమని వాదిస్తున్నారు." అని స్టాలిన్ ఉద్ఘాటించాడు. (చూ. "లెనిన్" పీపుల్సు పబ్లిషింగ్ హౌసు) కాని 1927 లో స్వయంగా యిలాగ వ్రాశాడు; "లాంఛనప్రాయంగా ఉన్న బీదకర్షక కార్మికుల వర్గాల నియంతృత్వం చాలాకాలం క్రిందటనే అంతమైపోయింది."

1927 లో స్టాలిన్ చెప్పిన మాటలే నిజము. "కార్మిక కర్షక వర్గాల ప్రజాస్వామిక నియంతృత్వం" అన్నది కట్టు కథ. ఇందులో 'కర్షకులు' అంటే 'బీద రైతులు' అని హంసపాదు ఒకటి మానసికంగా ఉంది. ఈ బీదరైతులను అధికారము నుండి త్రోసివేసిన తర్వాత చాలకాలం వరకూ కూడా ప్రపంచ కర్షక వర్గాన్ని, రష్యన్ కర్షక వర్గాన్ని, మోసగించుటకు మాత్రమే యీ అబద్ధపు కథ చెప్పేవారు.

"అక్టోబర్ విప్లవం రోజులలో సోషలిస్టు రివల్యూషనరీల వ్యవసాయక కార్యక్రమాన్ని ఒక్క మార్పు అయినా చెయ్యకుండా అంగీకరించాక, ఛోటా బూర్జువా వర్గపు కర్షకులతో కలసి, అనధికారంగానే, అత్యంత జయప్రదమైన రాజకీయ కక్షను ఏర్పాటు చెయ్య గలిగాము. * మేము వారిపై అధికార ప్రాముఖ్యాన్ని వహించ కోరడం లేదని వారితో రాజీకుదుర్చుకోడమే మా ఆకాంక్ష అని కర్షకులకు రుజువు చేయడానికే వారితో యీ సంధిని చేసుకున్నాము * * అదే సమయంలో అతివాదులైన సోషలిస్టు రివల్యూషనరీలతో కలిసి ఒక్క ప్రభుత్వములోనే పనిచేయుటకు వీలైనట్టి రాజకీయ కక్షను ఒకదానిని మేము ప్రతిపాదించేము; త్వరలోనే దానిని అధికార యుక్తంగా సాధించ గలిగాము."

('వామ పక్షీయ' కమ్యూనిజమ్ - పుటలు 39_40)

---

* ఇదే కార్యక్రమాన్ని 1903 నుండీ లెనిన్ దూషిస్తున్నాడని పాఠకులు జ్ఞాపకం ఉంచుకోవాలి.

* * ఇంతవరకూ కర్షక విభజనోపాయాన్ని ప్రారంభించమని స్టాలిన్ తన పార్టీకిసలహాచెప్తున్నాడు; కర్షకులను వదలించుకోవాలన్న లెనిన్ నిశ్చయానికి 'మేలు, భళాభళీ' అని వెనకతాళం వేస్తున్నాడు.

ఈవిధంగా కర్షక వర్గంలోని అతివాద పక్షానికి ఏవో కొన్ని పదవులను ఎరచూపి, నాయకత్వంలో అంతస్తులను, రాజకీయసంస్థలో ముఖ్యభాగాన్నీ తయారుచేసి, రైతులకొక రాజకీయ కార్యక్రమాన్ని అందిచ్చిన ఆ రాజకీయ వర్గాన్ని లెనిన్ విభజించ గలిగాడు. బ్రెస్ట్ లిటొవ్స్క్ సంధి విషయంలో వారు తనతో ఏకీభవించ పోతే తనకు వారి అవసరం తీరిపోయింది కనుక, వారికి కర్షక వర్గంలో విద్రోహులు అనే అపకీర్తి చుట్టుకుంది కనుక వారిని వదలి వేశాడు

అందుచేతనే, రష్యన్ రైతులను కమ్యూనిస్టుపార్టీ మోసగించిందని, వారికి తీరని ద్రోహం ఆచరించిందని మా వాదన.

*　　　*　　　*　　　*　　　*

తమ ప్రతికక్షుల కార్యక్రమంలో ఉన్న మంచీ, చెడ్డా, విమర్శించకుండానే కమ్యూనిస్టులు మొదట దానిని ప్రతిఘటిస్తారు; ప్రతికక్షులు నాశనమైనాక అదే కార్యక్రమాన్ని తూచా తప్పకుండా అంగీకరించి అనుసరిస్తారు. ఈ విషయం మనకు లెనిన్ చర్యలలో స్పష్టంగా కనబడుతుంది.

సోషలిస్టు రివల్యూషనరీలు ప్రతిపాదించిన గ్రామీణ కార్యక్రమాన్ని లెనిన్ ఎలా ప్రతిఘటించాడో చూశాము. రష్యన్ రైతాంగంలో చెల్లుబడిఅవుతున్నది బోల్షివిక్కుల మాటకాదనీ, దాని నాయకత్వం వారి చేతులలో లేదని మాత్రమే లెనిన్ దానిని ఆనాడు ప్రతిఘటించాడు. కాని, తాను అధికారంలోకి వచ్చాక, సోషలిస్టు రివల్యూషనరీలను అణచివేశాక, 'కర్షక సోవియట్ల కాంగ్రెస్' (Congress of Peasant's Soviets) చెప్పిన 242 సూత్రాలున్న ప్రణాళికను వర్గ చైతన్యమున్న కర్షకులలో అత్యధిక సంఖ్యాకుల సంకల్పముగా "అంగీకరించి, లెనిన్ దానిని" తాత్కాలిక చట్టముగా ప్రకటించాడు. *

---

* ఇక్కడ ఒక చిన్న సంగతిని గమనించాలి. భారత కమ్యూనిస్టు పార్టీ కూడా యిదే విధమైన కూటోపాయాలను అనుసరిస్తున్నది. కిసాన్ కాంగ్రెస్ అనుసరిస్తున్న నేటి కార్యక్రమాన్ని ప్రతిఘటిస్తుంది; వారి నిన్నటి కార్యక్రమాన్ని దొంగలించి అదంతా తన ప్రత్యేక కృషి అంటుంది.

కాని, విశేషమైన కార్మిక వర్గ నాయకులు యీ మంచితనానికే అసంతృప్తు లయ్యారు. వారి విమర్శలకు లెనిన్ యీ విధంగా జవాబు యిచ్చేడు:

"రాజశాసనాలనీ, ప్రణాళికనూ, సోషలిస్టు రివల్యూషనరీలు వ్రాశారని కొందరు అంటున్నారు. సరే, వ్రాసారనుకోండి వ్రాస్తేనేమి? ప్రజాస్వామిక ప్రభుత్వం మనది. సర్వసామాన్య పౌరులు చేసిన నిర్ణయాన్ని మనం అంగీకరించక పోవచ్చును. దానితో మనం ఏకీభవించక పోవచ్చును; కాని, దానిని ఉపేక్షించ కూడదు." ('వామపక్ష' కమ్యూనిజమ్)

ఈ రాజీ కొద్దికాలమే నిలిచింది. రైతులు ఉత్పత్తి చేసిన ధాన్యానికి బదులుగా పారిశ్రామిక వస్తువులను గాని, ఏయితర వస్తువులను గాని, యివ్వకుండానే ట్రాట్స్కీ సైనిక దళాల కోసమని వాటిని బలవంతంగా ప్రభుత్వం సేకరించింది. కర్షకులూ కార్మిక వర్గానికి ఎదురు తిరగ వలసి వచ్చింది."

(చూ. వెబ్బు వ్రాసిన "సోవియట్ కమ్యూనిజమ్" 1 వ భాగం
పుట 238)

తిరిగి, రెండోసారి రైతులతో రాజీ ప్రయత్నంగా లెనిన్ ప్రారంభించిన కొత్త ఆర్థిక ప్రణాళిక కారణంగా ప్రభుత్వానికీ, రైతులకూ మధ్య కొద్దికాలం వరకూ శాంతి ఏర్పడ్డది.

కార్మిక వర్గం చేతులో నియంతృత్వం ఉన్నంత కాలం, కర్షకుల ఏకైక రాజకీయ నాయకత్వాన్ని అంటే సోషలిస్టు రివల్యూషనరీలను ఛిన్నం చేసి విభజించుట, కర్షక వర్గ విభజనోపాయాన్ని జయప్రదంగా సాగించుట, కర్షక సంఘాల నిర్మాణాన్ని, సాంఘిక వ్యవస్థను తయారు చేసుకోనటం నిషేధించుట, వీటి అన్నిటి ద్వారా రైతులు వారి రాజకీయ, ఆర్థిక సంస్థలను అభివృద్ధి చేసుకోకుండా తాను నివారించ గలిగినంత కాలం, కర్షకులతో ఎన్ని రాజీలు అంగీకరించినా తనకు ప్రమాదం లేదని కమ్యూనిస్టు పార్టీ అనుకుంది.

సెర్బియన్ రైతు నాయకుడు 'ప్రిబిచేవిచ్', కర్షకులు అధికారంలోకి రాకుండా అడ్డిన వారు బోల్షివిక్ లేనని ప్రకటించాడు. అతడు వ్రాసిన "లివింగ్ స్పేస్" (1940) లోని యీ వాక్యాలు.

“రష్యన్ ప్రభుత్వ కార్య కలాపాలలో ఎంతటి ప్రాబల్యమైనా రష్యన్ రైతాంగమునకు ఉన్నదని ఎటువంటి కమ్యూనిస్టూ అనలేడు. అతని సంగ్రామాన్ని ఎలాగ నడుపుకోవాలో కార్మికునితో రైతు చెప్పడు; కాని, కార్మికుడు మాత్రం రైతుకు అతని భూములను ఎలా స్వాధీనం చేసుకోవాలో, ఎలా సాగుబడి చేసుకోవాలో చెప్తాడు” (పు 198)

# మార్క్స్-లెనిన్ల విషయాలు

## 5

ప్రజాస్వామిక సామ్యవాద సంఘాలలో, కేవల రాజకీయాధికారాన్ని ప్రపంచ కర్షక వర్గం సంపాదించుకోవాలంటే కార్మికవర్గ నియంతృత్వాన్ని ప్రతిపాదించే సిద్ధాంతాన్ని ప్రపంచంలో అన్ని దేశాలలోని కర్షక వర్గాలూ ప్రతిఘటించాలి. ఆర్థిక ప్రాతిపదికల కోసం, రాజకీయాదర్శాల కోసం మాత్రమే కాదు యీ ప్రతిఘటన. కార్మికవర్గ నియంతృత్వంలో కార్మికులు తమ కేదైనా హాని చేస్తారనే నెపిచ్చి భయం కల్పించుకోవలసిన కర్షకులు వారి నియంతృత్వాన్ని నిరాకరించడం లేదు

కమ్యూనిస్టు నియంతృత్వంగా పైకి వచ్చిన సోవియట్ రష్యాలోని కార్మిక నియంతృత్వం రైతులపై చేసిన అత్యాచారమే యీ ప్రతిఘటనకు కారణం.

ఈ అత్యాచారాలు అనేక విషయాలలో జరిగాయి; కాని ముఖ్యంగా “సమిష్టీకరణ, ధరలనిర్ణయం” అనే రెండు శాఖలలోనూ జరిగాయి అందుచేత యిప్పుడు ఆ రెండు శాఖలలోనూ సోవియట్ ప్రభుత్వం కర్షకులకు వ్యతిరేకంగా పరిపాలించిన విధానాన్ని సమీక్ష చేదాం.

ఇంతకు పూర్వం మేము సూచించినట్టు, వ్యవసాయం సహకార విధానాన్ని అనుసరించి వుండాలని లెనిన్ కోరేవాడు, సహకార మార్గములలో నేమి, బుజ్జగింపు మార్గాలలో మాత్రమే వ్యవసాయ పునర్ని

వీటి అన్నిటికీతోడు, కులకులను, సమిష్టీకరణ శత్రువులను ధ్వంసం చెయ్యడానికీ, తీవ్రమైనసమిష్టికరణాన్ని స్థాపించడానికీ, కర్షకులమీద ఒక కొత్తదాడిని ప్రారంభించేడు స్టాలిన్. సమిష్టీకరణ కార్యక్రమంలో పాల్గొంటున్న బోల్షివిక్కులను ఏవిధంగా ఎదిరించినా సరే, వారి చిత్తములను, ఆజ్ఞలను ఎవరైనా అడ్డితే చాలు, వారిని కులకులనడం దేశాంతరవాస శిక్ష విధించడం సైబీరియాకు పంపడం ఆవ్యక్తిని నాశనం చెయ్యడం ఒకొక్కప్పుడు అంతకంటె కొంచెం క్రౌర్యమైనా, తొందరగా జరిగిపోయే విధానాన్ని అనుసరించడం.

ఈ క్షుద్రచర్యలు. యీ హత్యాకాండ, ఆరోజులలో ప్రారంభమైనాయి.

పాపం, కోట్లకొద్దీ అమాయకులైన కర్షకులు లెనిన్ చేసిన వాగ్దానాలను నమ్మి భయంకరమైన బాధలకు, హింసలకు గురయ్యారు. కులకులనే ఆరోపణకు లోనయ్యారు. ఆస్తులను పోగొట్టుకొన్నారు. భూములలోనుండీ, ఇండ్లలోనుండీ, తరిమివేయబడ్డారు. దేశభ్రష్టులుగా చెయ్యబడ్డారు. ఒకొక్కప్పుడు వీటన్నిటికంటె క్రూరంగా నాశనం చేయబడ్డారు.

“అనుభవంలో గ్రహిస్తూ, అమలులోవున్న శాసనాలను సంబంధింపచేస్తూ, వాటిని స్థానికంగా సాగించుతూ, కర్షకులే సత్యమేదో, ఎక్కడుందో బోధపరచుకోగలరు” అనే లెనిన్ సూక్తి గాలికి ఎగిరిపోయింది “ఇంకా, కర్షకులు సోషలిస్టు రివల్యూషనరీలనే అనుసరింప దలచుకుంటే, మనం ‘తథాస్తు’ అందాం” అనే లెనిన్ హామీ వాక్కులుకూడా గాలికి ఎగిరిపోయాయి!

ఈ పరిస్థితులలో పది సంవత్సరాలపాటు 1927 నుండి 1937 వరకు కార్మికవర్గ నియంతృత్వానికీ, రష్యన్ కర్షకవర్గానికి మధ్య ప్రకటితం కాకపోయినా, నిజమైనయుద్ధం సాగిందంటే ఆశ్చర్యంలేదు. ఈ దురన్యాయాలకు, దౌర్జన్యాలకు, బలప్రయోగానికి, నిర్బంధవిధానాలకు, కోపోద్దీపితులైన రైతులు ఎదురుతిరిగారు.

నిర్బంధించి సమిష్టి వ్యవసాయాన్ని స్థాపించిన సోవియట్ రిపబ్లిక్ “లో కొన్ని విభాగాలలో కొద్దిగానో, గొప్పగానో, విధ్వంసక చర్యలు జరుపబడ్డాయి,” అని వెబ్బ్సుకూడా అంగీకరించారు.

తన 'బిజలీ' దళాలను వదిలింది; ఆ వెఱ్ఱికోపంలో అనేక ఘోరాలను ఆచరించినందుకు వాటికి స్టాలినే బాధ్యుడు.

మిస్టర్ స్ట్రాస్ కర్షక పక్షపాతి కాడు: ఆయన 1941 లో ఇచ్చిన లెక్కలను పట్టి చూస్తే, 1913లో బజారులోకి అమ్మకానికి వచ్చిన ఉత్పత్తిలో కులకుల ఉత్పత్తి నూటికి50 వంతులు; అది 1927 నాటికి నూటికి 20 వంతులకి తగ్గిపోయింది. ఇక పేద మధ్య కర్షకుల ఉత్పత్తి 23 నుంచి 74 వంతులకు హెచ్చింది. 1927 లోనూ, ఆ తర్వాతా, ధాన్యపు మార్కెట్లలో కులకులు అధికారయుతమైన శక్తిగానూ, ప్రముఖ శక్తిగానూ లేరని ఈ అంకెలను బట్టి మనకు నిశ్చయమవుతుంది. పేద, మధ్య రైతులు ఆ ఉన్నత స్థానాన్ని ఆక్రమించుకున్నారు.

ఈ పేద రైతుల మీదా, మధ్య కర్షకుల మీదా సమిష్టికరణం అన్న పేరుతో స్టాలిన్ సారథ్యం వహించిన [illegible] పని చేసి వుండాలి.

సోవియట్ రష్యా కర్షక వర్గపు అత్యధిక భాగానికి [illegible] లకు "కులకులు" ఒక పేరు మాత్రమే. అందుచేతనే, సక్రమ శిక్షణ లేని కర్షకులకూ, సక్రమ శిక్షణ వున్న నిరంకుశ సోవియట్ దళాలకు జరిగిన పోరాటంలో కర్షకులు ఓడిపోయినప్పుడు "వ్యవసాయక ఉత్పత్తిలో నూటికి 83.5 వంతులు ఉత్పత్తి చేసే రైతుల ఓటమి యిది" అని గొప్పగా, డాబుగా చెప్తాడు కాలిన్స్.

"సోవియట్ కమ్యూనిస్టు ప్రభుత్వం కులకులంటే ఎవరో నిర్వచించుటలో న్యాయం నియమం లేకుండా ఉండేదన్న సంగతి అందరికీ తెలుసు! ఈ నిర్వచనం పరిస్థితులను అనుసరించి మారిపోతుండేది. మొట్టమొదటిలో, కర్షకులతో "మేము మీ పనులకు ఏమీ ఇవ్వం మీరు మాత్రం మాకు ధాన్యం ఇవ్వాలి" అని ఆజ్ఞాపించిన ప్రభుత్వానికి ఏకొంచెం పంట అయినా యివ్వడానికి నిరాకరించడం చేతను, తర్వాత సమిష్టీకరణ వ్యవస్థను అంగీకరించక పోవడం చేతను ప్రభుత్వం అనుసరించే యీ వ్యతిరేక ధోరణికి "కులకులే" మొదటి తాంబూలం పుచ్చుకున్నారు". అని స్ట్రాస్ వ్రాశాడు!

సోవియట్ ప్రభుత్వం తన అధికారాన్నంతటినీ వినియోగించి నిర్ణయించిన యీ వ్యవసాయక పునర్నిర్మాణాన్ని నిర్బంధం లేకుండా

"స్వచ్ఛంద సహకారం అనే సూత్రాన్ని మనం ఉల్లంఘించాము" (పుట 90)

"సైనిక సమస్యలను పరిష్కరించేటప్పుడు శత్రువు పై బలాదాడి అవసరమూ, యుక్తమూ కాని, సమిష్టి వ్యవసాయంలో సమస్యలను పరిష్కరించడానికి ఉపయోగించడం యుక్తం కాదు, పైగా విపత్కరం కూడాను" (పుట 89)

"ఈ తప్పు లన్నిటికీ మూలకారణం మధ్య కర్షకులపట్ల వుండే తప్పు దృక్పథం"

"ఆర్థిక స్వరూపంలో నేమి, సభ్యతలో నేమి, ఔన్నత్యంలో నేమి, అనేక భేదాలున్న రాష్ట్రాలు ప్రదేశాలు, సోవియట్ రష్యాలో చాలా వున్నాయన్న సంగతి ప్రభుత్వం మరచిపోయింది"

"కొందరు కార్యకర్తలు సమిష్టి వ్యవసాయంలోని మొదటి గెలుపులతో మత్తిల్లి లెనిన్ ఉపదేశాలను మరచిపోయారు అంతే కాదు; సమిష్టికరణ పరిసమాప్తి కాలమును సెంట్రల్ కమిటీ 1929 నుండి 1933 వరకూ పొడిగించిన సంగతికూడా మరచిపోయారు"

మెరపు మెరసినట్లు మహావేగంతో సాగించబడ్డ సమిష్టికరణమునకు ఉదాహరణ లిచ్చాక స్టాలిన్ యిలా అన్నాడు."

"సమిష్టికరణంలో ప్రభుత్వం అనుసరించిన మహావేగం చూశాక తమకంటె అధికతరంగా సిద్ధమయిన జిల్లాలను మించిపోవాలనే ప్రయత్నంలో సమష్టి వ్యవసాయోద్యమానికి సిద్ధంగా లేని జిల్లాలు కర్షకుల పై అధికమైన ఒత్తిడిని కార్యనిర్వాహక శాఖనుండి ప్రవేశపెట్ట వలసి వచ్చింది; సమిష్టి వ్యవసాయోద్యమం సత్వరంగా అభివృద్ధి చెందడానికి తమలో లోపించిన గుణాలను యీ విధంగా నిర్వహించడంలో చూపించే ఉత్సాహంతో పూర్తి చేయాలని ప్రయత్నించాయి"*

తనపార్టీ అయితేనేమి, ఆనాటి ప్రభుత్వమైతేనేమి, సాగించిన దారుణ విధ్వంసకాండను స్టాలిన్ సైనిక పరిభాషలో చర్చిస్తాడు:

---

* 'యుద్ధరుణాల'కు చందాలు పోగుచెయ్యడంలో, సేవింగ్సు సర్టిఫికేట్లు కొనిపించడంలో, బ్రిటిష్ కార్యవర్గం చూపిన "ఉత్సాహము"ను రుచిచూచిన మనకు భారతీయులకు రష్యాలోని 'ఉత్సాహం' అంటే ఏమిటో, "ఒత్తిడి" అంటే యెలావుంటుందో బాగా తెలును!

యీ చర్చ తెరవెనుక జరుగుతున్న భాగవతాన్ని మనసు పట్టి చూపు తుంది;

“గెలుపు ఒక్కొక్కప్పుడు ప్రజలకు గర్వాన్ని, మత్తతను కలిగిస్తుంది. అత్యధికంగా గర్వాన్ని, స్వాభిమానాన్ని రేకెత్తిస్తుంది. అపారమైన బలం, ప్రతిష్ఠ వున్న అధికార వర్గానికి చెందిన ప్రతినిధుల విషయంలో యీ విధంగా జరగటం చాలా సులువుకూడాను. ఇచ్చటి శాసనాలు, తీర్మానాలు, ఆజ్ఞలు, అన్నిటికన్నా శక్తిని కలిగి వుంటాయని విశ్వాసం యేర్పడ వచ్చు.

ఈ మాటలు చెప్పుతుంటే, నా మనస్సులో వుండటం ఒక్క స్థానిక సేవకులు మాత్రమే కాదు. ప్రాంతీయ కమిటీ సభ్యులు కొందరు, కేంద్రసంఘ సభ్యులు కొందరు కూడా వున్నారు సమిష్టి వ్యవసాయోద్యమంలోని తప్పులకు వీరు పుట్టిన యిళ్లు. మన కామ్రేడు లలో ఒక భాగం యింతకు పూర్వం వచ్చిన గెలుపు మూలంగా, గ్రుడ్డిగా లెనిన్ సూచించిన మార్గముల నుండి ఎంత వేగంగా పతితు లయ్యారో యీ తప్పుల ఎంత అధికంగా ఎంత లోతుకు పాతుకొని వున్నాయో సెంట్రల్ కమిటీ కూడా 1930 వరకూ గ్రహించలేదు.”

“1930 వరకూ బహుశః అతత్వాత చాలా కాలం వరకు, అశేష రష్యన్ కర్షక జనం గురి అయిన ఓమన నీతిని నిర్బంధముల తీవ్రతను, వాటి స్వభావాన్ని ఎవరూ అంచనా వెయ్యగలరు? అధికార మత్తులైన కర్షక వ్యతిరేక పక్షంలోని వ్యక్తుల చేతులలో ఎన్ని కోట్లమంది కర్షకులు భయంకర దారుణ కృత్యాలకు గురి అయ్యారో? ఎన్ని కోట్లమంది ఆశాభంగం పొందారు; ఎన్ని కోట్లమంది మనం అనుకోలేని హీనస్థితిలోకి రావలసి వచ్చింది?”

* * *

సమిష్టి కార్మిక సంఘ (ఆర్టెల్) వ్యవసాయాన్ని కార్మిక వర్గ నియంతృత్వం సంపాదించ గలిగేరని, స్థాపించ గలిగారనీ కాదు మా ఆరోపణ. కొన్నిచోట్ల ప్రయోగాలను జరిపి, సహకార వ్యవసాయములో వున్న ప్రయోజనాలను, లాభాలను రైతులకు చూపించాలని, యీ విషయంలో వారిలో ప్రచారం చేసి, వారి స్వచ్ఛందంగా ఎన్నుకో నివ్వాలని పట్టుపట్టి లెనిన్ చెప్పాడు. ఈ వుపదే

గాని, స్టాలిన్, అతని కమ్యూనిస్టు పార్టీ, గానీ గ్రహించ లేదని మా ఆలోచన.

రష్యా రైతుల దేశం. పాలనాధికారం అంతా కార్మిక వర్గం చేతుల్లోవుంది. కార్మికులు తాము బోల్షివిక్ పార్టీ చేతులలో ఉంచారు. అని వారి సంగతిని వారికే ప్రాధాన్యతలో, సాంఘికంగా, శక్తివంతంగా చెప్పుకొనే అవకాశాన్ని కర్షకులకు యివ్వలేదు. తంత్రంగాను. క్రమబద్ధంగా రైతులు ఎంతవరకు, ఏ యే సోపానముల ద్వారా, ఏవిధంగా ఏసంస్థలలో, కార్మికసంఘాలద్వారా జరిగే సమిష్టి వ్యవసాయాన్ని ఉపక్రమించగలరో, ఉపక్రమించవలెనో, తమకు తామై నిర్ణయించుకొనే అధికారము ఎప్పుడూ ఏవిధంగాను, బోల్షివిక్ పార్టీ కర్షకవర్గానికి యివ్వలేదు; అందుచేతనే యీ దారుణ చర్యలు జరుపబడ్డాయని మా ఆలోచన

సోవియట్ పాలనాధికారం కార్మిక నియంతృత్వం చేతులలో ఉండియుండకపోతే, సోవియట్ రష్యాలో ప్రజాస్వామిక కర్షక కార్మిక ప్రజారాజ్యపు పరిపాలన వుండివుంటే, కనీసం ప్రజాస్వామిక శక్తివంతం అయిన కార్మిక కర్షక నియంతృత్వం పనిచేస్తుండివుంటే, కర్షకులమీద ప్రయోగించబడిన ఆనాటి వర్ణనాతీతమైన బాధలు ఆనాటి దమననీతి ఆనాటి రాక్షస నిర్బంధాలు తప్పియుండును.

ఏదైనా అధికారానికి ఎదురు చెప్పకపోతే, చేవరతుగా లొంగిపోతే, అది తన బలిపశువును సహజంగా ముంచెత్తివేసి, అణగ త్రొక్కుతుంది. అందులోను, పీడితుల ప్రయోజనాలు దమన అధికారపు ప్రయోజనాలకు వ్యతిరేకమైతే యీ అణగత్రొక్కటం మరీ అధికంగా వుంటుంది

కాని, కార్మికవర్గ నియంతృత్వంమాత్రం కర్షకవర్గాన్ని అణగత్రొక్కటంవల్ల వచ్చిన చెడుఫలితాలనుండి తప్పుకోలేకపోయింది. 1929 నుండి 1939 వరకు సోవియట్ రష్యాలో కర్షకులచేత బలవంతంగా పండిస్తున్న ధాన్యానికి బదులుగా యివ్వడానికి పాలకవర్గమైన కార్మికులవద్ద తగినన్ని వస్తువులు లేవు. అధికార సంపాదనలో ఆత్రుత చేతా, రాజ్యాధికారాన్ని కార్మికవర్గంకోసం గుత్తగా వశపరచుకోవాలనే ఆకాంక్షచేతా స్టాలిన్, అతని అనుచరులూ, అతని పార్టీ, అతని ప్రభుత్వం కర్షకులను ప్రబలశత్రువులుగా చేసుకున్నారు.

కర్షకవర్గంపట్ల వీరి అత్యాచారములను అన్నిటినీ సాగనిచ్చి అప్పుడు స్టాలిన్ ధర్మపన్నాలు వల్లించాడు.

అందుచేతనే ప్రపంచ కర్షకవర్గానికి మా హెచ్చరిక:

"కార్మికవర్గ నియంతృత్వమా! ఖబడ్దార్!"

* * *

రాత్రి ఎంత సుదీర్ఘంగావున్నా ఎంత గాఢాంధకారమయమైనా, తెల్లవారక తప్పదు.

అలాగే, అధికారంలోనున్న కార్మికవర్గానికీ, సమిష్టి వ్యవసాయంలోని కర్షకవర్గానికీ మధ్య జరిగిన యీ సుదీర్ఘ సమరం శాంతికి సంధి కుదురుటతో అంతమైంది. యంత్రపు నాగళ్ళనేమి, పంటలను కోసే యంత్రాలనేమి, ఇతర వ్యవసాయిక యంత్రాలనేమి రైతులకు హెచ్చు అద్దెలకుయిచ్చి, ఆ అద్దెను, పన్నులను, బజారులో కొన్న వస్తువుల విలువను, ప్రతివారం ధాన్యరూపంలోనే చెల్లించాలని అన్నారు. ఆవిధంగా గ్రామాలనుండి అధిక ఆహార-సరాఫరా ఏర్పాటు చేసుకోవడమే కాకుండా తమ రాజకీయ అధికారాన్ని కూడా కార్మికులు కాపాడుకున్నారు. కొంత వ్యక్తిగతమైన ఆస్తిని అంటే, ఒక యింటిని, తోటను, కొంత పశుసంపదను ఉంచుకోడానికి హక్కును కర్షకులు సంపాదించుకున్నారు.

కాని, తమ రాజకీయ ప్రయోజనాలను రక్షించుకోడానికి పాలనాధికారమున్న బోల్షివిక్ పార్టీకి యితరమైన తమ ప్రత్యేక పక్షాలనుగాని, ఆర్థిక ప్రయోజనాలను రక్షించుకోడానికి తమ వర్గసంఘాలనుగాని, నిర్మించుకొనే హక్కును రైతులు యింకా సంపాదించుకోలేదు.

కమ్యూనిస్టుపార్టీతో కలిసి కర్షకులుగావుండే హక్కును రైతులు పోగొట్టుకొనడంకన్న వేరుదారి లేనంతకాలం, కర్షకులుగా ప్రభుత్వములో వారికి భాగం లేనంతకాలం, కర్షకవర్గ సంఘాలను నిర్మాణంచేసుకొనే అధికారం లేనంతకాలం, సోవియట్ పరిపాలన ఏకపక్షం, ఏకవర్గం, కర్షక వ్యతిరేకం అయిన పాలన క్రిందనే లెక్క.

అయితే, సమిష్టి వ్యవసాయ భూములలో "ఈపక్షానికి (అంటే కార్మికపక్షానికి) చెందనివారిని" కూడా బాధ్యతాయుతమైన పనుల

పాటి బాధ్యతగల నౌకరీలను దానరూపంగా అడిగి సంపాదించుకొనే నైతిక బలహీనతకు కర్షకులను తెచ్చారు.

ఇదంతా విప్లవ వ్యతిరేకచర్యకాదూ?

“ఆనాటి సమరం యేవిధంగానూ రక్తపాతం లేకుండా జరగ లేదు. అది అతికఠినం; అతిక్రూరమైనదీని” అని వెబ్సు అంగీకరించాడు.

అందుచేత అభయంకర హత్యాకాండనుండి రష్యన్ కర్షకులు తప్పించుకొని, కనీసం ఓటింగులోనూ, స్వంత తోటలు కలిగి వుండటానికి, కావాలంటే అర్థసంవత్సరానికి మించి వాటిలో పనిచేయకుండానికి ఉన్న హక్కులలో నయినా కార్మిక వర్గంతో సమానత్వాన్ని సంపాదించుకోగలిగారంటే, ఆ సమరం కర్షక వర్గానికి అపకీర్తికరం కాదు; వారి లొంగుబాటు అపజయాన్ని సూచించదు

* * *

ఇక, రష్యన్ కర్షకవర్గంపై నిర్బంధాలు.

లెనిన్ అధికారంక్రింద తయారైన 1927 వ సంవత్సరపు రాజ్యాంగచట్టం అధికభాగం కర్షకుల ప్రయోజనాలకు వ్యతిరేకంగా వున్నది. ఉదాహరణకు ప్రతి కూలీకి ఒక ఓటు, కాని అయిదుగురు రైతులకు ఒక ఓటు అంటే, అత్యల్ప సంఖ్యాకులైన కార్మికులకు అత్యధిక ప్రాతినిధ్యం యిచ్చారన్నమాట *

ఇక, ఎన్నికలలో ఒకేఒక పక్షానికి బోల్షివిక్ పార్టీకి చెందిన అభ్యర్థులుంటారు. తక్కిన అభ్యర్థులందరూ వ్యక్తిగతంగానే పోటీ చెయ్యాలి. అందుకనే కర్షకులకు ఆదినుంచీ నాయకత్వాన్ని కల్పించిన సోషలిస్టు రివల్యూషనరీలకు రాజ్యాంగంలో స్థానం లేకుండా చేసి, తద్వారా రైతులను సక్రమమైన, సమైక్యతనందిన, రాజకీయ నాయకత్వాన్ని లేకుండా చేశారు. అందుచేత కర్షకులకు కార్మిక పక్షపు అభ్యర్థికి ఓటు చేయటంకంటె వేరేదారి లేకపోయింది. ఎవరైనా ధైర్యం చేసి, ఇంకొకరిని ఓటు చేసినా, తమ పక్షానికి చెందకుండా యింకేదో పక్షానికి చెందిన అభ్యర్థికే ఓటు చెయ్యవలసివచ్చేది.

---

* ఇది మనదేశం ముస్లింలీగ్ వారి కోరికను మించిపోయింది! ఇలాంటి పరిస్థితులలో భారత కమ్యూనిస్టుపార్టీ ముస్లింలీగ్‌ను కౌగలించుకొనే ప్రయత్నంలో వున్నారంటే ఆశ్చర్యమేమిటి?

1937 నాటి కర్షకులపై సంపూర్ణ విజయాన్ని తాను సాధించ గలిగానని నమ్మకం బోల్షివిక్ పార్టీకి కలిగింది. అప్పుడు కార్మికులకు, సమానమైన ఓటింగు హక్కులను అంటే, 'ఒక మనిషికి ఒక ఓటు' అన్న నియమాన్ని బోల్షివిస్టులు ప్రవేశపెట్టారు. కాని కమ్యూనిస్టు పార్టీ మాత్రం నవరాజకీయ సర్వాధిపత్యాన్ని అంటే తాను తప్ప మరే ఇతరపక్షం లేకుండాచేసి, రాజకీయాధికారాన్ని తానే గుత్త పుచ్చుకోటం విధానం మాత్రం వదలివేయలేదు. అందుచేత కర్షకులు యిటు కమ్యూనిస్టుపార్టీ అభ్యర్థికో లేక, అటు యేపక్షానికీ చెందని అభ్యర్థికో ఓటు చెయ్యాలి. ఇక యేపక్షానికీ చెందని సభ్యులు శాసన సభలలో ఎంత శక్తివిహీనులుగా వుంటారో మనకు తెలుసును. ఎన్ని కల తర్వాతకూడా వారు ఒక పక్షంగాగాని, ఒక ముఠాగాగాని తయారవలేదు.

అధికారయుక్తమైన ప్రతి పక్షాన్ని శాసనసభలో గుర్తించి స్వాగతమివ్వ గలిగినంత ప్రజాస్వామికంగా యీనాటికీకూడా తయా రవలేదు సోవియట్ పరిపాలన!

1939 నుండి 1944 వరకూ సాగిన సలహాదారుల పరిపాలనే బ్రిటిష్ సామ్రాజ్యవాదపు 'యుద్ధకాల నియంతృత్వం.' వారి పాలనలో భారతీయులకు వున్నపాటి రాజకీయ అంతస్తూ, ప్రతిష్టా, అయినా సోవియట్ పరిపాలనలో కర్షకులకులేవు 1917 నుండి యీనాటివరకు రష్యాలో కర్షకులు వారి వర్గసంఘాలు స్థాపించుకోవడానికి ప్రభుత్వం అంగీకరించలేదు. మన దేశంలో ఆ హక్కును ప్రభుత్వం యింకా రద్దు చెయ్యలేదు.

తాను అధికారంలోకి రాకముందు లెనిన్ కర్షకులకు ముఖ్యంగా బీదకర్షకులకు తమ కమిటీలను ఏర్పరచుకొనే హక్కు వుండాలని వాదిం చేవాడు. కాని బోల్షివిక్కులు అధికారంలోకి రాగానే యీ కమి టీలు మాయమైపోయాయి.

కమ్యూనిస్టుపార్టీయే గుర్తించబడినప్పుడు కర్షకప్రజలు నిజమైన ఆశయాలతో కష్టసుఖాలతో సోవియట్ పాలనకుసంబంధం లేకుండా పోతుందేమోనని అనుమానించే లెనిన్ యీ విధంగా అన్నాడు.

“ప్రజానీకం ఆశయాలతో దగ్గర సంబంధం వుంచుకోడాని కేమి, వారి ప్రశ్నలకు ప్రత్యుత్తర మివ్వడానికేమి, వారిలోని ఉత్త

న్నది? ధనికవాదాన్ని నాశనంచేసి, కర్షకులు మొదలైన యితర వర్గాలమీద జీవించాలనేనా కార్మికవర్గం ఆశిస్తున్నది?"

కాని యీ ప్రశ్నకు శక్తివంతమైన, సరియైన, జవాబునుమాత్రం యివ్వలేకపోయాడు

నిజానికి ... పొందరాని బాధలకు, హింసలకు, నీచావస్థలకు, రష్యన్ కర్షకులూ, చేతిపనివారలూ, ప్రజలు గురిఅయ్యారు. కార్మిక వర్గం ఏదో ఒకమిషమీద తనకోసం వారు పని చెయ్యాలని నిర్బంధించింది; ప్రత్యేకమైన స్వతంత్ర పారిశ్రామిక వర్గంగా వారిని కార్మిక వర్గ నియంతృత్వం గుర్తించలేదు; ఆయావర్గాల ఉత్పత్తిచేసే వస్తువుల మారకపు ధరలలో చాలా భేదం ఉంచి నిర్ణయించింది. అందుచేతనే కర్షకుల జీవిత పరిస్థితులు కార్మికుల జీవిత పరిస్థితులకన్న హీనంగా ఉండేవి.

ఈ సంగతులన్నీ రుజువుచెయ్యడానికి రష్యా అనుభవాలలో కావలసినంత సాక్ష్యంవుంది; కాని, "రాల్ఫ్" ప్రశ్నకు నిశ్చయంగా "కాదు, కార్మికవర్గం అట్లా ఆశించడంలేదు" అని ప్రత్యుత్తరం యివ్వడానికి తగినంత సాక్ష్యంలేదు.

అందుచేతనే 'రాల్ఫ్ ఫాక్స్' తన ప్రశ్నకు "కాదు; కార్మిక వర్గం అట్లా ఆశించలేదు" అని జవాబు యివ్వలేకపోయాడు.

# 6

# లంకెలో పుట్టుక

1930, 40 లలో వున్న యీనాటి కమ్యూనిస్టుల వ్రాతలను జాగ్రత్తగా పరిశీలిస్తే, “ఒకే ఒకవర్గం కార్మికవర్గ, ఒకేఒకపార్టీ కమ్యూనిస్టుపార్టీ,” అనే అపర్యప్రాతిపదికను, వారి పాతపాటనుఅన్ని వర్గాలవారికీ ఉపయోగకరంగా వున్నట్టు ఆశాజనకంగా వున్నట్టు సవరించుకుంటూ రావాలనే ఆశ పెట్టుకుంటేలాభంలేదని స్పష్టమౌతుంది.

ఉదాహరణగా “రాల్ఫ ఫాక్స్”ను తీసుకుందాము. అతను వలసరాజ్యాల ప్రజలవిషయంలో మనదృక్పథాన్నే, తూచాతప్పకుండా కాకపోయినా, కొంతవరకైనా, అంగీకరిస్తాడు. సంపూర్ణముగా అంగీకరించుటకు అతని సనాతనత్వం అడ్డువచ్చింది!

“విదేశాల పెట్టుబడి సాగించే దమన నీతికి బలిఅయిపోయిన పారిశ్రామిక ప్రజానీకమూ సామ్రాజ్యవాద దేశాలలోని కార్మికవర్గమూ, యీ రెండుముఖ్య విప్లవశక్తులూ వలసరాజ్యాలలోని ధనిక వాదపు బలాన్నీ, శక్తినీ, ప్రతిఘటించడానికి ఒక రూపాన్ని పొందుతున్నాయి.” అని “కమ్యూనిజమ్” అనే గ్రంథంలో వ్రాశాడు.

ఈ ‘వలసరాజ్యాలలోని పారిశ్రామిక ప్రజానీకం” రైతులు కాక యింకెవరు? ఆమాట స్పష్టంగా యెందుకు చెప్పడు? అట్లా అంగీకరించడం కమ్యూనిస్టుపార్టీ కార్మికవర్గ సనాతన సిద్ధాంతాలకు వ్యతిరేకమౌతుందనే భయం ఏమో!

“పెట్టుబడిదారి దమననీతి ఫలితంగా నాశనమైన బీదరైతులకు, కర్షకులకు, యీనాటి సాంఘిక వ్యవస్థ సౌభాగ్యకరం కాదనే విశ్వాసం వారికి కమ్యూనిస్టు పార్టీలు కలిగించాలి. ఈనాటి ప్రపంచ ధనిక వాదాన్ని ప్రతిఘటించి, పీడిత మానవులందరి స్వాతంత్ర్య సంపాదనకై పారిశ్రామికులు సాగిస్తున్న సమరంలో సనాతన మానవ సంఘంలోని అత్యంత విప్లవశక్తులను, ఉత్తమపురోగమనశక్తులను, కమ్యూనిజమ్ సమైక్యత కలుగ జేస్తుందని ఉద్ఘాటించాలి” అని కమ్యూనిస్టు పార్టీల కర్తవ్యాన్ని రాల్ఫఫాక్సు ఉపదేశించాడు.

కాని, యీసమరంలో ప్రపంచ కర్షకులు పారిశ్రామికులతో సరిసమానమైన పాత్రనే ధరించాలో, అంతకంటె ఉత్తమైన పాత్రనే ధరించాలో, అతను చెప్పటలేదు. ప్రపంచ ధనిక వాదపు మారురూపమే సామ్రాజ్యవాదం; దానిని ప్రతిఘటిస్తూ వారుసాగిస్తున్న జాతీయ విప్లవసమరంలో వలసరాజ్యాల రైతులు ప్రథమశ్రేణిగా నుండవలసిన అవసరాన్ని ఫాక్సు గుర్తించలేదు.

కాని, వలసరాజ్యాలలో లోలోన కర్షక విప్లవం రగులుతున్నది. "అతను అంగీకరించి, ఆ సమరం పారిశ్రామికుల ఉద్యమంతో సహైక్యత పొందటం, పారిశ్రామిక విప్లవవిజయానికి హామీ" అని అనడం కూడా బాగానేవుంది.

అయితే, ప్రపంచ సామ్రాజ్యవాదానికి, ప్రపంచ ధనిక వాదానికి ప్రతికూలంగా వలస రాజ్యాలలోని జాతీయ విప్లవము, కర్షక విప్లవం ఎంత అధికంగా, ఎంత గాఢంగా ఒకదానితో వొకటి అల్లుకొని పోయాయో అతను గ్రహించలేకపోయాడు

పోగా, ప్రత్యేక నాయకత్వంలో పెంపొందుతున్న వలసరాజ్య ప్రజలజాతీయ విప్లవం నుండి పాశ్చాత్య సాంఘిక విప్లవం సహాయం పొందాలన్న సంగతిని తక్కిన కమ్యూనిస్టుల లాగే ఫాక్సు కూడా గమనించలేదు.

లెనిన్ చెప్పిన వుపాయాలను అనుసరిస్తూ అతను యిలా అన్నాడు;

"ఒక్క కార్మిక కర్షక వర్గాల ప్రజాస్వామిక నియంతృత్వమే ఇండియా చైనాలలోని ప్రజాస్వామిక స్వరూపాన్ని పునర్నిర్ణయం చెయ్యగలదు"

మనలో మాట: "కార్మిక కర్షక నియంతృత్వం" అని చెప్పటలో కర్షక వర్గానికి ముందుగానే కార్మిక వర్గాన్ని వుంచుటకు ఎంత శ్రమ పడ్డాడో చూడండి.

లెనిన్ కూడా అనాడు యివే మాటలను చెప్తూ, అదే సమయంలో కార్మిక వర్గ నియంతృత్వాన్ని సాధించడానికే నిశ్చయించాడు; యీనాడు యీలాంటి ప్రకటనలలో అంతకంటె అధికంగా అర్థం వుందనుకోగలమా ?

తమపైన తాము ఆధారపడ్డ స్వతంత్ర పాత్రను నిర్వహించడానికి గాని పాపం, వలస రాజ్యాల రైతులు ఆశిస్తారేమోనని కాబోలు, ఫాక్సు యీ విధంగా అన్నాడు. "ధనిక వాదుల, భూస్వాముల విప్లవ ప్రతికూలశక్తులకు ఎదురుగా రైతాంగాన్ని మేల్కొల్పి, సక్రమంగా నిర్మించి, ముందుకు తీసుకొని వెళ్లగల శక్తి సామర్థ్యాలు ఒక్క కార్మిక వర్గానికి మాత్రమే, దాని సాంఘికబలం వల్లనైతేనేమి, స్థానబలంవల్లనైతేనేమి ఉన్నాయి"

భారత దేశంలోని రైతులు జాతీయ కాంగ్రెస్‌లోను, చైనా రైతులు క్యుమింగ్ టాంగ్ లోను పాల్గొని బలాన్ని విప్లవానుభవాన్ని సంపాదించుకుంటారేమో నని భయపడి, ఫాక్సు వాటి విషయంలో రైతులను యిలా హెచ్చరించాడు;

"ఇలాంటి పక్షాలు భూస్వాములకు, యంత్రాగారాల యజమానులకు, న్యాయవాదులకు, సైనికోద్యోగులకు, చెందిన చిన్న పిల్ల కమిటీలు. 1813-1848 మధ్యకాలంలో జమీందారీ పద్ధతితో పోరాడుటకు యూరప్‌లో ఉద్భవించిన ప్రజాస్వామిక పక్షాలకు వ్యంగ్య చిత్రాలు మాత్రమే యివి."

"అయితే, యిలా చెప్పటంలో రాల్ఫ్ ఫాక్సు ఉద్దేశం యేమిటి? ఈ వాక్యాలలోని అంతరార్థ మేమిటి? "అని ప్రశ్నిస్తారేమో. అది సర్వ సాధారణంగా కమ్యూనిస్టులు ప్రతి దేశంలోనూ చేసే మాయోపాయమే !

రైతుల యెడల కపట సానుభూతిని ప్రకటించటం, తర్వాత వారిని తమలోకి ఆకర్షించుకోడం, ఆఖరుకు వారిని తమ భావనా ప్రపంచానికి అధిదేవత అయిన కార్మిక వర్గానికి బలి యివ్వడం. ఇదీ వారి మాయోపాయం.

అంతేకాదు: రైతుల కాంగ్రెస్‌లోనే తమ స్థానమని గ్రహించి ఆ మహాసంస్థలో కలిసి స్వాతంత్ర్య సమరంలో పాల్గొని, అప్పుడు, స్వరాజ్య పరిపాలనలో ఉన్నత స్థానాన్ని ఆక్రమించుకోకుండా వారిని అడ్డుతారు కమ్యూనిస్టులు. ఎందుచేతనంటే నేటి వలస రాజ్యాలలోని ఆశేష రైతాంగాన్ని అంతటినీ ముందడుగు వేయించ గలిగినంత విప్లవ శక్తితో, వర్గ చైతన్యంతో, సక్రమ నిర్మాణంతో, నిండు విప్లవంతో నున్న కార్మిక వర్గం ఎక్కడ వున్నది!

పద్మముకూడా రైతులకు సహజ ప్రతినిధులుగా నుండజేరని ఆ యా దేశాల రైతాంగం మరుపురాని జవాబునిచ్చింది.

వారి విప్లవపాత్రకు వారే ప్రాతినిధ్యం వహించిన వ్యక్తులుగా, యజమానులుగా, దాని సౌభాగ్యాన్ని విశిష్టతని, నిర్మించుకొనే శిల్పకారులుగా నుండ నిశ్చయించారు

వలసరాజ్యాల విషయాలు చర్చిస్తూ, వలసరాజ్య ప్రజలను సామ్రాజ్యవాతత్వం యెలా కొల్లగొడుతున్నదో ఫాక్సు వ్యాఖ్యానించాడు: అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ కూడా యీ విషయాలలో వ్యాఖ్యానించింది ఆ యా వ్యాఖ్యానాలు గాంధీ వాదులు యీవిషయాలమీద యిచ్చిన వ్యాఖ్యానాలతో సరిపోతాయి, 'నిర్బంధ ఉత్పత్తి' విధానం, కీలకోద్యోగాలు, వాటి ప్రయోజనాలు, ప్రపంచ శ్రమాన్ని వ్యత్యాసంతో విభజించడం, అసమాన విభజన వీటిమీద మన గాంధీవాదులు యిచ్చే వ్యాఖ్యానానికి చాలా సమీపానికి వస్తారు వారు. వలసరాజ్యాల ప్రజానీకం ఉత్పత్తి చేస్తున్న "అధిక విలువ"ని వారి సామ్రాజ్యవాద ప్రభువులు, పెట్టుబడిదారీ ప్రభువులు, కబళింపేస్తున్నారని వారుకూడా గుర్తించారు.

వలసరాజ్యాల రైతాంగపు "అధికోత్పత్తి" (Surplus-product) ని సామ్రాజ్యవాదం మింగివేస్తున్నదని ఫాక్సు అంగీకరిస్తూ యిలా వ్రాశాడు.

"తన వలసరాజ్య ప్రజల ఆర్థిక జీవితంమీద ప్రభుత్వానికి సంపూర్ణ అధికారం వుంది...ముఖ్యనగరాలలో అమ్మవలసిన వస్తువులకు ప్రత్యేకంగా తక్కువ ధరలను నిర్ణయిస్తుంది; వలస రాజ్యాలలో అవస్తువనే ప్రత్యేకంగా అధిక ధరలకు అమ్మేటట్టు చేస్తుంది. ఈ విధంగా గుత్తవర్తకంలోని పెట్టుబడిదారులు వలసరాజ్య ప్రజను పీడించి "ఉన్నత లాభాలను" (Superprofits) గుంజ గలుగుతున్నది" (పుట 69 'కమ్యూనిజమ్')

భారత రైతులగూర్చి ఫాక్సు యిలా వుద్ఘాటించాడు.

"అతడు తన వుత్పత్తిని మార్కెట్టులో పెట్టి స్వేచ్ఛగా అమ్మడం చాలా అరుదు. ఏదో వొక మిల్లు యజమాని గాని, ఏదో బాంక్ ప్రతినిధి అయిన మధ్యవర్తి గాని, వచ్చి అతని పంటను తమాషా చేసి తోడివేస్తాడుకష్టు ఆఫ్రికా వలస ప్రదేశాల వంటి వాటిలో కొన్ని

టిలో, వలసలలోని రైతుల అందరి జీవితం ఏవో ఒక బ్రిటిషు కంపెనీల్లో గాని, దాస్యజీవితంలో నెడిత ఏదో తోటల విధానం చేతుల్లో గాని, ఉంటుంది.* (పుట ౮౮)

“వలస రాజ్యాల రైతాంగం, రంగురైతులు తాము సామ్రాజ్య వాద ధనికవాదుల కోరల పిడికిళ్ల నుంచి విముక్తులవాలన్నా, అన్ని విధాలా ప్రజాస్వామికమైన సామ్యవాద లక్ష్యాన్ని సంపాదించు కోవాలన్నా, ప్రపంచ ధనికవాదంతో పోటీపడిన మార్గాలలో, ప్రత్యక్షంగాను, పరోక్షంగాను, పోరాడాలి. ఈవిధంగా పోరాట టానికి ముందు, వారు ప్రపంచధనికవాదపు మరోరూపం అయిన ప్రపంచ సామ్రాజ్య వాదంతో పోరాడాలి—” అని మావోత్సుంగ్ సిద్ధాంతంలో ఒక భాగం కమ్యూనిస్టుల సిద్ధాంతం యీ విషయాన్ని సిద్ధి కరిస్తున్నది:

రైతులు వారి విప్లవ సమరాన్ని పోరాడుటకు కావలె మంచి ముగ క్షేత్రాన్నిస్తారని యీ రకమైన వర్గ లక్ష్యాలు స్పష్టం చేస్తు న్నాయి కాని, వలసరాజ్య రైతాంగానికి, రంగురైతులకూ, ప్రత్యేక విప్లవ పాత్రవున్నదంటే కమ్యూనిస్టులు అంగీకరించరు అంతటి పిరికి వాదం వారిది.

పైగా వలసరాజ్యాలలో యుద్ధకాల పారిశ్రామికాభివృద్ధి కారణంగా ఇప్పుడిప్పుడే రాజకీయాకాశవీథులలో ప్రవేశిస్తున్న వలసరాజ్య కార్మిక వర్గాన్ని చూసి యితర కమ్యూనిస్టులలాగే ఫాక్స్ కూడా యీ అతిస్వల్పవర్గం త్వరలో అభివృద్ధి చెందుతుందని ఆశలు పెట్టుకుంటున్నాడు. “వలస రాజ్యాలలోని కార్మికుడు పోరాటమైనా సాగించాలి; లేదా అంతమైనా పొందాలి. ఆదే అతని జీవిత పరిస్థితి” అని అందుచేతనే అంటాడు.

అయితే వలస రాజ్యాలలోని రైతులు పోరాటము సాగించ డానికి గాని, అంతమవడానికి గాని. నిర్ణయించుకోవలసిన అవసరం యింతకంటె అధికమని ఫాక్స్ మరిచిపోయాడు. చైనాలోను, భారత వర్షంలోను, రైతాంగం నిర్వహించిన జాతీయ విప్లవ పాత్రను, దాని ప్రాముఖ్యమును, గుర్తించలేకపోయాడు.

---

* కాంబెల్ వ్రాసిన “ఆఫ్రికలో సామ్రాజ్యం” (Empire in Africa ఈ విషయాలను చాలా చక్కగా చిత్రిస్తుంది.

అంతేకాదు; రైతులు, చేతిపనివారలు, ఇతరవృత్తుల పారిశ్రామికులు ప్రపంచ ధనికసామ్రాజ్యవాదంతో తాకుడువచ్చి కార్మిక వర్గానికి వేరైన, స్వతంత్రమైన పారిశ్రామిక వర్గాలుగా తయారవుతున్నాయని యీరెండు మహోన్నత తరగతులకు - ఏక కార్మిక తరగతులకు ప్రజావర్గానికి క్రిందికిపారి వచ్చిన ఆర్థికమాంద్యంగాని, నేటి ప్రపంచ సంగ్రామం వంటి మహోన్నత సంఘటనలుగాని, వర్గ చైతన్యాన్ని ప్రసాదించాయని రైతు నాయకుల వాదన.

ఆ వాదన నిజమే కాని దానిలోని సనాతనత్వం వల్లనే ఫాక్సు అనుసరించ లేదు.

అయితే, సరిక్రొత్త ధనికవాదం వల్లా, సామ్రాజ్యవాదం వల్లా, రైతు ప్రజావర్గాల మానసిక వ్యవస్థలోను, స్థితిలోను, ఉత్పత్తిసంబంధాల పరిస్థితులలోను, మారకంలోని పద్ధతులలోను, గుణాత్మకమైన మార్పు ఉన్నదనే రైతు దృక్పథాన్ని ఫాక్సు అంగీకరిస్తున్నాడు.

“ప్రపంచవ్యాప్తమైన రైతులనేమి, కార్మికులను, పాశ్చాత్యేతరులయిన చేతిపనుల పారిశ్రామికులనేమి, సామ్రాజ్యవాదం మేల్కొలిపింది. దాస్యవృత్తినుండి ఉద్యోగతత్వంలోకి అది వారిని తరుముకొని వెళ్లింది. నిశ్చేష్టితంగా ఉన్న వారిజీవితాన్ని ఒక ఉద్వృత్తిసమరంగా మార్చివేసింది. ఈ వర్గాల కూటమిని ఆధునిక రాజకీయరంగంలోని ఉత్పత్తి రాజకీయ శక్తులలో ఒకదానిగా మార్చివేసింది” (పుట 74) అని ఫాక్సు వ్రాశాడు.

కాని, తక్కిన సనాతన మార్క్సు వాదులలాగే ఫాక్సు; స్ట్రాచీ, బుఖారీ, రోజు రోజుకు మారిపోతున్న ప్రపంచ పరిస్థితులను బట్టిన్నీ, మొదలైన వారు తమ సనాతన సిద్ధాంతాలకు” సరిపోవునట్లు తిరిగి సవరించుకొనడం లేదు.

వారి విషయంలో సనాతనత్వం జీవితాన్ని అనుసరించి పూరే ఒకశాస్త్రంకాదు; అది వారి జీవితాలకు సందిద్దే స్వామి.

అందుచేతనే వారి నిర్ణయాలలోను పరిష్కారాలలోను వారింకా కర్షక వ్యతిరేకులుగా నున్నారు.

లెనిన్ గూర్చి వ్రాస్తూ, స్టాలిన్ యిలాగ వ్రాశాడు.

“విప్లవంలోని మనఅనుభవం అంతాకూడా ఒక్కసూత్రాన్నే సూచిస్తున్నది. అది కార్మికవర్గం సాగించే వర్గ సమరం మీదా, దీ-

రైతులూ వారి భూస్వాములకూ, బూర్జువా వర్గానికీ వ్యతిరేకంగా సాగించే సమరం మీదా మన విప్లవ విజయం ఆధారపడి వుంది అని లెనిన్ ఎన్నడూ ఉల్లంఘించని మహా పవిత్రమైన సూత్రం యిదే”

యుద్ధం తర్వాత కూడా అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ అవతారాన్ని చాలించుకొని వున్నా, భారత కమ్యూనిస్టులకూ, వారి ‘క్రాశీ’ “మాస్కోమాత”తో సంబంధ బాంధవ్యాలను నిలబెడుతూ వున్నది యీ మహాసూత్రమే.

కాగా ఎంతకాలం మార్క్సు, లెనిన్, ఏంజిల్సు చెప్పిన సూత్రాలనే వల్లెవేస్తూ మాస్కో పెండెబద్దలు కట్టుకొని ప్రాకుతూ వారి కర్షక వ్యతిరేకమైన భావాలకు కమ్యూనిస్టులు నీరెత్తుతుంటారో అంతకాలం వలసరాజ్య రైతాంగం, రంగురైతులు వారిని విశ్వసించ జాలరు.



# భారత కమ్యూనిస్టు హృదయం

## 7

“ఎంత తరచి చూసినా, ఎంత వెదకి చూసినా వలస రాజ్యాల సాంఘిక వ్యవస్థలో ఉత్పత్తి శక్తిగా — కాకపోయినా, చిన్న విప్లవ శక్తిగా లెక్కించడానికి తగినంత అధికంగా కార్మిక వర్గం కనబడదు కదా కమ్యూనిస్టులు జబ్బలు చరిచి, నిక్కి ప్రస్తావిస్తున్న ‘కార్మిక వర్గ నియంతృత్వం’ ఒక పెద్ద తమాషాయేనా? ఒక వేళ నిజమనే అంటే, వారి ‘కార్మిక వర్గ నియంతృత్వాన్ని స్థాపించడంలోని భావం గంభీరమైనదే అని అంటే మాత్రం మనం ఎట్లా నమ్మటం?” అని యింతవరకూ పరిస్థితులను పరిశీలించిన వారు ఆశ్చర్య పడతారేమో!

అలాంటి సందేహం, ఆశ్చర్యం, కమ్యూనిస్టు హృదయం ఎట్లా పని చేస్తుందో తెలియనివారి మనస్సులలోనే కలుగుతాయి.

అందుచేత, "కమ్యూనిస్టు వ్యాదయాల"తో సంబంధం లేని వారి కోసం ఆ "హృదయాలు" ఎలా పనిచేస్తాయో, ఏ విధంగా భావాలను పరిగ్రహిస్తాయో, ముగ్గురు "కమ్యూనిస్టు ఋషులు" (మార్క్సు, లెనిన్, ఏంజెల్సు) వేసిన ఇప్పుడు మార్గాలలోనే ఎప్పుడూ ఎలా సంచరిస్తుంటారో యిక్కడ ప్రదర్శిస్తాం.

కమ్యూనిస్టు ఉద్దేశంలో —

ఈ విశాల ప్రపంచం అంతా ఒక దేశం అయినట్లు సోవియట్ రష్యా కార్మికుల విభాగం; వలస రాజ్య ప్రపంచం అంతా గ్రామీణ విభాగం.

సోవియట్ రష్యాలో సక్రమమైన రాజ్యాధికారమున్న కార్మిక వర్గం వున్నది కాదూ. కమ్యూనిస్టుకు అసంగతి చాలు, వలస రాజ్య ప్రజలను కార్మిక ప్రపంచంలోని గ్రామీణ విభాగంగా చూడడానికి.

అప్పుడు ప్రపంచ కార్మిక వర్గం యొక్క స్థానిక జాతీయ విభాగం, సోవియట్ కార్మిక వర్గం చేరిట, ఆ "గ్రామీణ విభాగాన్ని" (అంటే వలస రాజ్య ప్రజను) పరిపాలించ వచ్చును.

రష్యాలో అధిక సంఖ్యాకులైన కర్షకులను చాలా జాగ్రత్తగా అధికారంలోకి రాకుండా చేసింది కార్మిక వర్గమూ, బోల్షివిక్ పార్టీ. కాని బోల్షివిక్ పార్టీ రాజ్యాధికారాన్ని పొందింది, నియంతృత్వాన్ని సాగిస్తున్నది. స్థానిక కార్మిక వర్గాలు అల్పసంఖ్యాకవర్గాలు అయినా, వలస రాజ్యాలలో కూడా అదే విధంగా ఎందుకు జరగ కూడదు? బోల్షివిక్ పార్టీ ఎందుకు అధికారంలోకి రాకూడదు?

కమ్యూనిస్టు దృష్టిలో —

అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ రద్దు అయిపోయినా, పేరు వరకు మాత్రమే రద్దు అయింది; అది యింకా సజీవంగానే వుంది. అదే భావాలలో, సోవియట్ నాయకత్వంలోను, పరిపాలనలోను, ప్రతిబింబిస్తున్న విధంగా దాని ఆదర్శ ప్రాతిపదికలూ, భావాలూ ఇంకా నిలిచే వున్నాయి

కమ్యూనిస్టు నమ్మకంలో —

తాను సజీవమైన కార్మికవర్గం కోసం మాత్రమే వాదిస్తున్నాడు. తన స్థానిక రైతాంగానికి చాలా వేగంగా యేవక్రమైనా లొంగితే దాని వాస్తవికతను సరిసమాన మను గడగితే, అది కార్మిక వర్గం మాత్రమే అందుచేతనే స్థానిక రైతాంగాన్ని పడగొట్టి సోవియట్ కార్మిక వర్గ పరిపాలనయొక్క నాయకత్వంక్రింద వారిని సోవియట్ లోనికి తీసుకువద్దామని ప్రయత్నించడంలో కమ్యూనిస్టు పుద్దేశం రైతాంగపు సౌభాగ్యాన్ని, వర్గ చైతన్యాన్ని, విప్లవశక్తిని నాశనం చెయ్యాలని కాదు; భావిలో సాగించబోయే ప్రపంచ కార్మిక వర్గ విప్లవంలో వీరిని - అంటే తన ప్రత్యేక గ్రామీణ ప్రజా నీకాన్ని - ఉపయోగించుకొనుటకు నిల్వ చేసివుంచుకున్నాడు.

* * * * *

ఇదంతా మనకు వికారంగా, విపరీతంగా కనబడవచ్చును. కాని సనాతన మార్క్సువాదికి యిదంతా వాస్తవికమైన విప్లవ ప్రణాళిక

మొదటిలో యిదంతా జాతీయతకు వ్యతిరేకమని కమ్యూనిస్టుకు కూడా తోచివుండవచ్చును; కాని కొన్నాళ్ల తర్వాత, యీ సనాతన వాదము, యిందులోని యీ సూత్రాలు సజీవంగానుండి, రుజువు అవసరంలేని సత్యాలుగా యేర్పడిపోతాయి. వీటిని మనఃపూర్వకంగా చిత్తశుద్ధితోనే నమ్ముతాడు

ఈ అర్థంలేని పిచ్చి నమ్మకాలకు, లెనిన్ ఉపదేశాలకు సంబంధంలేదంటారేమో ఎవరైనా! ఇదంతా అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీకి, దాని శాఖలకు లెనిన్ నేర్పిన పాఠాలలోని భాగమే; (ఫాక్స వ్రాసిన "కమ్యూనిజమ్" పుట 76-77)

ధనికవాదసోపానం గూర్చి లెనిన్ యిలా అన్నాడు;

"విజయాన్ని పొందిన విప్లవ కార్మిక వర్గం తనకు వీలైన అన్ని మార్గాలలోనూ, ఒక విధానానికి లోబడి వీరిలో ప్రచారం చేస్తే - అప్పుడుకూడా వెనుకబడ్డ ప్రజలకు ధనికవాదం నిశ్చయంగా, తప్పక సరిగా ఉంటుందని అనుకోనటం పొరపాటు.* అంటే కొన్ని పరిస్థి

* "మహాత్ముని అనుచరులుకూడా యీవిషయాన్నే చెప్తున్నారు. కమ్యూనిస్టులు వానితో అంగీకరించేచమో?" అని అంటే భారత

తులలో ఉండదన్నమాట. అన్ని వలసరాజ్యాలలోనూ, దేశాలలోనూ స్వతంత్రయోధుల అంతస్తులను, పాక్షికసంస్థలను నిర్మించుటంతోను, కర్షకుల సోవియట్లను నిర్మాణం చేసి ధనికవాదానికి పూర్వమున్న పరిస్థితులకు తగినట్టు వారిని తయారుచేయడానికి సముచితమైన ప్రచారం చేయడంతోను, అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ ఆగిపోతేచాలదు. అభివృద్ధిచెందుతున్న దేశాలలోని కార్మికవర్గ సహాయంతో వెనకబడ్డ దేశాలు సోవియట్ విధానానికి చేరుకోవచ్చుననే నమ్మకాన్ని ధనికవాద సోపానాన్ని కుదించేసి, అభివృద్ధిలో యితర ప్రత్యేక సోపానాలద్వారా కమ్యూనిజమును చేరవచ్చుననే భావాన్ని, యీనమ్మకం భావం వారి హృదయాలలో హత్తుకొనే దృక్పథాన్ని వలసరాజ్య ప్రజలలో అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ స్థాపించాలి"**

వలసరాజ్యాల కమ్యూనిస్టు ఆ యా ప్రాంతాలలో తన పార్టీ బలంలోకి రావాలని కాంక్షిస్తాడు. అందుకు తగిన కార్మికవర్గంలేదు కాబట్టి, ఉన్నా కార్మికవర్గానికి రైతాంగానికున్న విప్లవశక్తిలేదు. కాబట్టి, వలసరాజ్యాల రైతాంగం సహాయంతోనే కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీ బలంలోకి రావాలంటాడు.

పోరాడటం, బలిపరచటం రైతులవంతు. అధికారం, బలం కమ్యూనిస్టుపార్టీవంతు. పేరుమాత్రం ప్రపంచకార్మికవర్గానిది !!

కమ్యూనిస్టుపార్టీ, కార్మికవర్గం అధికారంలోకిరాగానే రష్యాలోలాగే వలసరాజ్యాలలోకూడా, మొదట రైతాంగాన్ని మోసగించుతారు. తర్వాత వారి ఆశయాలను నాశనంచేస్తారు. ఆఖరుకి వారిని నాశనంచేస్తారు!

అప్పుడీ ఘనకార్యం అక్టోబరు విప్లవమంత గొప్పదని వాదిస్తారు!

---

కమ్యూనిస్టులోని యీ వెర్రి దృక్పథానికి సరియైన జవాబు యింకొంచెం సేపటిలోనే మనకు వస్తుంది

** భారతవర్షంలాంటి దేశాలలో ప్రపంచ కార్మికవర్గం పేరిట రైతు సోవియట్లను స్థాపించి, వాటి ద్వారా అధికారాన్ని సంపాదించుటకు కమ్యూనిస్టుసోదరులు రష్యానుండి సైనిక, ఆర్థిక సహాయాలను ఆశించుటకు కారణం యీలాంటి ఉద్ఘాటనలే.

ఏమీ, కాలినిన్ యీ విధమైన విజయాన్ని గూర్చి అలాగ చెప్పుకొనలేదూ డాబుగా!

అంటే, కమ్యూనిస్టుపార్టీ గాని అధికారాన్ని సంపాదించి, కార్మికవర్గ నియంతృత్వాన్ని సిద్ధాంతప్రాయంగా సాధిస్తే సోవియట్ రష్యాలో చేసినట్టే యిక్కడ వలసరాజ్యాలలో కూడా కర్షకులకు "కార్మికత్వం" అపాదించిగాని, లేదా, యింకోవిధంగా గాని గోతులో తోసేస్తుంది అన్నమాట!

* * *

ఇక భారతదేశంలో కమ్యూనిస్టు:

రైతుల ఆర్థిక బలాన్నీ, సంస్థలనూ, వర్గచైతన్యాన్నీ, సక్రమ మార్గాలలో కాంగ్రెస్ నిర్మాణకార్యక్రమం బలపరుస్తుందని కమ్యూనిస్టుల భయం. అందుచేతనే, రష్యాలో సోషలిస్టు రివల్యూషనరీల కార్యక్రమాన్ని లెనిన్ ప్రభృతులు తేలిక చేసినట్లే, భారత కమ్యూనిస్టు కాంగ్రెస్ కార్యక్రమాన్ని 'తేలిక చేస్తాము' వెక్కిరిస్తాడు; విమర్శిస్తాడు; తిడతాడు.

క్రమబద్ధమైన రైతాంగం తన రాజకీయ స్వరూపాన్ని, వర్గచైతన్యాన్ని, విప్లవశక్తిని అభివృద్ధిచేసుకుంటే, స్థితిలో లేని, లేక పేరుకుమాత్రం స్థితిలో వున్న స్థానిక కూలీవర్గం పేరిట లేనపార్టీ (కమ్యూనిస్టుపార్టీ) అధికార సంపాదనకు రైతాంగం అడ్డుతగులుతుందేమో నని కమ్యూనిస్టుల భయం.

అందుచేతనే, కూలీలకు వేరైన యీ వర్గాలన్నీ దినదినాభివృద్ధి నందకుండా వుండాలనే, మొట్టమొదట ప్రతి రైతు సంస్థలోకీ, ప్రతి పనివారల సంస్థలోకీ, కమ్యూనిస్టు జొరబడతాడు; తర్వాత, వాటి క్రమశిక్షణలో భంగాన్ని, నాయకత్వంలో విచ్ఛిత్తిని, సభ్యులలో కలతని కలుగజేస్తాడు కూలీలుకాని యీ పారిశ్రామికులు సమైక్యతలో ఆలోచించుకొని, కార్యనిర్వహణకు దిగకుండా చేయటంకోసం అఖరుకి తాను పోటీగా సంస్థలను నిర్మించి, వాటిని సాగిస్తాడు!

చేతిపని వారల వర్గాన్ని నాశనం చెయ్యాలని కమ్యూనిస్టు ప్రణాళిక నిర్ణయించింది. కాని, మహాత్ముడు ఉపక్రమించిన గృహ పరిశ్రమలు ఆ వర్గాలనే బలపరుస్తున్నాయి అంతేకాదు, యిది

గాంధీజీ ప్రబోధించిన సామ్యవాద జాతీయవాద మార్గాలలో జాతీయ విప్లవాన్ని అభివృద్ధి చేస్తూ, అందుచేతనే ధనిక వాదానికి పూర్వమున్నస్థితినుండి ఆర్థిక భవిష్యన్నిర్మాణం ప్రారంభించవలసిన అగత్యాన్ని తెలిసికొంటుండగా భారత కమ్యూనిస్టుమాత్రం తన పార్టీకి బలం రావాలంటే గృహపరిశ్రమల కార్యక్రమాన్ని ప్రతిఘటించాలి. అందుచేతనే ఆ కార్యక్రమాన్ని ప్రతిఘటిస్తున్నాము కూడా!

సరే, తాను అధికారాన్ని సంపాదించాక "ధనిక వాదానికి పూర్వమున్న పరిస్థితులనుండి భవిష్యన్నిర్మాణం" అనే ఆర్థిక ప్రణాళికనే కమ్యూనిస్టు అంగీకరించి, ఉపయోగించుకుంటాడంటే అది వేరే సంగతి కాని!

"స్టాలిన్" సోవియట్ రిపబ్లిక్కులకై ముసాయిదా వ్రాసిన కర్షక ప్రణాళిక విషయంలో లెనిన్ అలా చేశాడు కాదూ? *

"కమ్యూనిస్టు పార్టీ అన్ని పారిశ్రామిక వర్గాలలోని ప్రజా సంస్థలనుండి అత్యుత్తమ అంశములను తనలోనికి ఆకర్షించుకోడంలోనే దాని బలం వున్నది. దేనినీ మినహాయించకుండా అన్ని కార్మిక వర్గాల కార్యకలాపాలకు సమైక్యత నందించడం దాని ప్రకృతి. సమైక్యత నందించి ఒక లక్ష్యానికి కార్మిక వర్గ విముక్తికి దారిచూపి, వాటిని వుపయోగిస్తుంది. ఇక అనాథలైన బీదరైతుల సంగతి కార్మిక వర్గ ప్రథమ శ్రేణికీ, కర్షక ప్రజానీకానికీ, సంబంధం కలపడానికీ, రాజకీయ సంబంధంలేని సహకార సంస్థలను వుంచారు; వీటి ద్వారా కర్షకులను సామ్యవాద నిర్మాణ కార్యక్రమంలో భాగం తీసుకొనడానికి అంగీకరింప జెయ్యవచ్చు."

సంఖ్యలలో, సంస్థలలో విప్లవ శక్తి సామర్థ్యాలలో, కూలీ వర్గం అభివృద్ధి నందేలోపుగా రైతులూ చేతిపనివారలూ యీ విషయాలలో అభివృద్ధి నంది విజయాన్ని సంపాదించి వేయకుండా సర్వ విధాలా ఆపటం తన విద్యుక్త ధర్మమని కమ్యూనిస్టు భావిస్తాడు.

తనకూ, తన వర్గానికీ, యితర పారిశ్రామిక వర్గాలకూ శుభాన్ని ఆశించే రైతు, యీ విధానాన్ని స్వచ్ఛందంగా అంగీకరిస్తాడా?

---

* స్టాలిన్ "లెనినిజమ్" అన్న పుస్తకంలో ఇలాగ వ్రాశాడు. (పు 29-31)

కమ్యూనిస్టు మాయోపాయాలకు లొంగిపోయి ఆత్మవంచన కంగీకరించారు కొందరు రైతులు. చేతిపని వారిలోను ప్రపంచ ధనికవాదం పంజాలనుండి విముక్తులగుటకు న్యాయ సమ్మతమైన మార్గాలపై విప్లవం సాగిస్తున్న, సాగించ ప్రయత్నిస్తున్న తమ వర్గాలను, వాటి ప్రయత్నాలను వీరు బలహీనం చేస్తున్నారు.

అంతేకాదు వారి వర్గాల స్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు మారుగా ఒక యజమాని చేతులనుండి ఇంకొక యజమాని చేతుల లోనికి మార్చుటకు రావణ పరిపాలన నుండి మైరావణ పరిపాలన లోనికి మార్చుటకు, వారు కొంత వరకూ సహాయం చేస్తున్నారు.

* * *

అయితే, మేముగాని, రైతు వర్గం గాని, కూలీ వర్గం పురోగమనాన్ని, శ్రేయస్సును, పూచికపుల్లంత వాసిగానైనా, కలలోనైనా, ప్రతిఘటిస్తున్నామని ఎవరూ ఊహించ కూడదని మా సూచన.

కూలీ వర్గం సంపూర్ణమైన, సుభిక్షమైన సౌభాగ్యాన్ని; సంపూర్ణమైన శిష్ట స్వరూపాన్ని అవశ్యం పొందాలి! కలకాలం వర్ధిల్లాలి.

ప్రజావర్గం, రైతు వర్గం, క్షేమాశయాలకు భంగకరంకాని మార్గాలలో, సరి సమాన అవకాశాలతో, భావి ప్రజాస్వామిక సంఘంలో తనకు సముచితమైన స్థానాన్ని ఆ వర్గం ఆక్రమించాలనే మా వుద్దేశం.

భారత రైతాంగం ఆశయం కూడా యిదే!

మేము మరొకసారి మా ప్రముఖ ఆదర్శ ప్రాతిపదికను జ్ఞప్తి చేస్తున్నాం; పారిశ్రామికులకు చెందిన యే ఒక్క పక్షానికి గాని, వర్గానికిగాని, చెందిన నియంతృత్వాన్నీ మేము అంగీకరించం. ఈ విస్తృత పారిశ్రామిక వర్గాలు మూడింటికీ అంటే, రైతు కూలీ ప్రజావర్గాలు మూడింటికీ చెందిన నియంతృత్వం వుండాలని మా ఆకాంక్ష! అలాగ చెందుతుందనే మా దృఢవిశ్వాసం!

ఈ నాటి భారత రైతాంగపు (రైతుకాంగ్రెస్) ఆశా విశ్వాసాలుకూడా యివే!

"సాంఘిక పరిశీలనను సాధనంగా, తన చుట్టుపక్కల ఉపాధుల ననుసరించి మార్క్స్ యిచ్చిన ప్రత్యేక నిర్ణయాలను, ఊహలను సూచనలను, అంగీకరించే వ్యక్తిమాత్రమే మార్క్సువాది" అని లెనిన్ సూత్రప్రాయమంతా ఉద్ఘాటించాడు; అవిధంగా ఆ పదప్రయోగాన్ని సంకుచిత పరిచాడు.

కాని "తార్కిక భౌతిక వాదం" లోని సారాంశమును ఎమిల్ బర్న్సు (Emil Burns) యీ విధంగా చెప్పాడు.

"సత్యముగూర్చి మనకున్న చైతన్యానికి సత్యస్వరూపం వేరుగా వుంటుందనే వాదన యిది. ఈసత్యస్వరూపం వేరువేరుగా ముక్కలలో వుండకుండా ఒకటిగా వుంటుంది అది ఒకచోట ఉండిపోకుండా కదులుతూవుంటుంది క్షణక్షణం పెరుగుతూ నాశనం అయిపోతూవుంటుంది. ఈ అభివృద్ధి కొంతవరకూ క్రమక్రమంగా వుండి, అక్కడ సునిశిత విచ్ఛిత్తి వుంటుంది. అభివృద్ధికి కారణం లోలోపల వుండే పోరాటం (అంతర్విశ్లేషణ) పెరుగుతూన్న వస్తువ నాశనమౌతున్న వస్తువమీద పొందిన గెలుపే సునిశితవిచ్ఛిత్తి."

ఈ దృక్పథంలో మేము రైతుకూలీ ప్రజావర్గాల నేటి సమస్యలను పరిశీలిస్తాము.

"నిజంగా ఒప్పునకు గీటురాయి అనుభవమేను" అన్న మార్క్స్ ఉద్ఘాటనను కమ్యూనిస్టులు అంగీకరించరు.

కాని, తార్కిక భౌతికవాదం మాత్రం తాను కనుగొన్న విషయాలను, నిర్ణయాలను పరీక్షిస్తుంది. వాస్తవికతకను దూరమైన నిర్ణయాలను, వాదనలను తోసిపుచ్చుతుంది లేకపోతే, సవరించుకుంటుంది.

# నరకానికీ, స్వర్గానికీ మార్గాలు:

## 8

"కార్మికవర్గ నియంతృత్వానికి చాల శుభకరం, మహోన్నతం, అయిన భవిష్యత్తువున్నది" అని మార్క్స్ ప్రకటించాడు.

కాని, మార్క్స్ దానినిగురించి ప్రకటించిన ఆశలు, దానిని గూర్చి చేసిన నిర్ణయాలు, సరియైనవని తర్వాత చరిత్ర రుజువు చెయ్యలేదు.

1917 అక్టోబరు వరకూ అధికారాన్ని సముపార్జించడంకోసం లెనిన్ కర్షకుల సంపూర్ణ సహాయాన్ని పొందాడు; కర్షకుల నాయకత్వం వహించిన సోషలిస్టు రివల్యూషనరీలు అతణ్ణి బలపరచారు; కర్షక కమిటీలు హృదయపూర్వకమైన సహాయాన్ని యిచ్చాయి

అందుచేత లెనిన్ అధికారంలోకివచ్చాక, కర్షకులను ఒక్కసారిగా త్రోసిరాజనలేకపోయాడు ఆనాడు "కార్మిక కర్షక వర్గాల నియంతృత్వాన్ని స్థాపించా" మనడంలోని కారణం యిదేను!

కాని, కొన్ని నెలల తర్వాత అంటే, సోషలిస్టు రివల్యూషనరీల రాజకీయ నాయకత్వాన్ని నాశనంచేశాక కార్మిక కర్షక వర్గాల నియంతృత్వాన్ని రాజకీయంగా "బోల్తా" కొట్టించి, కార్మికవర్గ నియంతృత్వంగా మార్చివేయగలిగాము. అంటే, రష్యాలో కర్షక వర్గాన్ని మాయచేసి, వారియెడల ద్రోహము నాచరించి కార్మికవర్గ నియంతృత్వం స్థాపించబడిందికాని, సునిశితమైన కార్మికవర్గ విప్లవం ద్వారా కాదు.

అత్యధిక సంఖ్యాకుల ప్రయోజనాలకోసం వర్గచైతన్యమున్న అత్యధిక సంఖ్యాకుల వుద్యమంగా కార్మిక వర్గోద్యమం నిర్మాణమవుతుందని మార్క్స్ ఆశ. నేటివరకూ, పాపం ఆ ఆశ సఫలమవలేదు. అందుచేత, యీనాటి పరిస్థితులలో కార్మికవర్గ నియంతృత్వమంటే అతిస్వల్ప సంఖ్యాకుల నియంతృత్వమన్నమాట! ఈమాట వలసరాజ్యాల విషయంలో యితోధికంగా సత్యం.

కాబట్టి, యీనాడు మారిపోతున్న పరిస్థితులకు సరిపోయినట్టుగా మార్క్సిజ భావాన్ని మార్చుకొని విస్తృతం చెయ్యటం నిజమైన మార్క్సిజం, శాస్త్రీయం కాదూ? పలు రాజ్యాల ప్రజానీకపు జీవితాలను గూర్చి, వారి కృషిని గూర్చి, వారి ఆర్థిక రాజకీయావసరాలను గూర్చి మార్క్సు నాటికంటె యీనాటి మన విజ్ఞానం అధికం. ఆ విజ్ఞాన దృష్ట్యా మనం మార్క్సిజ భావాలను మార్చుకోనవసరం లేదూ? పురోగమన శక్తుల కోసం, నిర్మాణాత్మక శక్తుల కోసం, న్యాయసమ్మతమైన మార్గం సంబంధాలలో యీనాటి రైతు, ప్రజావర్గాలు ప్రయత్నిస్తున్నాయి. కొటీ సంఘంలో కార్మిక వర్గం యెంత విప్లవాత్మకంగా వున్నదో, యీతర ప్రజా వర్గాలూ అంత విప్లవాత్మకంగానే వున్నాయి. అందుచేత రైతు కూలీ ప్రజా రాజ్య స్థాపనకే అధికమైన అవకాశాలు వుండగలవు, వున్నాయి కూడా. ముఖ్యంగా వలస రాజ్యాలు స్వాతంత్ర్యం సంపాదించాక యిలా వుండక తప్పదు

ఈనాటి యీ వాస్తవిక విషయాలన్నిటినీ అనుసరించిన మన సిద్ధాంతాలను, తత్వాలను సమన్వయించడం మార్క్సిజ వాదమా, లేక మన సిద్ధాంతాలను, తత్వాలను అనుసరించి వాస్తవిక విషయాలను సమన్వయించడం మార్క్సిజ వాదమా ?

ఈ మూడు వర్గాలలో యే వొక్క వర్గపు నియంతృత్వమైనా "అత్యధిక సంఖ్యాకుల" నియంతృత్వం కానేరదు ముఖ్యంగా కూలీ వర్గపు నియంతృత్వం యిలా కానేరదు

అందుచేతనే "రైతు కూలీ ప్రజారాజ్యం" వాస్తవిక జీవితానికి సరిపోయే నినాదం. *

మార్క్సు కూడా కార్మిక వర్గం వొక్కటే ధనిక వాదాన్ని ఓడించలేదని గ్రహించాడు అందుచేతనే 1871 లో పారిస్ కమ్యూన్ కోసం గ్రహించి కర్షక వర్గాన్ని, పారిస్ మధ్య తరగతులను సహకరించమని అర్థించాడు. కాని, పాపం, లాభం లేకపోయింది.

మార్క్సిజ వాదానికి భాష్యాలు నిర్మించిన వాడు లెనిన్. అందుచేతనే అతడు బోల్షివిక్ సనాతన సిద్ధాంతాలకు ఆచార్యుడు అయినా, భాష్యం వ్రాయడంలో ఆగలేదు మార్క్సు గావించిన నిర్ణయాలను తన సాంఘిక పరిశీలనతో, తన తార్కిక వాద సహా

* ఇది రైతు కాంగ్రెస్ నినాదం.

యంతో విస్తృతం చేసి, సవరించి, అనుసరించు పద్ధతిని కల్పించాడు. అనేకమైన యితర వృద్ధికాలతో పాటు, కార్మిక వర్గానికి మిత్ర వర్గాలను సంపాదించాలనే సిద్ధాంతాన్ని నిర్మించాడు.

అంటే, కర్షక ప్రజా వర్గాలనుండి కొన్ని మిత్ర వర్గాలను కార్మికులు సంపాదించుకోవాలి అన్నమాట.

అయితే, కార్మిక వర్గమే ప్రథమ శ్రేణిగాను, అట్టి యజమాని గాను ఉండాలి!

బీద కర్షకులను తమ పక్షానికి తీసుకోవడం, మధ్య కర్షకుల ఆశయాలను భగ్నం చెయ్యడం, ధనవంతులైన కర్షకులను నాశనం చెయ్యడం యిలాగే బూర్జువా, ప్రజాస్వామిక, సామ్యవాద విప్లవముల తీర్పాయి దశలలో యీ మూడు కర్షక వర్గ విభాగాలలో, వాటిలో వాటిని చూస్తూ, కర్షక వర్గ విభజనోపాయాన్ని లెనిన్ అనుసరించాడు.

మిత్ర వర్గాల విషయంలో —

ఈనాటి పరిస్థితుల పరిశీలనా, వర్గశక్తుల పరిశీలనా, అగత్యమనీ, తప్పనిసరి అయిన దృక్పథం అనీ మార్క్సిస్టు సిద్ధాంతం చెప్తున్నది. ఈ సూత్రం విషయంలో ఎమిల్ బర్న్సు, బుఖారిన్, యిద్దరూ ఒకే విధంగా అభిప్రాయ పడ్డారు. లెనిన్ యీ సూత్రాన్ని అనుసరించే కర్షక వర్గ విభాగాలను కార్మిక వర్గానికి మిత్రులుగా ఎలా సంపాదించవచ్చునన్నే విషయాన్ని ఒక సాంకేతిక కార్యక్రమంగా తయారు చేశాడు. సమిష్టి వ్యవసాయాన్ని అంగీకరించి, ఆ విధంగా కార్మిక వర్గపు తెంపరితనపు ప్రాబల్యాన్ని అంగీకరించిన బీద కర్షకుల సహాయంతో, కర్షక ప్రజలలో మిగిలిన తక్కిన భాగాన్ని అలా అంగీకరించమని బలవంత పెట్టడంలో విభాగించి నాశనం చెయ్యటం అనే లెనిన్ సిద్ధాంతాన్ని బయటపడంగా అనుసరించడంలో, స్టాలిన్ యీ సూత్రాన్నే అనుసరించాడు.

1917 నుండి 1937 వరకు ప్రజాకర్షక వర్గాలవున్నట్లు యీనాడు లేవు. రష్యాలో కార్మికవర్గ నియంతృత్వం అప్పటి కర్షకవర్గాలపైనా, బూర్జువా నియంతృత్వం ప్రపంచ కర్షకవర్గంపైనా, జరిపిన అత్యాచారాలు ఫలితంగా, ఆయా నియంతృత్వాలు వారిని

పెట్టిన శాఖల ఫలితంగా, నేటి రైతు, ప్రజావర్గాలు ఇతోధికంగా జాగ్రత్త వహిస్తున్నాయి

అందుచేత రేపు నియంతృత్వంగానూ తమను కొల్లగొట్టుటకు వారు అంగీకరించరు; తమ్ము తామే "విప్లవ ప్రధాన శ్రేణిని" అని పొగడుకొనే యే యితర వర్గంలోనో ఛోటా భాగస్వాములుగా నుండటానికీ అంగీకరించరు.

అందరు శాశ్వతంగా పనికొస్తాయని యెంచుతున్న సిద్ధాంతాలను మార్క్సిజం యెత్తిచూపి, నిజంగా ప్రత్యేక కాలస్థలాలలో యేదొక్క వర్గంతాలూకు ప్రయోజనాలను మాత్రమే అవి ప్రతిబింబిస్తాయని రుజువుచేసింది; మానవసంఘాన్ని ఆ సిద్ధాంతాల కోతి పిడికిలి నుండి విముక్తం చేసింది.

మార్క్సిజం మానవజాతికి చేసిన సేవ యిది - యీవిధంగా అది ప్రయోగకరమని ప్రజా, రైతు వర్గాలు గ్రహించాయి.

ఆదిపురుషులు మార్క్సు, లెనిన్‌లు మొదలు నేటి స్టాలిన్, బుఖారిన్, ఫాక్సు, బర్న్సు, జాక్ స్ట్రాచీ వరకూ - పాశ్చాత్య కమ్యూనిస్టులందరూ, స్థానికంగా శక్తివంతం, విప్లవకరం అయిన కార్మిక వర్గాన్ని వెనుక వేసుకొని వచ్చారని, అందుచేతనే మార్క్సు నాదమైన కార్మికవర్గ నియంతృత్వాన్ని, రష్యాలో లెనిన్ స్టాలిన్‌లు సమర్థించి అనుసరిస్తున్న విధానాన్ని, అంగీకరించడానికి వారికి వీలు అయిందని, రాను రాను యీ కార్మికవర్గ నియంతృత్వ సిద్ధాంతం కమ్యూనిస్టులకు అతి పవిత్రమైన వేదవాక్యంగా మారిపోయిందని, ప్రపంచ కర్షకవర్గం, ప్రజావర్గం గ్రహించాయి.

అయితే ఆనాటి పాశ్చాత్య ప్రపంచంలోని పరిస్థితులకు యిప్పటికి - వలసరాజ్యాలలోని - పరిస్థితులు వేరుగా నున్నాయని, తామే అత్యధిక సంఖ్యాకులుగా నున్న విప్లవవర్గమని, వలస రాజ్యాల కార్మిక వర్గం అతి స్వల్పమని, ప్రపంచకర్షకవర్గం గుర్తించింది *

"నేడు నిశ్చేష్టితంగా శక్తిలేకుండా వున్నా, స్థానిక కూలీవర్గం ముందుముందుకు అభివృద్ధి పొందుతుంది, చాలాగొప్ప విప్లవ వర్గంగా తయారౌతుంది; ఆనాడు అది ప్రజా, రైతువర్గాల ముక్కుకు తాడు

* రాల్ఫ్ ఫాక్సు కూడా యీసంగతిని గుర్తించాడు.

కట్టి నడిపించగలదు - నడిపిస్తుందికూడా" అని సనాతన కమ్యూనిస్టుల విశ్వాసం, ఆశానూ. కాని ప్రపంచ కర్షక వర్గం యీ విశ్వాసం తప్పని ఆశ నిరాశ అవుతుందనీ అంటున్నది, ఋజువు చేస్తున్నది.

"ఈ విషయం, యీ దేశంలో, యీ పరిస్థితులలో, కార్మిక వర్గమునకు ఉపయోగిస్తుందా, లేదా" అనే దృష్టితోనే కమ్యూనిస్టులు ప్రతివిషయాన్ని పరిశీలిస్తారు గాని, ప్రపంచ కర్షక వర్గం మాత్రం అలా పరిశీలించదు. ఈ నాటి తన అవసరాల దృష్ట్యా తన పరిస్థితుల దృష్ట్యా, నేటివర్గాలకు వాటి వర్గ చైతన్యానికి, జాతీయ చైతన్యానికి ఉండే సంబంధాల దృష్ట్యా, కమ్యూనిస్టు పార్టీ నిర్ణయించిన ప్రతి సిద్ధాంతాన్ని, చేసిన ప్రతి నిర్ణయాన్ని, ప్రతి ఉపాయాన్ని యితర విషయాలను ప్రపంచ కర్షకవర్గం పరిశోధిస్తుంది.

"ఈనాడు రైతాంగం అనుసరిస్తున్న విధానమే నిజానికి మార్క్సిస్టు తత్వం. మార్క్సిస్టు కూర్చి వ్రాస్తూ, మహావిప్లవ వత్సరము లైన 1845-51 లోని అనుభవాలలో తన సిద్ధాంతానికి ప్రాతిపదికగా తీసుకున్నాడు అతను" అని లెనిన్ వ్రాశాడు. మార్క్సు బోధనలను ప్రపంచానుభవాల సంశ్లేషం అని ఉద్ఘాటించాడు; చారిత్రకానుభవములను తూచా తప్పకుండా మార్క్సు అనుసరించిన విధానాన్ని చాలా హర్షించారు

అందుచేతనే, మార్క్సు లెనిన్‌లు వారి పరిశోధనా మార్గాలనుతరికి, సనాతన అనుసరించాలని భక్తివిశ్వాసాలతో అవలంబిస్తారనీ ఆకాంక్షిస్తారనే విశ్వాసంతో మార్క్సిస్టుతత్వం చుట్టూ కట్టబడ్డ సనాతనత్వంనుండి భారత రైతాంగం వైదొలిగింది.

రష్యాలో కార్మికవర్గ నియంతృత్వం కర్షక ప్రజావర్గాల కెంత హానికరంగా ప్రవర్తించిందో మనం చూశాం. ఈ రెండూ వర్గాలూ కూడా యీ నియంతృత్వాన్ని అంగీకరించాయా, లేదా అనికాదు ప్రస్తుత ప్రశ్న.

"ఏవిధంగా, ఎంతమంది రైతులను ప్రజను బలిచేసి, ఆ నియంతృత్వం యీ ఫలితాలను పొందగలిగింది? ప్రపంచంలో దానిపై నున్న సదభిప్రాయానికి ఎంతగా దెబ్బ తగిలింది?" అని మా ప్రశ్న.

"మొట్టమొదట వ్యక్తిగత యాజమాన్యాన్ని సమిష్టిస్వామికంగాను, వ్యక్తిగత ఉత్పత్తిని సమిష్టి వుత్పత్తిగాను, చేయడమే మనకు విధి. అయితే అలా చెయ్యడం ఉదాహరణ పూర్వకంగాను సాంఘిక సహాయాన్నిచ్చి మాత్రమే గాని, నిర్బంధమును ఉపయోగించికాదు" అని ఏంగెల్సు చెప్పిన సలహానే స్టాలిన్ అనుసరిస్తానని ప్రమాణం చేశాడు.

కాని, అతనూ, అతని అనుచరులూ యీ సలహాను ఎంత అవమానకరంగా ఎంత విస్తృతంగా భంగపరిచారో, ప్రపంచ విప్లవ విషయంలో ఎంతగా చెప్పలేని హాని కలుగ జేశారో, లోకాలు మారుమ్రోగి పోయినవి; ప్రపంచంలో యింటింటా సామెత అయి పోయింది.

*　　　*　　　*

మన దేశంలో—

కమ్యూనిస్టుపార్టీ వారు బోధిస్తున్న కూలీవర్గ నియంతృత్వ నినాదానికి బదులు గాంధీజీ బోధిస్తున్న ప్రజాస్వామిక రైతుకూలీ ప్రజారాజ్య నినాదాన్ని, యీ పూర్వకధను అంతటినీ మనస్సులో వుంచుకొని సామ్యవాదులు పరీక్షించాలి.

ఈ విధమైన దృక్పధంతోనే రైతు కాంగ్రెస్ సేవ పని చేస్తున్నది. కమ్యూనిస్టుల కర్షకవర్గ విభజనోపాయాన్ని ఎదిరించి పోరాడాలనే రైతుకాంగ్రెస్ నిశ్చయం. లెనిన్ అడుగు జాడలలో నడిచి ప్రస్తుత ప్రపంచంలోని ఆచారక్రమమే తన సిద్ధాంత స్వరూపాన్ని నిర్ణయిస్తుందని ఉద్ఘాటిస్తున్నది; "వ్యవహారం ముందు, సిద్ధాంతం తర్వాత" అనే తార్కిక వాదంలోని ముఖ్యసూత్రమును అనుసరించి తన దృక్పధాన్ని తీర్చి దిద్దుకుంటానని దాని ఆకాంక్ష.

నేటి రైతువర్గం, చేతి పనివారల వర్గం, ప్రజావర్గం నిజంగా విప్లవాత్మకంగా వున్నాయని, ఉండగలవని, అవి తమ తాహత్తు ననుసరించి సముచితమైన రాజకీయ శక్తిని ఆకాంక్షిస్తున్నవని, ఒక్క కార్మికవర్గ నియంతృత్వాన్ని అవి యెన్నటికీ అంగీకరించవని, సుస్పష్టమే! అందుచేతనే వారి నినాదం కూడా "రైతుకూలీ ప్రజారాజ్యం" అని.

అంటే

ఈనాడు భారత రైతాంగానికి ఒకప్రక్క రైతుకూలీ ప్రజారాజ్యానికై నిలచిన కాంగ్రెస్ రైతులు వర్గీయంగా అనంతకాలానికి అతీతులని, పురోగాములని, వారికి విప్లవశక్తి సామ్యవాదం ఉన్నాయని అంగీకరిస్తున్న రైతు కాంగ్రెస్.

ఇంకొకప్రక్క కూలీ నియంతృత్వానికై నిలచిన కమ్యూనిస్టు పార్టీ, రైతులకు కూలీత్వం ఆపాదించి, "వారేనాడో అభివృద్ధి నిరోధక చర్యలు గావించి, విప్లవ ప్రతికూలురౌతారనే భయంతో వారి యెడల తగు జాగ్రత్త వహించాలనే కమ్యూనిస్టు దృక్పథాన్నీ, వాదాన్నీ, అంగీకరించిన "కిసాన్ సభలు"

భారత రైతాంగం యే మార్గాన్ని అనుసరిస్తుంది?

రైతులు రైతు కాంగ్రెస్‌ను అనుసరించి, జాతీయకాంగ్రెస్ రాజకీయ నాయకత్వాన్ని అంగీకరిస్తే వారు జాతీయస్వాతంత్ర్యాన్ని ప్రజాస్వామిక రైతు కూలీ ప్రజారాజ్యాన్ని సముపార్జించగలరు

కిసాన్‌సభను అనుసరించి, కమ్యూనిస్టుపార్టీ రాజకీయ నాయకత్వాన్ని అంగీకరిస్తే, వారు సముపార్జించగలిగేది.

మొదటిలో కూలీవర్గ నియంతృత్వం—

ఆఖరుకు, రైతువర్గ విలయం, వినాశనం !!!

వారికి యెదురుగానున్న సంస్థలను, ఆశయాలను మేము ఉద్ఘాటించాం; యే సంస్థను అనుసరిస్తే, యే ఫలితాలు వస్తాయో మేము సూచించాము.

ఇక, నిర్ణయించుకొని, వరించి అనుసరించవలసిన రైతులు!

కాగా, భారత రైతాంగం రైతుకాంగ్రెస్‌ను అనుసరించి జాతీయ కాంగ్రెస్ రాజకీయ నాయకత్వాన్ని అంగీకరిస్తుందని మా దృఢ విశ్వాసం!

———

# భారత రైతు రంగంలో

# కమ్యూనిష్టు పార్టీ - నేర్పిన పాఠాలు.

## 9

1945 వరకూ కమ్యూనిస్టులతో కలిసి ఉండగలిగిన కిసాన్ సభావాది ఒక్క స్వామీజీ మాత్రమే! అతడు 1944 లో యిలాగ అన్నాడు.

"మన (కిసాన్ సభ) స్థితిని సంశయంలేని మాటలలో ఉద్ఘాటించడం ప్రత్యేక రాజకీయ ప్రవృత్తి ప్రాతిపదిక మన చర్యలను నిర్ణయించుకోవడం మన విధి"

1940 వరకూ జాతీయ కాంగ్రెస్ తప్ప యే యితర రాజకీయ పక్షానికీ చెందని చాలామంది కిసాన్ సభ, ట్రేడ్ యూనియన్ల కాంగ్రెస్, ప్రత్యేక రాజకీయ ప్రవృత్తులుగా తయారవుతారని అనుకున్నారు.

ఆనాడు కమ్యూనిస్టుపార్టీ మొదలు కాంగ్రెస్ వరకూ అన్ని రాజకీయ పక్షాలకూ కిసాన్ సభలో ప్రాతినిధ్యం వున్నా; అది వీటి అన్నిటి రాజకీయ దృక్పథాలనీ క్రోడీకరించి, ఒక ప్రత్యేకమైన సామాన్య రాజకీయ దృక్పథాన్ని కల్పిస్తుందనీ, యీ సామాన్య రాజకీయ దృక్పథాన్ని ప్రయోగించడంలో అది రైతులకు సహాయం చేస్తుందనీ, రైతు నాయకులు అనుకున్నారు.

తాము చేసిన తీర్మానములను అనుసరించి వాస్తవికంగా కార్య సాధన ప్రారంభించకుండా వారు ఆకాశ విహారం చేస్తున్నంత కాలం అన్ని పక్షాలకూ వేర్వేరుగా అసాధ్యమైన కార్యాన్ని అంటే అన్ని పక్షాల సమైక్యతనూ, అంగీకారాన్ని పొందిన కార్యక్రమ నిర్మాణమును తాము సాధించుటకు వీలవుతుందని అనుకున్నారు.

కాని, కిసాన్ సభ వాస్తవిక కార్యరంగంలోకి దిగవలసిన నిమిషంనుంచి అంటే, రెండో ప్రపంచ మహా సంగ్రామం ప్రారంభ

మైనప్పటి నుండీ చికాకులు ప్రారంభమైనాయి. సమైక్యతతో నిర్ణయించబడిన కార్యక్రమం, సామాన్యవేదిక, వృందవని అప్పుడు గ్రహించారు రైతు నాయకులు.

ఆ రోజులు!...

కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ వారు జవహర్‌లాల్ నెహ్రూతో పాటు ముందు కురుకుతూ, ఎక్కడ గట్లను కొట్టివేయ వచ్చునా అని వెతుకుతున్నారు కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమరాన్ని ప్రారంభించ కాంగ్రెస్‌ను రేపెట్టి, జాతీయ నాయకులు జైళ్లలోకి వెడితాక జాతీయ వేదికను తాము తీసుకొని, సురక్షితం చేసుకుందామని ఉద్దేశిస్తున్నది. ఫార్వర్డు బ్లాక్ ఏదో విధంగా జాతీయ సమరాన్ని ప్రారంభించి, మిగిలిన సంగతులను అన్నిటినీ ప్రజలకే వదిలివేదామని అంటున్నది.

కిసాన్ సభలో నున్న ఆచార్య రంగా మొదలైన వారు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఫార్వర్డు బ్లాకుల రాజకీయ ధోరణితో ఏకీభవించాలని అంటున్నారు.

సాధ్యమైనంత స్వల్ప కష్టంతో, స్వల్ప బలిసమర్పణతో అత్యధిక ప్రయోజనాలను, లాభాలను దేశానికి వచ్చేటట్లు, జాగ్రత్తగా, ముందు వెనుకలు ఆలోచించి, దృఢతర మార్గాలలో బ్రిటిష్ సామ్రాజ్యతత్వాన్ని దెబ్బ కొట్టాలని కాంగ్రెస్ నిశ్చయించింది.

అందుచేత సామ్రాజ్యవాద ప్రతికూల సమావేశం నాగపూర్‌లో జరిగినప్పుడు, వామపక్షంలో సమైక్యత కలుగలేదు. కేంద్ర కిసాన్ సలహాసంఘం 1939లో నాగపూర్‌లో సమావేశమైనప్పుడుకూడా అంతే జరిగింది

తర్వాత జరిగిన "సంధి ప్రతికూల సమావేశ" లో పాల్గొనడానికి కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ నిరాకరించింది. కమ్యూనిస్టుపార్టీ ఆఖరిక్షణం వరకూ "సరే" అంది; పాల్గొనడానికి యిష్టపడ్డట్టే నటించింది. కాని, ఆఖరి క్షణాలలో సుభాష్ బాబును అతిక్రూరంగా ఎగతాళి చేస్తూ, తన "మాలీవర్గం పంథా"ను అనుసరించి, బైటకు వచ్చేసింది.

స్వామిజీ ఇందూలాల్ జీ, యిద్దరూ, "కూలీ వర్గం పంథా"నే అనుసరించారు ఆచార్య రంగా మాత్రం దానినుంచి బైటకు వచ్చేశారు

ఈ విధంగా, కిసాన్ సభా వాదులూ, యితర వామపక్షీయులూ, కలసి 1939 జూన్‌లో స్థాపించిన "సర్వ వామపక్ష సాంద్రీకరణ సంఘం" అంతమైపోయి దాని అంత్యక్రియలు ఆనాటి రామఘర్ సమావేశంలో జరిగి పోయాయి

వామ పక్షాలు సమైక్యత నంద లేక పోయాయి. అందుచేత కిసాన్ సభ ఒక స్థిరమైన వేదికను స్థాపించుకో లేక పోయింది.

అంతే, రామఘర్‌లో నిర్ణయించినట్లు కాంగ్రెస్ ఆదర్శ ప్రాతిపదికలకు [illegible]. ఆదర్శ ప్రాతిపదికలను ప్రజలముందు కిసాన్ సభ వుంచలేక పోయిందన్నమాట

ఆ వెంటనే 1940 మార్చి నెలలో జరిగిన పలాసా సమావేశంలో కిసాన్ సభ సామ్రాజ్య వాదానికి ప్రతికూలంగా, అమలులో నుంచుటకు వీలైన ఒక నిర్ణీత కార్య క్రమాన్ని ప్రతిపాదించింది.

కాని, కమ్యూనిస్టు పార్టీ, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలు ఏమిటి చెయ్యాలో అప్పటికే నిశ్చయించుకొని వున్నాయి. అందుచేత పలాసా కార్యక్రమం నెరవేరలేదు.

ఆంధ్రదేశంలో మాత్రం శ్రీ గొగినేని లక్ష్మీనారాయణ, బీహారులో స్వామిజీ, కిసాన్ సభా వాదులూ యీ కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టారు. కొన్ని వందల మంది జయిళ్లలోకి వెళ్లారు. ఆ విధంగా, ఫార్వర్డు బ్లాకుతో కలసి వారు జాతీయ సమరానికి కావలసిన వాతావరణము కల్పించగలిగారు. కాని, కమ్యూనిస్టుపార్టీ సోషలిస్టు పార్టీలు మాత్రం యీ తీర్మానాన్ని అనుసరించలేదు. వైదొలగి వున్నాయి.

ఇంతలో జాతీయ కాంగ్రెస్ వ్యక్తి సత్యాగ్రహాన్ని ప్రారంభించింది.

1940 అక్టోబరు సరికి తాము ప్రత్యేకంగా 'సమరం' ప్రారంభించమని యిచ్చిన ఆదేశం భగ్నమై పోయిందని ఆంధ్ర కిసాన్

సభా వాదులు గ్రహించారు. అందుచేత, కాంగ్రెస్ ప్రారంభించిన వ్యక్తి సత్యాగ్రహం ముందు ముందుకు సమిష్టి సత్యాగ్రహంగా మారిపోతుందనే ఆశతో, దానికే బలపర్చుటకు నిశ్చయించారు

కమ్యూనిస్టులు మాత్రం యీ ఉద్యమం పట్ల విధ్వంసక చర్యలు సాగించారు ఈ వుద్యమం నాశనమైపోతే, గాంధీజీ నాయకత్వంలో ప్రజలకు విశ్వాసం లేదనీ, కాంగ్రెస్ సంస్థకు ప్రజలలో ప్రాబల్యం లేకుండా పోయిందనీ, లోకానికి చాటవచ్చునను కున్నారు.

కమ్యూనిస్టుపార్టీ, కాంగ్రెస్ సోషలిస్టుపార్టీలుకూడా కిసాన్ సభలో వున్నాయి కాబట్టి వ్యక్తిసత్యాగ్రహోద్యమంలో రైతాంగానికి అది సముచిత నాయకత్వాన్ని వహించలేకపోయింది.

1941 అక్టోబర్ వరకూ కిసాన్ సభా వేదికమీద ఒకే ఒక్క విషయంలో అన్ని పక్షాలకూ ఏకాభిప్రాయం వున్నట్టు కనబడుతుంది ఆ విషయం విస్తృత సమరాన్ని ప్రారంభించలేదని కాంగ్రెస్‌ను విమర్శించడం

అయితే, మిగిలిన అన్ని విషయాలలోను ఐక్యతగా లేకుండా ఏదో ఒక్క విషయంలోనో ఐక్యతగా వుంటే సరిపోతుందా? ఆ సమైక్యత ఆసంస్థను ఒక రాజకీయ ప్రవృత్తిగా చేస్తుందా?

కమ్యూనిస్టులు వారి ప్రజాయుద్ధనినాదాన్ని ప్రారంభించిన దగ్గరనుండి యీసంగతి మరీ హెచ్చుగా స్పష్టమైంది. 1941 అక్టోబరులో కేంద్రకిసాన్ సలహా సంఘం 'పాకల' లో సమావేశమైంది; జాతీయ విశ్వాసానికి జాతీయ కాంగ్రెస్ తీరని ద్రోహమాచరించిందని కిసాన్ సభ పేరిట ఆ సమావేశంలో ఉద్ఘాటించడంలో కమ్యూనిస్టులు మహోత్సాహం ప్రదర్శించారు.

1941 నవంబరులో అఖిలభారత కిసాన్ సలహాసంఘం నాగపూరులో సమావేశమైంది కమ్యూనిస్టులు ఒక పిల్లిమొగ్గ వేశారు. కిసాన్ సభ యిన్నాళ్లనుంచి చెప్తున్న సామ్రాజ్యవాది వ్యతిరేక సమరం గిమరం లేదు పొమ్మన్నారు. ఆ దృక్పథాన్ని వదలివెయ్యాలన్నారు; సమయస్ఫూర్తితో, వారి ప్రజాయుద్ధనినాదాన్ని అనుసరించమన్నారు.

కిసాన్ సభ పతనానికి యిది నాంది!

* * *

ఒక సంస్థలో ప్రవేశించడం దాని నాయకత్వం నెత్తిని అప కీర్తిపెట్టడం సభ్యులలో కలతలను కలుగజెయ్యటం అదే సమయంలో దానిలోని ప్రముఖ స్థానాలను వారి పార్టీ రంధ్రా, కోసం ఆక్రమించడం - యిది క్రమానుగతంగా వస్తున్న కమ్యూనిస్టు మాయోపాయాల సంప్రదాయం. మార్క్సు యువక కమ్యూనిస్టులకు యిచ్చిన సలహాలలో వీటినిగూర్చి ముచ్చటించాడు.

ఇంతకు పూర్వమే రైతు శ్రేణులలో తమ మాయోపాయాలను ప్రయోగించడానికి కమ్యూనిస్టులు ప్రారంభించారు.

బెంగాల్ కమ్యూనిస్టుపార్టీకి చెందిన అబ్దుల్ రసూల్. కిసాన్ సభ సహాయ కార్యదర్శి అయిన నాటినుండి, కిసాన్ సభను కూలద్రోయడానికి అనేక మాయోపాయాలను వెతకటం ప్రారంభించాడు. అవదేశ ప్రసాద్ సింగ్ అఖిలభారత కిసాన్ మహాసంఘమునకు అధ్యక్షులుగా వుంటే బీహారు, సంయుక్త పరగణాల కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ పని చెయ్యలేకపోయింది!

బీహారు, ఆంధ్ర రాష్ట్రాలు రెండూ పెద్ద రైతురాష్ట్రాలు. బీహారులో రెండు రాష్ట్ర కిసాన్ సభలు తయారైనాయి. ఒకటి కమ్యూనిస్టుల సభ, యింకొకటి కాంగ్రెస్ సోషలిస్టులది (అంటే నిజమైన రైతు నాయకులది) ఈ విధంగా కిసాన్ సభ రెండుగా చీలిపోయింది.

ఒక్క దెబ్బతో కమ్యూనిస్టుపార్టీ రెండు ఫలితాలను సంపాదించగలిగింది. ఒకటి - కాంగ్రెస్ సోషలిస్టుపార్టీని ఏకాకిగా చేయడం; రెండు-రైతు రంగంలో స్వామీజీని బలహీనంగా చెయ్యడం.

రెండు కక్షలకూ సమాధానం, సమైక్యత కలుగచేద్దామని రాజీ కుదురుద్దామనీ, శ్రీమతి భారతీదేవి, శ్రీ గోగినేని లక్ష్మీనారాయణ విశ్వప్రయత్నం చేశారు. కాని, యిరుకక్షలూ సమాధానధోరణి లేకుండా మొండిపట్టు పట్టడంచేత, వారి ప్రయత్నాలు నిష్ఫలమైనాయి.

ఇంతవరకూ కిసాన్ సభ సంపూర్ణంగా ప్రతికూలం: ఏవిధంగానూ యుద్ధానికి సహాయపడకూడదన్నది. కాని యిప్పుడు జాతీయ కాంగ్రెస్ విధానాన్ని అనుసరించి యీ దృక్పథాన్ని వదలుకుంది: కొంతవరకూ యుద్ధానికి సహాయం చేయవచ్చు ననడంతో ఫార్వర్డు

బ్లాక్ విధానానికి ప్రతికూలమైపోయింది; అందుచేత కిసాన్ సభలో వున్న ఫార్వర్డు బ్లాక్ సభ్యులు రాజీనామా ఇచ్చి బైటకు వచ్చేశారు.

కమ్యూనిస్టు కిసాన్ సభనుండు, అటు కిసాన్ సభలో ఫార్వర్డు బ్లాకు ప్రతినిధులే అధిక సంఖ్యాకులుగా వుండేవారు. అందుచేత అది వారి అధికార ప్రాబల్యానికి [illegible] వుండేది. కాగా, స్వామీజీ కారాగృహంలోనుంచి బైటకు రాగానే, నాడు పోటీ కిసాన్ సభలోని కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ వారి ప్రతికూలతను ఒక ప్రక్కనుంచీ, అసలు సభలోని బ్లాక్ ప్రతినిధుల ఖాళీలోని లోటును యింకొక ప్రక్కనుంచి ఎదుర్కొనవలసివచ్చింది!

స్వామీజీ యీవిధంగా, పాపం తన రాష్ట్రంలోనే ఏకాకి అయిపోయారు! ఈ చిక్కు పరిస్థితులనుండి తప్పించుకొనుటకు వారు ఒక విధానాన్ని, ఒక మార్గాన్ని వెంటనే నిర్ణయించుకోవలసివచ్చింది. అయితే వారు యీవిధానాన్ని; యీమార్గాన్ని జైలుగోడల క్రిందనే వెతుక్కొని, సిద్ధంచేసుకున్నారు! జైలులో వుండగానే వారీ నిర్ణయానికి వచ్చినట్లుంది!

స్వామీజీ తన రాష్ట్ర [illegible] చేసేసి, అఖిలభారత కిసాన్ [illegible] చేసేసి, కమ్యూనిస్టుపార్టీని ఆహ్వానించారు; కిసాన్ సభను ఆక్రమించి, దాని రూపురేఖలను దిద్దమని ఆపార్టీని వారు ప్రార్థించారు!

రాజకీయ రంగంలో స్వామీజీ వేసిన పిల్లిమొగ్గకు కారణం యీనాటి వరకూ బ్రహ్మరుద్రాదులకు కూడా తెలియని రహస్యం ఇది.

కాని, ఆ అభేద్య రహస్యానికి కీలకం యిక్కడ మనకు లభిస్తుందని కిసాన్ సభలో కమ్యూనిస్టులు తమ మాయోపాయములను ప్రయోగించడంవల్ల కలిగిన ఫలితం యిది!

ఈనాటివరకూ కేంద్రకిసాన్ సలహా సంఘంలో పెద్ద భేదాభిప్రాయాలు యేవీ యేర్పడలేదు. అందుచేత దాని పదవులూ, కార్యనిర్వాహణ అన్నీకూడా లాంఛనప్రాయంగానే వుండేవి. అంతకాలం అవి యెవరి చేతులలోవున్నా బాధలేకుండాపోయింది. కిసాన్ సభ కార్యకలాపాలు ఆచార్య రంగా, స్వామీజీల మార్గదర్శకత్వం క్రిందనే జరుగుతూవుండేవి.

కాని, యీ సాధా సభలోని పదవులనూ, కార్యనిర్వాహణనూ, రెవరు వశం చేసుకుంటే, వారే సభ భావి రాజకీయ దృక్పధాన్ని తీర్చి దిద్దగలరు. అందుచేత ఆక్షణం నుంచి యీ యంత్రం ఎవరి ఖాయిదాలో నుండాలి, ఎవరు దానిని నడపాలి, అన్న ప్రశ్న తీరని సమస్య అయి పోయింది

అంటే, ఆచార్య రంగా అతని అనుచరులూ, ఉద్బోధిస్తున్నట్టుగా కాంగ్రెస్ రాజకీయాల ననుసరించి రైతుల దృక్పధాన్ని రచించాలా, లేక, స్వామిజీ, యిందూలాల్ జీ ప్రభృతులు ఉద్బోధిస్తున్న రాజాజీ ప్రణాళికతో కలిసిన కమ్యూనిస్టు రాజకీయ దృక్పధాన్ని అనుసరించి కిసాన్ దృక్పధాన్ని దిద్దుకోవాలా; అనేది ప్రశ్న.

వారి భారత జాతీయ వ్యతిరేక దృక్పధాన్నే అనుసరింప కమ్యూనిస్టులు నిశ్చయించుకున్నారు; కాంగ్రెస్ వ్యతిరేకమైన ధోరణినే యింకా అనుసరింప నిశ్చయించినారు స్వామీజీ, యిందూలాల్ జీ కమ్యూనిస్టుల అభివృద్ధినిరోధక చర్యలకు సహాయం చేస్తుండే వారు. త్వరలోనే యీ విషయాలను ఆచార్య రంగా, వారి అనుచరులూ గ్రహించారు. అందుచేత, ఆంధ్రప్రాయంగా సభలోనే వుండి వారు తను తమ దక్షిణ భారత రాష్ట్రసభలకు మాత్రం స్వతంత్ర విధానాన్ని నిర్ణయించుకొనే అధికారాన్ని సంపాదించుకుందామని అనుకున్నారు.

కాని, యీలోపుగా కాంగ్రెస్ ఆగస్టు తీర్మానాన్ని ఆమోదించింది. ఆ నెలలోనే భారత రైతాంగం పట్ల కిసాన్ సభ ఘోరమైన 'జాతీయ విద్రోహాన్ని' ఆచరించింది.

కిసాన్ సభ అంటే, ఆచార్యరంగా ప్రభృతులకు, యితర దక్షిణ భారత కిసాన్ నాయకులకు మొహం మొత్తిపోయింది!

వేరుదారిలేక, ఆదినుంచీ వున్న "కిసాన్ కాంగ్రెస్" (రైతు కాంగ్రెస్)కు మళ్లి పోయారు!

ఒక సంవత్సరం తర్వాత, కమ్యూనిస్టులు కిసాన్ సభను తమ పార్టీ వేదికగా మార్చుకుంటున్నారని చెప్పి ఇందూలాల్ జీ రాజీనామా యిచ్చి సభనుండి బైటకు వచ్చేశారు.

మొట్టమొదట 1942 లో ఆచార్యరంగా, తర్వాత 1944 లో ఇందులాల్ జీ సభనుండి వైదొలగుటకు ఏ కారణాలను చెప్పారో

ఆకారణాలవల్లనే 1945 లో స్వామీజీకూడా కమ్యూనిస్టుల చేతుల్లో పడిన కిసాన్ సభను వదలవలసి వచ్చింది.

అంటే, యీనాడు రైతులలో కమ్యూనిస్టుల ప్రదర్శన మాత్రమే కిసాన్‌సభ! దానిని మొదట స్థాపించిన నాయకులుగాని, రైతుసేవను తమ జీవితాలకు అంకితం చేసిన యితర రైతుసేవకులు గాని, యీనాడు దానిలో మనకు కనబడరు.

కాంగ్రెస్ యెడల భక్తి విశ్వాసాలూ, జాతీయతా, వర్గచైతన్యం, విప్లవశక్తీ వున్న రైతులు 'కిసాన్ సభను' వదలివేసి 'రైతు కాంగ్రెస్'ను స్థాపించుకున్నారు. జాతీయ కాంగ్రెస్ పట్ల, దాని విధానాలపట్లా, భక్తి గౌరవాలు ప్రదర్శించే దేశభక్తి పూరితమైన జాతీయ సంస్థగా వారు దానిని అభివృద్ధి చేసుకుంటున్నారు.

* * * *

ఈమార్పులలోని, రాజకీయస్థితులలోని అంతరార్థం యేమిటి?

రైతు సంస్థ ఒక వర్గం యొక్క రాజకీయ ప్రవృత్తి అని వేరే "ప్రత్యేక రాజకీయ ప్రవృత్తి"గా వుండగలదనీ, దానిలోని యితర రాజకీయ పక్షాలు యితర స్థలాల్లో పోరాడుకుంటున్నా యిందులో మాత్రం అవి అన్నీ సమైక్యతను పొంది సాఫీగా పని చెయ్యగలవనీ, ఒక సామాన్య రాజకీయ కార్యక్రమాన్ని అవి సాధించి దానిని అవి అన్నీ కలసి మనఃపూర్వకంగా నిర్వహించగలవనీ అనుకోవడం పొరపాటు.

ఆ సంస్థలోని యే వొక పక్షమైనా ఆ సంస్థమీద అధికారం చెలాయించటానికే ప్రయత్నించడం నిశ్చయం. వారు అన్ని ముఖ్యమైన రాజకీయ సమస్యల పరిష్కారంలోనూ తమ పక్షమార్గాన్నే అనుసరించాలని పోరాడతారు. ట్రేడ్‌యూనియన్లు, కాంగ్రెస్ అనుభవాలే యిక్కడ తిరిగి కనబడుతాయి.

ఏది యేలాగ వున్నా, యిట్టి సంఘటనలలో, ఆ సంస్థలో అధికారం చెలాయిస్తున్న పక్షపు సభ్యులు మాత్రం ఆ సంస్థలోని యితర పక్షాల సభ్యులనుకూడా తమ మార్గాన్నే అనుసరించమనడానికి ప్రయత్నిస్తారనడం నిశ్చయం.

క్రిందటిసారి యుద్ధసమయంలో, యూరప్‌లోని అనేక దేశాలలో, అనేక వర్గ సంస్థలలో యిలాగే జరిగింది—వేర్వేరు రాజకీయ-

పక్షాలకు చెందిన ఒక సంస్థలోని సభ్యుల మధ్య ప్రాతిపదికలలోని భేదాలవల్ల విభేదాలు కలిగాయి.

అందుచేత అలాంటి సంస్థలు రాజకీయాలలో కలుగ జేసుకో కూడదు; విభేదాలను యెదుర్కొని చీలికను పొందాలి... వేరు మార్గం లేదు.

అయితే, "ఏదైనా వర్గ సంస్థ రాజకీయాలనుండి వైదొలగ గలదా?"

అంటే; వైదొలగలేదు. ప్రతి ఆర్థిక సమరం రాజకీయ సమరంలోకి పరిణమిస్తుంది. మార్క్స్ లెనిన్‌లు సముచితంగా గుర్తించారు.

ఇ. ఆర్థిక సమరం వర్గ సంస్థల దైనిక జీవితంలోని ముఖ్య లక్షణం.

"వర్గ సంస్థలు రాజకీయాలనుండి వైదొలగడం మంచిదా?" అంటే, కాదు. ఆ విధంగా వైదొలగటం ఆ సంస్థకే లేనేమి, చాలా ప్రమాదం. ఆ సంస్థ రాజకీయ సమరాలను మానుకుంటే, దాని అదుపులో నున్న అనేకం కొల్లగొట్టే వర్గాలతో నైతేనేమి, యితర రాజకీయాలతో నైతేనేమి, పెద్ద పెద్ద పోరాటములకు చోటు లేకుండా, చిన్నచిన్న జగడాలను మాత్రమే చేయబూనగలదు

అప్పుడు ఆ సంస్థ "ఎకనమిజం" విధానాన్నే అనుసరించ గలదు.

"ఎకనామిజం" అంటే అధికారుల యెడల భయభక్తులతో మర్యాదగా, శాసనబద్ధమైన మార్గాలలో వినతులను సమర్పించి, ప్రజల ఆర్థిక కష్టాలను, నష్టాలను తొలగించాలని ప్రయత్నించె సంస్కరణ విధానం.

"జస్టిస్‌పార్టీ" విధానంలాంటి దానినే 'ఎకనామిజం' అన వచ్చును.

ఈ విధమైన లక్ష్యాలతో విధానాలతో వున్నప్పటికీ, రైతు సంఘాలు చాలావున్నాయి. కాని, వర్గ చైతన్యము పట్టనైనా రైతు జనం పెల్లుబికి, వారికి ఆవేశం యివ్వగల శక్తికూడా వీరికి లేక పోయింది రాజకీయ శక్తులుగా అవి యెందుకూ పనికిరాని సంస్థలు మాత్రమే!

వాటికి వేరు మార్గం లేదు పాపం!

# వర్గసంస్థలు : వాటి రాజకీయాలు

# 10

ఏకవర్గ రాజకీయాలను అనుసరిస్తున్న పక్షాలు, సంస్థలు సాంఘిక విప్లవంలో నిశ్చయంతో సముచితమైన నిర్ణీత విజయాన్ని పొందలేని పరిస్థితులు కూడా వుంటాయని యూరప్‌లోని కార్మిక సామ్యవాద పక్షాల అనుభవాల వలన స్థిరపడుతున్నది.

రైతాంగాన్ని, విద్యాధిక వర్గాన్ని కూలీవర్గం ఎంతకాలమైతే ఉపేక్షాభావంతో, అనుమానంతో, చూచిందో అంతకాలం వారూ, మిగిలినవారూ కూడా తమ భావి భాగ్యాన్ని కార్మికవర్గం చేతుల్లో వుంచడానికి ఇష్టపడలేదు.

ఆ యా వర్గాల ఆదిన్న ప్రాతినిధికలలోను, రోజూ కలిగే అనుభవాలలోనూ అన్ని విభేదాలను, సమైక్యత లేకపోవడాన్ని తొలగించుకొని సామరస్యం పొందడంలో ఐక్యానికి పరస్పరంగావుండే యీ అనుమానాలే మొదటిలో కారణమైనాయి. తరువాత, వారి వారి విప్లవ ఉత్సాహాలను బలహీనం చేశాయి; ఆఖరికి ఇన్నోర్యాగ రాజకీయ స్పర్ధలకు, విభేదానికి దారితీశాయి; ప్రతీప పాలకజనులకు కారణమైనాయి.

ఈ విషయంలో రష్యన్ కర్షకవర్గంయొక్క అనుభవాలు కూడా మనకు ఒక పాఠాన్ని నేర్పుతున్నాయి, జ్ఞానాన్ని బోధిస్తున్నాయి.

రష్యాలో కర్షకవర్గం సోషలిస్టు రివల్యూషనరీపార్టీ నిజైన నాయకత్వానికి ఎన్నుకుంది. కాని, ఆపార్టీ తన సర్వశక్తులనూ ఒక్క కర్షకులపైనే కేంద్రీకరించింది; నాగరిక వర్గాలతోగాని, కూలీవర్గంతోగాని ఏవిధమైన సంబంధాలనూ పెట్టుకోలేదు. పెట్టుకున్నా, చాలాకొద్దిగా మాత్రమే!

మొదటినుండీ లెనిన్ చెప్పినట్లే, ఆఖరికి సాంఘిక విప్లవ సమయంలో ఆయా వర్గాల నాయకత్వాలకు అంతిమ పరీక్ష వచ్చేసరికి సంపూర్ణ కార్మికవర్గపు భక్తి ప్రమాణాన్ని కొంతవరకూ కర్షక పక్షాల భక్తిప్రమాణాన్ని సంపాదించుకున్న కమ్యూనిస్టులు సోషలిస్టు రివల్యూషనరీలకన్నా వున్నత స్థానాన్ని ఆక్రమించగలిగారు.

కర్షకవర్గపు కనీసపు కోరికలను సమీకరించి, 242 కోరికలుగల కార్య ప్రణాళికను సోషలిస్టు రివల్యూషనరీలు తయారు చేశారు; ఆ ప్రణాళిక వారి జీవిత సాధనకు ఫలితం. లెనిన్ ఆ కార్య ప్రణాళికను తీసుకొని, దానిని తుచా తప్పకుండా తానే ఆచరిస్తానన్నాడు; వారి అభ్యున్నతికి తానే పాటుపడతానన్నాడు.

తర్వాత లెనిన్ కర్షకవర్గ విలయానికి అవలంభించిన విధానంలోని ముఖ్యమైన పంక్తులు మొదట సోషలిస్టు రివల్యూషనరీలకన్న ఉత్తమ మిత్రులుగా కనిపించడం, తర్వాత వారి నాయకత్వంలో కలతలు కలుగజేసి విభజించడం వారిలోని వామపక్షాన్ని తన నియంతృత్వంలో భాగస్వాములుగా తీసుకోవడం మరికొద్దిరోజులలో వారిని అధికారంనుండి నెట్టివెయ్యడం, అటుపైని కర్షకవర్గాన్ని అంతటినీ విలయింపజెయ్యటం.

ఏ వర్గానికైనా జాని నాయకత్వం ఒకసారి పోయిందో, ఆ వర్గం చాలా కాలం వరకూ స్తంభించిపోయి, నిస్సహాయంగా అయిపోతుంది. ఈ లోపుగా మిగిలిన వర్గాలు యెంత చెడుపు చెయ్యవచ్చునో అంత చెదుపూ చేసి వేస్తాయి. దెబ్బతిన్న వర్గంలోని అధిక భాగాలను తమలోకి ఆకర్షించుకొని, వాటి భక్తి గౌరవాలను సంపాదించుకుంటాయి తమ అధికారాన్ని అంగీకరించకుండా తిరుగుబాటుచేసే భాగాలను, ముందుగా ఆకర్షించిన భాగాలను యెరగా చూపి లొంగ తీస్తాయి.

భారత రైతాంగం సోదర రష్యన్ కర్షక వర్గంనుండీ, యితర దేశాల రైతాంగాల నుండి యిలాంటి పాఠాలే నేర్చుకోవాలి.

భారత రైతాంగం యితర వర్గాలతోనున్న పరస్పరం, సామాన్యం అయిన రాజకీయ ఆదర్శ ప్రాతిపదికల మీద ఆధారపడి వుండే దినదిన రాజకీయ సంబంధాలను సహకారాన్ని కొద్దిగానైనా లేకుండా గాని, ఏకొద్దిపాటిగానో వుంచుకొని గాని, తమ రాజకీయ ప్రవృత్తిని లేశ మాత్రంగా వృద్ధి చేసుకుంటే అత్యధికంగా యేదో వొక్క వర్గానికే చెంది వున్నప్పటికీ, యేవో కొన్ని యితర వర్గాల ప్రాపును గాని, లేక అన్ని వర్గాల ప్రాపును గాని వారి వారి ప్రత్యేక రాజకీయ ప్రాతిపదికల మీద ఆధారపడి సంపాదించుకున్న యే కమ్యూ

నిష్టు పార్టీయో, లేక యే యితర పార్టీయో, వారిని మలుపుగా పాలనం చేసి వేయగలదు.

భారత రైతాంగపు నాయకత్వం తాను చెప్పే విషయంలో నేమి, తన దృక్పథంలో నేమి, ప్రముఖంగా కర్షక వర్గ పక్షంగా నుండడం చాలదు; అన్ని పారిశ్రామిక వర్గాలకూ, లేదా, సాధ్యమైనంత ఎక్కువ పారిశ్రామిక వర్గాలకు పనికివచ్చి, వారి భక్తి గౌరవాలను పొందగల రాజకీయ ఆదర్శ ప్రాతిపదికలనూ, సంస్థనూ, మార్గాన్నీ నిర్మించుకోవడం భారత రైతాంగపు విధి. ఇది దాని తక్షణావసరం కూడాను

ఇలాంటి అవసరాన్ని యథార్థమైన కాలంలో, స్పష్టంగా, ధైర్యంగా, యింతకు ముందే భారత రైతాంగం ముందు ఉంచక పోవడం రైతు కాంగ్రెస్ చేసిన గొప్ప తప్పు!

కాని, కొందరు రైతునాయకులు మాత్రం యీ విషయాన్ని మొదటి నుంచీ సూచిస్తూనే వున్నారు. 1936 లో ఫైజ్‌పూర్‌లో అఖిల భారత కిసాన్ కాంగ్రెస్ ద్వితీయ సమావేశం జరిగింది. ఆచార్య రంగా తన అధ్యక్షోపన్యాసంలో, "అన్ని పారిశ్రామిక వర్గాలూ, అన్ని సంస్థలూ కలుసుకోడానికి, వారి వారి అనుభవాలను ఒకరితో ఒకరు చర్చించుకోడానికి, వారివారి శక్తులను కూడ దీసుకోడానికి, పరస్పర సంభాషణల వల్లా, సమాలోచనల వల్లా, భావికార్యకలాపానికి తగిన ఆవేశ సంపత్తిని సముకూర్చుకోడానికి, సముచిత సభావేదిక కాంగ్రెస్ మాత్రమే!" అని ఉద్ఘాటించారు.

అంతేకాదు, సంపూర్ణ స్వరాజ్యాన్ని సంపాదించే వరకూ, చాలా అధికంగా సమైక్యత పొందిన జాతీయ రంగం భారత దేశంలో కాంగ్రెస్ మాత్రమే అనీ, మిగిలిన అన్ని సంస్థలూ సముచితమైన సామ్రాజ్య వ్యతిరేక ధోరణిలో కాంగ్రెస్ జాతీయ రాజకీయ విధానాన్నే ప్రతిబింబించాలనీ అన్నారు.

అయితే, అప్పుడు రైతు సంస్థలూ, కార్మిక సంఘాలూ, ప్రత్యేక రాజకీయ ప్రవృత్తులుగానే వుంటాయని ఆచార్య రంగా అభిప్రాయపడ్డారు. నాటి వారి దృక్పథమే మొదటిలో 'కిసాన్ కాంగ్రెస్' ధోరణినీ, తర్వాత "కిసాన్ సభ" ధోరణినీ తీర్చిదిద్దింది.

కాని ఆనాటినుండి నేటివరకు అనేక సంఘటనలు జరిగిపోయాయి. కమ్యూనిస్టులు అనేక రైతు సంస్థలలో కలుగ జేసుకొని, వారి మార్గోపాయాలద్వారా రైతాంగపు రాజకీయాలకు ఒక విశాల రూపాన్ని యిచ్చారు. స్థానిక కాంగ్రెస్ సంఘాలకు వారి నాయకత్వానికి, వారి ప్రచారకులకు వ్యతిరేకంగా అనేక 'కిసాన్ సభ'లను తయారుచేశారు. వేరువేరుగా చూస్తే యీ పనులకు అంత ప్రాముఖ్యత లేక పోయినా, సమిష్టిగా వారు అనుసరించిన అనేక అక్రమ మార్గాలవల్ల కాంగ్రెస్‌కూ, కిసాన్‌సభకూ మధ్య ఒక విరోధ సాంప్రదాయాన్ని కల్పించారు.

రైతు సంస్థలు ప్రత్యేక రాజకీయ ప్రవృత్తిగా వుండగలవనే తప్పు భావానికి ఫలితం యిది అంటాను.

*　　　*　　　*　　　*

ఆచార్య రంగా వంటివారు కూడా; [illegible] సమూలమైన మార్పు అవసరమని గుర్తించారు. ఇతర పారిశ్రామిక వర్గాల రాజకీయాలకు వేరైన ప్రత్యేక రాజకీయాలు రైతులకు వుండవలసిన అవసరాన్ని గ్రహించారు.

అయితే. యే బానిస దేశంలో నైనా, యే పరతంత్ర భూమిలో నైనా, అన్ని పారిశ్రామిక వర్గాల రాజకీయాలూ, ఆ దేశపు సామాన్య జాతీయ విప్లవంయొక్క రాజకీయాలకు వేరుగా గాని, పోటీగా గాని, వ్యతిరేకంగా గానీ వుండలేవు

అంటే పారిశ్రామిక వర్గాల రాజకీయాలు భారతదేశంలో జాతీయ కాంగ్రెస్‌నీ, చైనాలో కూమింగ్‌టాంగ్‌నీ, ఈజిప్టులో వాఫ్డునీ అనుసరించి వుంటాయి.

ఇతర వర్గ రాజకీయాలతోనూ, సమైక్యత నందిన జాతీయ రాజకీయాలతోనూ రైతుల నాయకత్వం సుహృద్భావాన్ని పెంపొందించుకోకుండా, ఏకాకిగా వుండిపోతే – ఆనాడు రష్యాలో యిదే విధానాన్ని అవలంబించిన సోషలిస్టు రివల్యూషనరీలకు పట్టిన గతే పడుతుంది. రైతుల నాయకత్వానికిని, దేశంలోని యేదో వొక అనేక వర్గ రాజకీయ సంస్థ ఆయినా, దానిని కబళించి వేస్తుంది. రష్యాలో కర్షక వర్గాన్ని మోసగించి, కబళించి వేసిన కమ్యూనిస్టు పార్టీయే యిక్కడకూడా మొదట రైతువర్గాన్ని మోసగించి కబ

లించివేయవచ్చును. తర్వాత, రైతాంగానికి యితర కష్టజీవుల వర్గాలకూ అధికారవంతమైన ప్రతినిధినని చాటుకోవడం ప్రారంభిస్తుంది! నిజమైన స్నేహాన్ని నటిస్తుంది. ఆఖరికి అందరూ దానినే నిజమైన రైతుప్రతినిధి అనీ స్నేహ సంస్థ అనీ అనుకుంటారు.

అందుచేత రైతులు అనేక వర్గ రాజకీయాలకు అనుకూలమైన విధానాన్ని దృక్పథాన్ని తప్పనిసరిగా నిర్ణయించుకోవాలి.

అయితే, ఏ మధ్యతరగతి రాజకీయ పక్షం రైతాంగానికి హెచ్చుగా సంతృప్తినీ, అభ్యుదయాన్నీ యివ్వగల పక్షం?

నేడు భారత దేశంలో అన్ని పక్షాలల్లోనూ ప్రముఖంగా వున్నవి-కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ, ముస్లిమ్‌లీగ్, కాంగ్రెస్.

కూలీవర్గ నియంతృత్వానికే జీవితాన్ని అంకితంచేసిన కమ్యూనిస్టుపార్టీ, సోషలిస్టు పార్టీలు రైతాంగమునకు అభ్యుదయం, సంతృప్తి యివ్వలేవు. ఇందుకు కారణాలు మనకు అందరికీ తెలుసు.

ఇతర మతాల ప్రజానీకమునకు ప్రాతినిధ్యమే వహించలేదు ముస్లిమ్‌లీగు: అందుచేత అది లాభంలేదు.

ఇక జాతీయ కాంగ్రెస్ —

మార్క్సు వాదులు తమ కమ్యూనిస్టుపార్టీ తక్కిన అన్ని వర్గాలకన్నా ముందుగా విప్లవవాద కూలీవర్గానికే ప్రాతినిధ్యం వహిస్తుందని వాదిస్తున్నట్టుగానే తక్కిన అన్నివర్గాలకూ ప్రాతినిధ్యం తాను వహిస్తున్నా, ముందుగా. మొట్టమొదటగా ముఖ్యంగా, రైతువర్గానికే తాను ప్రాతినిధ్యం వహిస్తానని! హరిపురా సమావేశంలో కాంగ్రెస్ ఉద్ఘాటించింది. తాను "రైతుల సంస్థను" అని ముక్తకంఠంతో లోకానికి చాటింది

గ్రామాలకు, గ్రామీణ సంస్కృతికి, సభ్యతానాగరికతల క్షేమానికి, రైతులకు, తాను ప్రాతినిధ్యం వహిస్తానని ముందుముందు తాను నిర్మించబోవు, సాంఘిక వ్యవస్థలో వీటికే ప్రముఖస్థానం అని ఉద్ఘాటించిన సంస్థ కాంగ్రెస్ మాత్రమే! ఇంకేదిలేదు!

కమ్యూనిస్టులు తమ అధికారంక్రింద లేని వర్గాలనూ, కూలీ వర్గానికి చెందని యితర కష్టజీవుల వర్గాలనూ అనుమానంతో, తృణీ-భావంతో చూస్తుంది కాని కాంగ్రెస్‌మాత్రం అలాకాదు. భారతీయు-

అందరినీ ఒకే విధంగా చూస్తుంది. నిజానికి కూలీవర్గమునకు తాను చెయ్యగలంత మేలూ చేస్తుంది. ఆవర్గానికి ఇతోధికంగా క్షేమాన్ని ఆకాంక్షిస్తూ, అందుకు యత్నిస్తున్నది. ప్రత్యేక వృత్తులలో జీవించే వారికీ, విధ్యాధికులకూ, వారి విజ్ఞాన అభ్యాసాలకూ, ఆదర్శములనూ, సముచితంగా ఆదరిస్తున్నది. *

వ్యవసాయ పారిశ్రామికుల, హరిజనుల, ఇతర నిమ్నజాతుల అభివృద్ధికే తన జీవితాన్ని అంకితంచేసి వారి పక్షాన పోరాడే అత్యుత్తమ సంస్థయిది. అతి విస్తృతమైన చేతిపనివారల వర్గానికి యిది తోడునీడ; శ్రీరామ రక్ష.

ఆ మహాసంస్థ యీనాడు కష్టజీవులందరికి సంస్థగా రోజురోజుకూ పెరిగి పెద్దదౌతున్నది. అధికారమంతా పొలాలలో, యంత్రాగారాలలో, యితర స్థలాలలో పనిచేస్తున్న కష్టజీవుల హస్తగతమవ్వాలనే నూతన రాజకీయ వ్యవస్థను అంటే, రైతుకూలీ ప్రజారాజ్యమును ప్రతిపాదిస్తున్నది.

అందుచేత, రైతాంగపు రాజకీయ సంస్థ కాంగ్రెస్ మాత్రమే కాగలదు; రైతుల అభ్యుదయంకోసం, క్షేమంకోసం సర్వశక్తులూ వినియోగించి మనస్ఫూర్తిగా పోరాడగల సంస్థ కాంగ్రెస్‌మాత్రమే!

గ్రామీణ ప్రజలు, చేతిపనులవారు యితర పారిశ్రామికవర్గాలు ప్రజా, ఆ మహా సంస్థను అనుసరించు, దాని శ్రేయస్సు కోసం పాటుబడి దానిపారిశ్రామికవర్గ రాజకీయాలలో శక్తివంతమైనపాత్రనిర్వహించిన నాడు ఆయా వర్గాల నాయకత్వాల మధ్య సుహృద్భావంతో నిండిన రాజకీయ సమాలోచనలు, సాంగత్యం పెంపొందడానికి తావు వుంటుంది

ఒక ప్రక్క నుండి బూర్జువా వర్గం ప్రపంచ ధనిక వాదం, ప్రపంచ సామ్రాజ్య వాదం, మరొక ప్రక్కనుండి కమ్యూనిస్టులూ, జాతీయతకు, దేశభక్తికి వ్యతిరేకంగా, రైతు ప్రజా వర్గాలకు ప్రతి

---

* ప్రభుత్వం స్వతంత్ర భారత సైనికోద్యోగుల మీద జరిపించిన విచారణలలో కాంగ్రెసు తీసుకున్న భాగం, నావికుల సమ్మెల విషయంలో కాంగ్రెసు ప్రదర్శించిన దృక్పథం యీ విషయాన్ని రుజువు చేస్తున్నాయి

కూలంగా సాగిస్తున్న రాజకీయాలనుండీ, ప్రజలలో కలిసిపోయి వారిని రాజకీయంగా క్షయింప జేసే వారి తంత్రాలనుండి జాతీయ క్షేమాన్ని, శ్రేయస్సును, కష్టజీవుల అభ్యుదయాన్ని సంరక్షించగల అతిశక్తివంతమైన రాజకీయ పక్షాన్ని ఆవిధంగా వారు నిర్మించ గలరు!

తమ క్షేమాన్నీ తమ అభ్యుదయాన్నీ కూలీలు ఆకాంక్షిస్తే, రోజురోజుకూ అభివృద్ధి నందుతున్న కూలీ వర్గం కూడా కాంగ్రెస్ నే అనుసరించడం శ్రేయస్కరం. అప్పుడు రైతు కూలీలకు కాంగ్రెస్ సామాన్య వేదిక కాగలదు. ఇంకెంతో విస్తృతమైన సంబంధాలను సుహృద్భావంతో వారొకరితో నొకరు కల్పించుకోడానికి అవకాశం వుంటుంది

విశేషించి, జాతీయ కాంగ్రెస్ ఎప్పుడూ కూడా జాతీయాభ్యుదయం కోసం పట్టుదలతో, నిశ్చయంతో, నిలబడింది. ఈనాటి వరకూ సర్వకాల సర్వావస్థలలో ఆ మహాసంస్థ ప్రతీ పర్యవసానాన్నీ ప్రతీ విషయ సంఘటననీ, ముఖ్యంగా దేశాభ్యుదయ దృక్పథంతోనే పరిశీలిస్తున్నది.

భారత ప్రజానీకంలో ప్రతీ తరగతినుండీ, ప్రతీ వర్గమునుండీ అత్యధిక భాగాలను మేల్కొల్పడంలోను, అనేకసార్లు అది ప్రదర్శించిన ఆత్మార్పణ ఘట్టాల ద్వారా, సాగించిన అనేక సమరాల మూలంగా వారి విశ్వాసాన్నీ, భక్తి గౌరవాలనూ సంపాదించడంలోను, యింతవరకు కాంగ్రెస్ మాత్రమే విజయాన్ని పొందగలిగింది. ప్రతీ వర్గలోనూ జాతీయ శక్తినీ, చైతన్యాన్నీ విజృంభింప జేసింది. ఆత్మార్పణ చేసిన వీరుల వేడి రక్తంతో వారి విప్లవ ప్రతిభను పోషించింది. వలస రాజ్య ప్రపంచ మంతటిలోనూ మొదట లెక్కించ వలసిన విప్లవ శక్తిగా వారిని నిర్మించింది.

భారత వర్షంలోని కష్టజీవులందరి పక్షాన పోరాడే వీరుడు మహాత్మాజీ; జాతీయ కాంగ్రెస్ వారి నాయకత్వంలో, మార్గ దర్శకత్వంతో ముందంజ వేస్తున్నది. వారి ఆదర్శ ప్రాతిపదికను రైతు కూలీ ప్రజారాజ్యాన్ని మనఃపూర్వకంగా బలపరుస్తున్నది.

కాంగ్రెస్ యీనాడు ప్రపంచ సంగ్రామం వొత్తిడి వల్లను, గాంధీజీ, పండిట్ నెహ్రూల నాయకత్వం వల్లను, రైతు నాయకుల

కేంద్రీకృతమైన ప్రాబల్యాన్ని, ఒక నిమాత్నమైన, విప్లవకరమైన మార్పును తెస్తున్నది స్వతంత్ర భారతభూమిలోని అధికారం అంతా కష్టజీవులకు, రైతులకు, కూలీలకు, ప్రజలకు చెందితీరాలనే నిర్ణయానికి వచ్చింది.

1920 1930, 1942 సంవత్సరముల నాటి జాతీయ సమరాలలో అంతర్గతంగా సాగించబడ్డ రైతు సత్యాగ్రహోద్యమముల ద్వారా, ఇద్దరి మధ్యం యేర్పడిన బంధాలలోను, కాంగ్రెస్ మంత్రిత్వ కాలంలోను రైతు సంస్థలకు, వారి సత్యాగ్రహోద్యమములకూ నైతిక సహాయం యివ్వటంద్వారా రైతాంగంలోని చైతన్యాన్ని ఉద్రేకింపచెయ్యటంలోను, రైతుసంస్థలను అభివృద్ధి చెయ్యటంలోను, రైతు నాయకత్వపు స్వరూపాన్ని రచించడంలోను రైతుకాంగ్రెస్ వాదులకు జాతీయ కాంగ్రెస్ అత్యధికంగా సహాయం చేసింది

భారత వర్తకులాంటి వానికి దేశంలో అన్నిటికీ మించిపోయిన ఏకైక రాజకీయ కృషి-జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించడం

ఇతర వర్గాలకు-భారత పరిశ్రమదారుల సమాఖ్యలకు, వర్తక వర్గాలకు, వృత్తిజీవుల వర్గాలలోని అధిక భాగాలకు - కొంతవరకు అయినా సౌభాగ్యం, రాజకీయావకాశాలు సామ్రాజ్యవాదపు సంరక్షణలో కలుగవచ్చును కాని, కష్టజీవులు రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించి స్వతంత్ర భారతదేశంలో ప్రముఖ అధికారాన్ని పలుకుబడిని, గౌరవాన్ని, సంపాదించుకొనేంతవరకు, వారు ముఖ్యమైన మార్గాలలో సంపూర్ణ అభ్యుదయాన్ని సాధించలేరు; పరోక్షంగా గాని, బహిరంగంగా గాని తమ్ము కొల్లగొడుతున్న వర్గాల ప్రముఖ ప్రయోజనాలను గట్టి దెబ్బ కొట్టలేరు.

జమీందారీ పద్ధతిని నాశనం చెయ్యటానికి అప్పులిచ్చే సంస్థలను, బ్యాంకులను జాతీయం గావించడానికి ప్రభుత్వ పర్యవేక్షణ క్రింద వివిధ కీలక పరిశ్రమలను వృద్ధి చెయ్యడానికి భారీపరిశ్రమల సంస్థలు, వర్తక సమాఖ్యలు మన రైతు ఉత్పత్తి చేసిన వస్తువులకు సరియైన ధరలు యిచ్చేటట్లు చేయటానికి భారతదేశమునకు పక్షపాతం లేకుండా సరిసమానమైన మారకం ధరలకే వారు తయారుచేసిన సరుకులను అమ్మేటట్లు కట్టుదిట్టం చేయడానికి విస్తృతంగా చర్యలను తీసుకొనడానికి, ప్రస్తుత సామ్రాజ్యవాద అధికారం పోయితీరాలి. భారత

వర్షం ప్రపంచమండలి యితర స్వతంత్ర రాజ్యాలకు ఏవిధంగా తీసిపోవని స్వతంత్రమైన పదవిని పొంది తీరాలి.

కాగా, వలసరాజ్యాల విషయంలో యీమాటలు యింతకంటె అధికమైన ప్రాముఖ్యంలో, యింతకంటె అధికమైన తీవ్రతతో వర్తిస్తాయి.

ప్రజానీకంలోని అత్యధిక భాగాల అనువర్తనను, ప్రేమను పొందిగాని, శాసనబద్ధమైన మార్గాలలోకాని, సత్యాగ్రహం ద్వారా గాని నిర్మాణ సంస్థలద్వారా గాని, లేక అన్ని పద్ధతులను ఒకేకాలంలో వుపయోగించాలిగాని, ఉజ్వలమైన సమిష్టి సమరాన్ని సాగించగల ఒకేఒక సంస్థ అతివిస్తృతమైన జాతీయ కాంగ్రెస్ మాత్రమే!

ఈ పరిస్థితులలో దేశభక్తి, చైతన్యం, క్రమశిక్షణ వున్న రైతులు, కార్మికులు, యితర వర్గాలవారు, అందరూకూడా_ఆ మహా సంస్థను శక్తివంతంగా చెయ్యడానికి దేశమంతటా అది వ్యాప్తమయ్యేటట్లు చెయ్యడానికి దానిఉన్నత శిఖరాలు ఆకాశాన్ని అంటేటట్లుగా గావించడానికి వారివారి శక్తులన్నిటినీ వినియోగించడం వారివిధి.

అయితే వర్గ సంస్థలకు రాజకీయాలు వుండాలనే పక్షంలో, ఏ విప్లవాత్మకమైన ప్రజానీక సంఘాలకైనా రాజకీయాలు తప్ప యితరమార్గం లేదనే పక్షంలో...వారు అంగీకరించగల రాజకీయాలు ఒక్క కాంగ్రెస్‌వి మాత్రమే.

సంపూర్ణ రాజకీయ ప్రతిఫలాలుండే వర్గ సమరాలకు అజాతీయ రాజకీయ వాతావరణ మధ్య రైతు కూలీ సంఘాలు విజయవంతంగా సాగించు కొనగలవు.

ఇంకే యితర వర్గ రాజకీయాలైనా వారిని మారుదారిలేని సందులోకిగాని, వ్యూహంలోకిగాని, రాజకీయంగా ఆత్మహత్యకుగాని దారి చూపుతాయి.

ఉదాహరణగా_ఏ సనాతన రాజభక్తుల రాజకీయాలనో అనుసరించడమంటే, గుడ్డిగా మారుదారిలేని సందులోకి ప్రవేశించడం అన్నమాట...అందువల్ల అఖరుకి భంగపాటు నిశ్చయం.

లేదా, కమ్యూనిస్టుపార్టీని అనుసరించడమంటే రాజకీయంగాను, వర్గీయంగాను ఆత్మహత్య, భంగపాటు అన్నమాట.

ఎందుచేతనంటే, కమ్యూనిస్టులు రైతులనుగాని, కార్మికులను గాని, లేక ఇద్దరినీకూడాగాని, జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించే జాతీయ సమరంలోకూడా జాతీయ కాంగ్రెస్‌కూ, అది సాగించే జాతీయ సమరానికీ వ్యతిరేకంగా పనిచెయ్యడమే జాతీయత అని విశ్వసించేటట్టు చేస్తారు.

అసలు, యింగ్లాండులోని కమ్యూనిస్టుపార్టీ అన్ని పార్టీల విశ్వాసాన్ని అమోదాన్ని సాధిస్తానని పాటుపడుతున్నా, యీనాటి వరకూ అటు ఇంగ్లాండులోని కూలీవర్గం యొక్కగాని, యితరవర్గాల యొక్కగాని విశ్వాసాన్ని అమోదాన్ని సంపాదించ లేకపోయింది. ఇటు వలసరాజ్యాలలో కూలీ వర్గం విశ్వాసాన్నైనా సంపాదించ లేకపోయింది.

ఈ విధంగా కమ్యూనిస్టుపార్టీని అనుసరిస్తున్న వర్గాలు ఒక గమ్యస్థానాన్ని చేరలేకుండా పోతున్నాయి. *

అయితే, తమ ప్రత్యేక ప్రయోజనాలపైన తక్షణ ఫలితాలున్నప్పుడు కాని, ప్రపంచ సంఘటనల కుల్ల దృక్పథాన్ని ప్రతిబింబించ వలసినప్పుడు గాని, స్వతంత్ర రాజకీయోద్దేశాలు రైతు, కూలీ సంఘాలు ప్రదర్శించ కూడదని దీని అర్థంకాదు

వారివారి స్వతంత్ర రాజకీయోద్దేశాలను నిశ్చయంగా ప్రదర్శించ వచ్చును.

కాని ఎట్టి విషమ పరిస్థితులలోనైనా జాతీయ కాంగ్రెస్ అవలంబిస్తున్న సామాన్య రాజకీయ ఆదర్శ ప్రాతిపదికలకైతేనేమి, దృక్పథానికైతేనేమి, ఆయా ప్రత్యేక వర్గాల రాజకీయోద్దేశాల ప్రదర్శనలు సరిపోయినట్లుగా బలపడుతూ వుండాలిగాని, వ్యతిరేకంగా వుండకూడదని దీని అర్థం.

అంతేకాదు; తన విజ్ఞాన దీప్తులను, తన అనుభవాలను పురస్కరించుకొని భారత స్వాతంత్ర్యాన్ని అతివేగంగా సంపాదించాలని

---

* మేము ఈ సంగతులన్నీ ఆలోచించే, రైతులలాగే కూలీలుకూడా కాంగ్రెస్ నాయకత్వాన్ని అనుసరించడం కూలీలకు శుభకరం, శ్రేయస్కరం అని సలహా యిచ్చాము. వారుకూడా "రైతు కాంగ్రెస్"ను వలెనే 'కార్మిక కాంగ్రెస్' (మజ్దూర్ కాంగ్రెస్)ను స్థాపించు కొనవచ్చును.

తమ సర్వస్వం నివేదనగా సమర్పించడానికి అశక్తులైన వర్గసంస్థలకేమీ ఆశ్రయ మివ్వరాదని సుస్పష్టమే!

కమ్యూనిస్టులు అలాంటి వారనడంలో అవగింజంతైనా సంశయం అక్కర లేదు. వారి "జాతీయ విద్రోహం" రైతులకు కార్మికులకు, వారి వారి వర్గ సంస్థలు నానా పక్ష వేదికలుగా కాకుండా వుంచు కొనమని చెప్తున్న ప్రజ్వలిత జాగృతి వాక్కు.

అందుచేతనే ఆనాడు ఆచార్యరంగా ప్రభృతులు "కిసాన్ కాంగ్రెసు (రైతు) కాంగ్రెస్‌కు మళ్లిపోయారు.

అది సార్థక నామంతో భారత జాతీయ కాంగ్రెసు భక్తి గానాలను ప్రదర్శిస్తూ ప్రతిజ్ఞ చేస్తున్నది. దానిలో కాంగ్రెస్ రాజకీయాలు తప్ప యే యితర రాజకీయాలకు స్థానంలేదు

కమ్యూనిస్టుపార్టీ యితర పార్టీల విశ్వాసాన్ని, ఆమోదాన్ని సంపాదించలేకపోవడం అటుంచి, కూలీవర్గంలోని అధిక సంఖ్యాకుల విశ్వాసాన్ని, ఆమోదాన్ని అయినా సంపాదించుకోలేకపోయింది — కాబట్టి దేశభక్తులమీద 'పంచమాంగదళము' అని నేరారోపణచేసి, ఆవిధంగా వారిని ప్రభుత్వానికి అప్పగించడము, సామ్రాజ్యవాద నియంతృత్వం సాగించే యుద్ధప్రయత్నాలకు సంపూర్ణ సహకారమివ్వడము మొదలైన పనులు చేసిన కమ్యూనిస్టులకుగాని, యిట్టి ధోరణితో పరోక్షంగాగాని, బహిరంగంగాగాని, సంబంధించిన యితరులకుగాని, యిందులో స్థానంలేదు; ఉండదుకూడా.

అందుచేతనే, పారిశ్రామికులను కమ్యూనిస్టు రాజకీయాలు బయటకు రా వీలులేని సందులోకిగాని, ప్రవేశపెడతాయని మావాదన.

అందుచేతనే కూలీవర్గంకూడా జాతీయ కాంగ్రెస్ రాజకీయ నాయకత్వాన్ని అనుసరించి జాతీయ కాంగ్రెస్ వేదికపైన తమ కృషిని సాగించడం వారికి శుభకరం, శ్రేయస్కరం అనీ, యితర కష్టజీవుల అభ్యుదయాన్ని ఆదరించినవారవుతారనీ, మేము సలహా యిచ్చాం.

* * *

ఇంతవరకూ విమర్శించిన విషయాల సారాంశం యిది: వారి వర్గ కృషిని, రాజకీయ చర్యలను జాతీయ కాంగ్రెస్‌యొక్క ఆశీక

పర్గ రాజకీయాలను సవరించుకుంటూ సాగించాలంటే, రైతులూ కూలీలూ "కాంగ్రెసు సంస్థ" లను పటిష్ఠం చెయ్యాలి.

ఈ విషయాలలో ఆంధ్ర నాటకూ, సాంప్రదాయాలకూ వారు అతీతంగా వుండాలి. నిజానికి యువజనుల గాంధీజీ, స్టాలిన్ లు ఉన్నంత నిష్పాక్షికంగానూ, ధైర్యంగానూ వుండాలి.

చూడండి: తనకూ సంపదలకూ సంబంధం లేకుండా వుంటేనే తన దేశంలోని ప్రజానీకానికి అభ్యుదయం వుంటుందని, తాను దేశానికి యింతకంటే అధికంగా సేవ చెయ్యగలననీ మహాత్ముడు గ్రహించాడు: మరుక్షణంలో యిరవై యేళ్ళ నిరంతర కృషి ఫలితం అయిన సబర్మతీ ఆశ్రమమును కాలగర్భంలో విలుప్తం చేసి వేశాడు.

1942 వరకూ లెనిన్ అడుగు జాడలలో నడుస్తూ, తన సర్వ శక్తులను అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ అభివృద్ధికీ, అభ్యుదయానికీ సంరక్షణకీ, వినియోగించిన స్టాలిన్, అంతర్జాతీయ సంస్థ లేకుండా వుంటేనే తాను కమ్యూనిస్టు పార్టీకి, సోవియట్ అభ్యుదయానికి, ఇంకా ఎక్కువగా సేవ చెయ్యగలనని గుర్తించిన వాడు ఆ మహా సంస్థను విడగొట్టేశాడు. అంతర్జాతీయ కమ్యూనిస్టు గీతాన్ని విసర్జించాలని ఆజ్ఞాపించాడు.

ఇదే విధంగా అమెరికాలో కూడా జరిగింది. అమెరికన్ రాజకీయాలలో మాదిరిగా పక్షానికి స్థానం లేదని, కమ్యూనిస్టు భావాలను సంఘంలో వ్యాప్తి చెయ్యడానికి ఆదర్శ ప్రాతిపదికల ప్రచారం వల్లనే గాని, యితర పక్షములపై దాడులు సాగించడం వల్ల కాదని, అమెరికన్ కమ్యూనిస్టు పార్టీ గుర్తించింది. తక్షణం తన్ను తాను విలుప్తం చేసుకుంది.

ఇలాగే, భారత దేశంలోని రైతు, కూలీ సంఘాలు కూడా చాలా అవసరమైన మార్పులు సాగించడానికి సిద్ధపడాలి. ఆ మార్పులు యెంత విప్లవకరంగా వున్నా సరే, నిన్నటి, నేటి ఆచారాలకు ఎంతగా వేరైవున్నా సరే!

ఇదే దృక్పథంలో ఆచార్య రంగా ప్రభృతులు రైతు, కూలీ సంఘాలు "ఎర్రజండా"ను (కమ్యూనిస్టు పార్టీ వారి జండా) వదలి వేసి "త్రివర్ణ పతాకము"ను (జాతీయ పతాకం) అవలంబించాలని సూచించారు.

ఆనాడు "కిసాన్ సభ" ఎర్రజండాను అవలంబించడంచేతనే, దానికీ, కాంగ్రెస్‌కూ మధ్య అతి విస్తృతమైన చీలిక ఏర్పడ్డది: ఆచార్య నరేంద్రదేవ్, పండిట్ నెహ్రూ మొదలైన వారి హృదయాలలో చాలా విషాదకరమైన అపార్థాలు కలిగాయి

జాతీయత వున్న రైతులకూ, వర్గచైతన్యంవున్న రైతు కూలీలకూ మధ్య వుండవలసిన సమైక్యతా భావాన్ని సాధించి, బలపరచడానికి "ఎర్రజండా" యేవిధంగానూ సహాయం చెయ్యలేదు.

ఈ విషయంలో పండిట్ నెహ్రూ ఇలా హెచ్చరించాడు:

"ఎర్రజండా అవలంబించడం వల్ల రైతుల హృదయాలలో కలతనూ, సందేహాన్నీ కలుగ జేస్తున్నారు; రైతు సంస్థలకూ జాతీయ కాంగ్రెస్‌కూ మధ్య విరోధ బీజాలను అది నాటుతుందేమో కూడా! తాను కాంగ్రెస్ కిస్తున్న భక్తి ప్రమాణానికీ, తన వర్గ సంస్థల కిస్తున్న భక్తి ప్రమాణానికి మధ్య, యేదో చెప్పలేని, నిశ్చయించలేని విరోధం మాత్రమే వుందనే అనుమానం రైతుల మనస్సులలో కలుగ వచ్చును."

1937 నుండి 1944 వరకూ మనకున్న అనుభవాల దృష్ట్యా పండిట్ నెహ్రూ ఆనాడు చెప్పిన మాటలు వేదవాక్యాలని నిశ్చయం!

అంతేకాదు; కమ్యూనిస్టు పార్టీ ప్రదర్శించిన "జాతీయ విద్రోహం", మన జాతీయ విప్లవోద్యమానికీ, జాతీయ స్వాతంత్ర్యోద్యమానికీ హానికరం అయినట్లుగా సోవియట్ రష్యన్ ప్రభుత్వం మన రాజకీయాలపై నెరపుతున్న ప్రాబల్యం యీ రెండు సంగతులకూ వున్న సంబంధంతో, కమ్యూనిస్టులు త్రివర్ణపతాకాన్ని వదలివేసి 'ఎర్రజండా' అవలంభించడం అన్న విషయాన్ని సమన్వయిస్తే, ఇలాగ చెయ్యడం జాతీయ సమైక్యతలో చీలికలు కలుగజెయ్యాలని కమ్యూనిస్టుపార్టీ ప్రయోగించిన మాయోపాయమనీ, మన జాతీయ చైతన్యాన్ని జాతీయ కాంగ్రెస్ పట్ల భక్తి గౌరవాలనూ విధ్వంసంచేసి, మనని సోవియట్ రష్యా రాజకీయ భావాల కొంగునకు ముడి గట్టాలనీ, కమ్యూనిస్టులు ప్రయోగించిన మాయోపాయాలలో యిది ఒక భాగం అనీ...యీనాడు మనం స్పష్టంగా గ్రహించ వచ్చును.

"ఎర్రజండా" కమ్యూనిస్టుపార్టీ పతాకం. దానిని మన వర్గ సంస్థలు అనుసరించ వచ్చునంటే, కమ్యూనిస్టు పార్టీలోని ముఖ్యం

కాని పిచ్చిభావాలనూ, జాతీయ వ్యతిరేక దురభిమానాలనూ; యితర పార్టీ దురభిమానాలనూ, తృణ్ణగొట్టకుంటే, ఆపార్టీని దాని ఆదర్శ ప్రాతిపదికలను తాము భంగపరచవచ్చునని తప్పుడుభావం ప్రజానీకంలో కలుగవచ్చు.

కమ్యూనిస్టుపార్టీ చెప్తున్నట్లు, "ఎర్రజండా" అంతర్జాతీయ చిహ్నం కాని అంతర్జాతీయ సానుభూతిని మనజాతీయత పట్ల మన మనస్సు భక్తి గౌరవాలకు ప్రతికూలంగా కొల్లగొట్టే ప్రమాదంవున్నది. ఈ అంతర్జాతీయ చిహ్నంపట్ల మనం గౌరవాన్ని చూపినా, అలాంటి ప్రమాదం రావచ్చును

అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ గీతానికి వేరైన జాతీయ గీతాన్నీ, అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీకి, దానిశాఖలకు చిహ్నమైన "ఎర్రజండా"కు వేరైన జాతీయ పతాకాన్నీ అవలంబించిన సోవియట్ రష్యా ఆ విధంగా తన జాతీయతకు ప్రాధాన్యము యిచ్చింది; తన జాతి దృష్టిని వారి జాతీయ విధుల మీదకు కేంద్రీకరించజేసింది.

అదే విధంగా భారత ప్రజకూడా తమ దృష్టిని జాతీయవిధుల మీదనే ముఖ్యంగా వుంచుకోవడం విధి

భారత జాతీయత పట్లా, సమైక్య జాతీయ నాయకత్వం పట్లా, భక్తి గౌరవాలను ప్రదర్శించవలసినది సూచించే గుర్తు వారి జాతీయ పతాకం; దానినే వారు అవలంబించాలి *

అందుచేతనే, రైతులూ, కార్మికులూ, "ఎర్రజండా"ను వదిలివేసి, జాతీయ పతాకాన్ని అవలంబించాలని ఆచార్య రంగా సలహా యిచ్చారు.

---

* ఇచ్చట జ్ఞప్తియందుంచుకోవలసిన విషయం ఒకటి: దక్షిణ భారత కార్మికుల కోసం తన ప్రాణాలను బలియిచ్చిన యస్. జి. రామస్వామి గురిజాలాల్ నాయకత్వంలో కోయంబత్తూరు ట్రేడ్ యూనియనులూ, సర్దార్ పటేల్, జి నందా, యిద్దరి నాయకత్వంలో అహమ్మదాబాద్ కార్మికుల ట్రేడ్ యూనియన్, అఖిలాండీ జాతీయ పతాకాన్నే అనుసరించాయి; వారు 'ఎర్రజండా'ను అవలంబించ నిరాకరించారు 1942 - 44 ల లోని జాతీయ పరీక్షను ట్రేడ్ యూనియన్లు సమర్పించిన నివేదన భాగానికి వీరిదే అగ్రతాంబూలం!

రాజకీయాలలో మన మాతృ సంస్థ కాంగ్రెస్; దాని రాజకీయముల పట్లా, దాని పోరాటముల పట్లా, మనకున్న పూచీని సంపూర్ణంగా గ్రహించి, ఆపూచీ దృష్ట్యా మనవర్గ సంస్థలను నిర్మించుకొని వాటిని నడిపించి, మన కష్టనిష్ఠూరముల నుండి విముక్తి పొందడానికి, ఇంతకంటె అధిక శ్రేయస్సు నందడానికి పోరాటములను సాగించాలి యిలా సాగించేటప్పుడు మన అనుభవాలను దృష్టిలో నుంచుకోవాలి.

అంటే రైతులు సమైక్య జాతీయ రంగానికి యే విధంగానూ దెబ్బ తగలకుండా, ఆ సమైక్య జాతీయ రంగాన్ని చిత్రించడంలో, పోషించడంలో, ఉపయోగించడంలో, కాంగ్రెసు నిర్వహిస్తున్న ప్రముఖ రాజకీయ పాత్రకు భంగంరాకుండా చూచుకుంటూ, సముచితమైన నిరోధములతో తక్షణావసరముల కోసం మాత్రం ఆందోళన చెయ్యాలి చర్యలను సాగించాలి.

ఈ విధమైన నిరోధాలతో వారు కృషి చేస్తే జాతీయాశయముల పురోభివృద్ధి నిశ్చయంగా వుంటుంది. ఆవిధంగా కార్మికప్రజా కష్ట జీవులూ వేటికంటే అధికంగా రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలను కొద్దికాలంలోనే సంపాదించుకోడానికి సాధ్యమౌతుంది

అందుచేత రైతుకూలీ ప్రజారాజ్య స్థాపన కూడా సాధ్యమౌతుంది.

అయిదు సంవత్సరాల యుద్ధకాలంలో రైతుకూలీ వర్గ సంస్థలు తప్పని సరిగా అనుసరించిన విధానంలో యీ విధానం ఎలాసరిపోయి వుంటుందో మనం చూశాం.

* * *

విప్లవ వ్యతిరేక ధోరణిలో తన విధానాన్ని కమ్యూనిస్టుపార్టీ సాగిస్తున్నా నాడైనా అతిధైర్యంగా పారిశ్రామిక సమ్మెలను సాగించలేక పోయింది. ఇందుకు మొదటి కారణం భారత రక్షణ చట్టంపేరిట అధికార రీత్యా ప్రవేశ పెట్టబడిన దమననీతి ట్రేడ్ యూనియన్ నాయకులను, అందులో సభ్యులుగా నున్న కార్మికులను, భయపెట్టేటట్టు చేసింది. రెండో కారణం పారిశ్రామిక రంగంలో శాంతిగా నుండేటట్టు చూడటం కోసం కార్మికుల కోరికలను, వారింకా వాటిని సగం చెప్తుండగానే, ప్రభుత్వంఆమోదించేది. మూడో కారణంభారత

కూలీ వర్గంలో అనేకమంది తమ తక్షణావసరాలు తృప్తి పొందగానే, కమ్యూనిస్టులను అనుసరించి, సమ్మెలను సాగించి జైళ్ళలోకి వెళ్లేటందుకు తయారుగా లేరు.

అందు చేతనే, కొన్ని వందల మంది వామ పక్షీయులనో జైలులో వుంచి కార్మిక రంగంలో శాంతిని ప్రభుత్వం కాపాడుకో గలిగింది.

ఇక రాయిస్టులూ, కమ్యూనిస్టులూ, యుద్ధానుకూల ధోరణిని ప్రారంభించిన నాటినుండీ ఆడగ నక్కరలేదు ప్రభుత్వానికి సమ్మెల భయం లవలేశం కూడా లేక పోయింది. ప్రభుత్వం, కార్మిక, పారి శ్రామిక వర్గాలు ఒక సమిష్టి కుటుంబం లాగా చక్కగా, సుఖంగా కాలక్షేపం చేస్తున్నాయి.

కార్మికరంగంలోని శాంతియుత పరిస్థితులను కమ్యూనిస్టులు యీవిధంగా వ్యాఖ్యానిస్తారు; "ప్రభుత్వ యుద్ధ యత్నాలు కష్టజీవులందరికీ పనికివచ్చే విషయం ప్రాముఖ్యమూ, తక్షణావసరం వున్న విషయంకూడాను. అందుచేత, వ్యవసాయిక, కార్మిక రంగాలలో రైతులూ, కార్మికులూ తమతమ దైనిక కష్టనిష్ఠూరాలను నివారించుకోడానికికూడా, సమ్మెలు చెయ్యకూడదు. దేశీయరంగంలో కష్టజీవులు శాంతిగీతాలనే ఆలాపించాలి" అని.

అయితే, భారతదేశానికి, భారత ప్రజానీకానికి, స్వరాజ్యం సంపాదించడం అన్నిటికంటే అధికమైన ప్రాముఖ్యతవున్న విషయంకీ అన్నిటికంటే సత్వరంగా కావలసిన అవసరం అన్నిటికన్నా ప్రియమైనదికూడాను.

అందు చేత మా సూచన

జాతీయ విప్లవ సమరాన్ని బలపరచడానికే కాకుండా అది యే విధంగానూ బలహీనమైపోకుండా చూడడానికి కూడా, రైతు కూలీ వర్గాల తక్షణవర్గ ప్రయోజనాలకోసం మాత్రమే, సత్యాగ్రహం, సమ్మెలు అనే ఆయుధాలను వుపయోగించడానికి రైతులూ, కార్మికులూ సంసిద్ధులై యుండాలి.

———

# రైతాంగ సమైక్యత

# 11

ఇక, రైతులలోని విభిన్నపక్షాల సమస్యలను పరిశీలిద్దాం.

1936 లో సమావేశమైన తెలుగు రైతు మహాసభలో భారత కమ్యూనిస్టులు కూడా లెనిన్ చెప్పిన విభజనోపాయ సిద్ధాంతాన్ని చిలక పలుకులలాగ వల్లెవేయడానికి ప్రారంభించారు. అయితే, రైతాంగానికి ఆగర్భశత్రువులైన జమీందారులమీదా, షాహుకారులమీదా విజయవంతంగా పోరాటం సాగించాలంటే రైతాంగాన్ని బీద మధ్య, ధనిక వర్గాలుగా విభజిస్తే లాభంలేదని, రైతాంగపు సమైక్యతను రక్షించాలని, కొద్దికాలంలోనే గ్రహించారు.

అసలు జరిగిన విషయం యిది:

రైతు ఉద్యమాన్ని స్థాపించి, పెంచి, తీర్చిదిద్ది, అనంతమైన అనుభవాన్ని సంపాదించిన ఆచార్య రంగా మొదలైన రైతు నాయకులు సమైక్య రైతు రంగాన్ని స్థాపించి బలపరచడానికి చేసిన ప్రయత్నాలు సమంజసమైనవని ఆనాడు కమ్యూనిస్టులు గ్రహించలేకపోయారు

సరే, కమ్యూనిస్టు సోదరులు చేస్తున్న పనులకు తగిన ఫలితాన్ని అందుకు తగిన భంగపాటును, వారే పొందుతారని, రైతు నాయకులు వారిని యేవిధంగానూ అణచలేదు.

కమ్యూనిస్టుల ఒత్తిడివల్ల తెలుగు రైతు కాంగ్రెస్ నియమావళిలో ఆ సంస్థ ముఖ్యంగా బీద, మధ్య తరగతుల సౌభాగ్యంకోసం కృషి చేస్తుందనే నియమాన్ని చేర్చారు.

కాని, ఆ మరు సంవత్సరం, పాపం, యీ కమ్యూనిస్టులు రైతు సంస్థలో సభ్యులను చేర్పించడానికి గ్రామాలలోకి వెళ్ళేసరికి ఆ బీద, మధ్య తరగతి రైతులే తమ సమైక్య రైతు రంగాన్ని బీదా, గొప్పా అనే విభేదాలతో విభజించే కమ్యూనిస్టులపట్ల తీవ్రమైన అసమ్మతినీ, ప్రతికూలతనూ ప్రదర్శించారు: వారిని దుయ్యబట్టుకున్నారు.

అందుచేత లెనిన్ చెప్పిన విభజనోపాయపు వాసనవేస్తున్న యీ నియమాన్ని రైతుకాంగ్రెస్ వదలివెయ్యాలని కమ్యూనిస్టులే

స్వామ్యం తొందరపడ్డారు. రైతుకాంగ్రెస్ నాయకులుకూడా ఆనందంతో అందుకు అంగీకరించారు.

సమైక్యరంగ నిర్మాణానికి, దాని పరిపోషణకి, దానిని బలీయంగా చెయ్యడానికి, ఉన్న ఆవశ్యకత ప్రాముఖ్యం, జాతీయ రంగంలోకన్నా, కిసాన్‌రంగంలోనే అధికం. జాతీయ విప్లవ పోరాటాన్ని ధరించే రెండు స్కంధములు రైతుకూలీ రంగములు. అందు చేతనే మన జాతీయ స్వాతంత్ర్యాన్ని ఆకాంక్షించేవారెవరూ లెనిన్ బోధించిన వర్గ విభజనోపాయాన్ని ఆయా రంగాలలో ప్రవేశపెట్టడానికి అంగీకరించరు.

రైతు ప్రజానీకాన్ని రైతు సంస్థలలో సభ్యులుగా చేర్చడం, వారి కనీసపు కోర్కెలను సూత్రాలుగా నిర్ణయం చేసి ప్రకటించడం, సమావేశాలలో వ్యక్తిగతంగానూ, సమిష్టిగానూ ప్రచారం చేసి రైతాంగంలోని చైతన్యాన్ని మేల్కొల్పడం యివీ రైతుసమైక్య రంగానికి మార్గం వేసే విధానం. మొట్టమొదట యీ ఆధారం లేకుండా అనేక రైతు సత్యాగ్రహోద్యమాలను విజయవంతంగా కొనసాగించిన రైతు నాయకులు కూడా వ్యష్టి ప్రయోజనాలతో వర్గ సమరాన్ని ప్రారంభించడానికి జంకుతారు.

అనేక సార్లు రైతునాయకులు చేసే అన్ని ప్రయత్నాలకూ కూడా లొంగకుండా వుండేవారు కొంతమంది ధనిక రైతులూ, కొందరు సమయానుకూలంగా ప్రవర్తించే రైతులూను, వారు భూస్వాములతో కలిసి పోయేవారు, లేదా వారియెడల నున్నభక్తి ప్రమాణాలను త్రెంచుకోడానికి నిరాకరించే వారు

అయితే రైతు నాయకులు ధనిక రైతులను తమ పక్షంలోకి తెచ్చుకోవాలని మనస్ఫూర్తిగా చేసే ప్రయత్నాలు నిష్ఫలమైనా మిగిలిన రైతుల నైతిక ధృతిని నూరింతలు చేసేవి.

రైతు వర్గానికి వ్యతిరేకంగా వుపయోగించడానికి కమ్యూనిస్టులు దాచిన అన్ని అస్త్రాలలోనూ లెనిన్ స్టాలిన్లు చాలా కాలం క్రిందట ఉపదేశించిన యీ విభజనోపాయం నాగాస్త్రం.

కాని యీవుపాయాన్ని రైతు లనుసరిస్తే యే రైతు సత్యాగ్రహోద్యమంలోనూ వారు విజయాన్ని పొందలేరు.

ఈ నాడే తక్షణమే రైతులను విభజించడం అనీ ఎప్పుడైనా సరే అతిపేద రైతులను యింకా అధికంగా విప్లవోద్యమంలోకి తీసుకో వలసిన అవసరాన్ని నొక్కి చెప్పడానికే యీ విధంగా చెప్తున్నామనీ, కమ్యూనిస్టులు అనవచ్చును.

వారు చెప్పినదే నిజమైతే యీనాడు ధనిక మధ్యమ రైతులు వారి స్వలాభం కోసం మాత్రమే రైతు సంస్థలలో వున్నారని చెప్పి ఆవిధంగా సంస్థను వారు కొల్లగొడుతున్నారనే సూచనను అందియ్య వలసిన అవసరం లేదే!

కమ్యూనిస్టుల సంగతి వారెవరైనా సరే, యీ విధంగా అతి ప్రమాదకరమైన మార్గాలలో రైతులకు వ్యతిరేకంగా కమ్యూనిస్టు తంత్రాలను ఉపయోగిస్తూ, యీనాడే అభివృద్ధిచెంది ఒక నిర్దిష్ట స్వరూపాన్ని పొందుతున్న వలస రాజ్యాల రైతు వర్గాన్ని కల్పించ రైతుల పురోభివృద్ధికి హానికరం ప్రత్యేక వర్గ సంస్థలనూ, వర్గ ఆశయ ములనూ కలిగిన ఒక బలీయమైన ఆత్మ చైతన్యమున్న వర్గంగా అది అభివృద్ధి చెందలేదు.

అందుచేత, రైతులు కమ్యూనిస్టుల విభజనోపాయానికి లొంగి పోకూడదు

అంతేకాక రైతురంగంలోకి అన్ని శ్రేణులు, అన్ని పక్షాల సమైక్యత కోసం ప్రయత్నించడం, ప్రపంచ ధనిక వాదానికి వ్యతి రేకంగా సాగించబడుతున్న సమరంలో రైతు వర్గం ఒక అత్యంత శక్తివంతమైన, విప్లవ దాయకమైన, తిరుగులేని ఆయుధంగా సుంచు పట్టుగా దానిని నిర్మించడం, ప్రతి నిష్కళంకమైన రైతుకి, రైతు రక్షక యోధునికీ విధి.

జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించడం రైతుల మొదటి లక్ష్యం మాత్రమే; ప్రపంచ ధనిక వాదంతో, వలస రాజ్యాల ధనిక వాదంతో, ప్రపంచంలో వివిధ దేశాలలో దాని కున్న బజార్లతో, వాటి సమానంగా లేని మారకం విధానంతో, పోరాటానికి యిది విఘ్నేశ్వర పూజ మాత్రమే !

పారిశ్రామిక వాదుల కోశాగారాలలోకీ, వర్తకుల కోశా గారాలలోకీ, నాగరికుల కోశాగారాలలోకీ ప్రవహించి పోతున్న ప్రపంచ కర్షకుల అధికోత్పత్తి ప్రవాహాన్ని సంకుచిత పరచడం,

సంపూర్ణంగా నిరోధించడం, ప్రపంచ సంపదను యింకా అధికంగా తాము సమకూర్చుకోవడం, యికన్ని రైతులు తమ సమైక్య రంగాన్ని సక్రమంగా నిర్మించుకోవడం మీద ఆధారపడి వున్నాయి.

రైతులు కమ్యూనిస్టు శంత్రాలకు లోబడిపోయి. విభజించబడుటకూ తుదకు విలయించబడుటకూ అంగీకరిస్తే—

ధనిక వాదానికీ, దాని అనుచరులకూ, కొల్లగొట్టే వాదనలకూ వ్యతిరేకంగా వారు తమ పోరాటాన్ని సాగించలేరు. అందువల్ల, వలసరాజ్య ధనిక వాదం రైతు శ్రేణుల నుండి కొన్ని భాగాలను తన మిత్రులుగా సంపాదించుకో గలదు. అదే విధంగా కూలీవర్గం కూడా రైతు శ్రేణులనుండి కొన్ని భాగాలను "మిత్రులు"గా కలిపించివేసి; కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో కూలీ వర్గ నియంతృత్వాన్ని స్థాపించుకో వచ్చును

నాగరిక వర్గాలూ, పారిశ్రామిక, వర్తక వర్గాలూ యింత కంటె మంచి మార్గాల నుపయోగించి, మేం రకం పంటలను అధికంగా పండించడం కోసం రైతులను యింకా అధికంగా కష్టపడి పనిచేయ్యమని ఒత్తిడి చేస్తారు. ఆవిధంగా, తారతమ్యం లేకుండా గాని, రోజురోజుకూ అభివృద్ధి పంచుతున్న "అధిక విలువ"ను వుత్పత్తి చెయ్యమంటారు. రాజకీయ రంగంలో నైతే నేమి, ఆర్థిక రంగంలో నైతే నేమి, తమ ప్రత్యేక లాభాలకోసం రైతులను సదా మైన పురోగమనం లేకుండా చేస్తారు.

రష్యాలో కర్షకులు లెనిన్ స్టాలిన్‌ల మాయోపాయాలకు లోబడిపోయి తమ వర్గాన్ని విభజించ నిచ్చుటకు అంగీకరించుటచేతనే అనాడు వారి నాయకత్వం పోయింది. యీ నాడు ప్రభుత్వంలో, యే స్థానం లేదు; సంఘంలో నీచాతి నీచమైన స్థానాన్ని మాత్రమే ఆక్రమించ గలిగారు!

పాపం, వారి స్థితి అంత నీచంగా వుంది.

నేటి స్వతంత్ర భారత వర్షంలో...

యుద్ధకాలంలో భారత రైతాంగాన్ని సేవించడానికీ, వ్యవసాయోత్పత్తికి అధిక ధరలను అరికించి, జాతీయ ధాన్య సంగ్రహాలను (రిజర్వ్) యితర వ్యవసాయోత్పత్తి సంగ్రహాలను (రిజర్వులను అంటే విలువ కొట్లను) జాతీయ ప్రభుత్వం స్థాపించాలి.

అంతేకాదు: యుద్ధసమయాలలో రైతులు ఉపయోగించడానికి సముచితమైన రీతిలో, అత్యధిక పరిమాణంలో, నిర్ణీత విధానంలో, సహకార ప్రాతిపదికమీద ధాన్యాగారాలనూ, ధాన్య సమీకరణ గృహాలనూ నిర్మించి సాగించాలి.

ఈవిధంగా నిర్వహించేటట్లు జాతీయ ప్రభుత్వాన్ని ప్రోత్సహించడానికి తగినట్లు రైతులు తమ రాజకీయ శక్తినీ సమైక్యతనూ, నాయకత్వాన్నీ యిప్పటికన్నా అధికంగా అభివృద్ధి చేసుకోవాలంటే, సమైక్య రైతురంగం అవసరం.

రైతుమీద అభిమానమున్న [illegible] భారత స్వతంత్ర ప్రభుత్వం యేర్పడ్డాక, అదికూడా యిదేవిధంగా యితర రైతు దేశాలతో కలసి అంతర్జాతీయ సహకార ప్రాతిపదికమీద పంటలు పండించడానికి తగిన నిర్ణీత విధానాన్నీ, పండించిన పంటలు అమ్మడానికీ వ్యవసాయోత్పత్తిని ఉపయోగించడానికీ, అన్ని దేశాలలో విస్తృతమైన విధానాలను ప్రారంభించవచ్చును.

భారత వర్షంలోగాని, విదేశాలలోగాని, వ్యవసాయంలో పాల్గొనే కార్మికులు [illegible] రైతుల వ్యవసాయోత్పత్తికి తగినంత [illegible]. యితర వర్గాల వారు యెంత అధికంగా ఆదాయాన్ని సంపాదించి యెంత అధికంగా సాంఘిక సౌకర్యాలను పొందుతున్నారో, అదేవిధంగా యీ విధానాలను ప్రారంభించిననాడు రైతులుకూడా అంత అధికంగా ఆదాయాన్ని సంపాదించగలరు; అంత అధికంగానే సాంఘిక సౌకర్యాలను పొందగలరు.

కాని, యిలా జరగాలంటే నేడు రైతురంగంలో సమైక్యత వుండడం అవసరం: తప్పనిసరియైన మొదటి షరతు.

అయితే, ధనిక రైతులు బీద, మధ్య రైతులను కొల్లగొట్టాలని కాదు మా ఉద్దేశం: మేము, గైరహాజరు భూస్వామ్య విధానం" (Absentee land-lordism) వుండాలని వాదించడంలేదు.

రైతుయొక్క కౌలు హక్కులు నిర్ణయించడానికి, కొల్లగొట్టు కొనే విధానాన్ని నివారించడానికి శాసనాలను ప్రభుత్వం అవశ్యం తయారుచేయ్యాలనే మా వాదన. ధనిక రైతుల కౌలుదారీలో వున్న చిన్న రైతులను సంరక్షించవడం చాలా ముఖ్యమనే మా వాదన.

రైతు శ్రేయస్సునే దృష్టిలో నుంచుకొని ఆర్థిక శాస్త్రవేత్తలు నిర్ణయించిన భూమికంటె అధికంకాని సేద్యపు భూములు మాత్రమే వున్న మధ్య తరగతి రైతు, పంటల నిర్ణీత విధానం గురించి భూసారం క్షీణించడం గురించి, ఎరువుల గురించి, అమ్మకంలో సహకార విధానం గురించీ, వున్న జాతీయ శాసనాలను అతిక్రమించనంత కాలం, నిరాటంకంగా తన భూములను తాను సేద్యం చేసుకొన వచ్చును

సమిష్టి వ్యవసాయం లోకి రావడం గాని, రాకుండుట గాని, అతని సంపూర్ణ ఆమోదం మీదనే జరగాలి అంటే, సమిష్టి వ్యవసాయంలోకి ప్రవేశం స్వచ్ఛందంగా వుండాలన్న మాట.

ఇక భూములున్నవారైనా సరే, లేనివారైనా సరే; మీరు రైతుల గూర్చి ప్రభుత్వం శాసనసభ ద్వారా, రాజ్యశాసనముల ద్వారా చెయ్యగలంత అధిక శ్రేయస్సును చేసేటట్లు చూచే జాతీయ వాదులైతే, సామ్యవాదులైతే సేద్యం లేని భూములను అన్నిటినీ మీరు సమిష్టి వ్యవసాయానికి ప్రత్యేకించడం, వీరందరికీ స్వల్పకాలాల్లో సంపూర్ణమైన వృత్తికీ, ఆదాయమునకూ, పోషణకు హామీ ఉండేటట్లు చూడడం ప్రభుత్వం పూనీ

భూములు లేని రైతులు, వ్యవసాయ కార్మికుల సంఘాలను నిర్మించడం రైతు సమైక్య రంగానికి అనుగుణంగా వుంటుంది. ఇలాంటి సంఘాలు భూములున్న రైతుల పట్ల భూములు లేని రైతులకున్న కష్ట నిష్టూరాలను తగువిధంగా ప్రకటిస్తాయి. వాటివాటి తగాయిదాలను పరిష్కరించడానికి. సమాధానాలను కుదర్చడానికి క్షేత్రంలోనూ, సామరస్య సంఘాలుంటాయి; పరస్పర సంబంధాలను కల్పించే సంఘాలుంటాయి.

వ్యవసాయకోత్పత్తి యొక్క కనీసపు ధరలను అనుసరించి, భూములు లేని రైతులకు కనీసం కూలీని నిర్ణయించడం స్వతంత్ర భారత దేశంలోని స్వతంత్ర ప్రభుత్వం పూనీ.

రైతు సమైక్యరంగ అవసరాన్ని సంపూర్ణంగా గ్రహించే కమ్యూనిస్టుల విభజనోపాయాన్ని రైతుకాంగ్రెసు ఎదుర్కొంటున్నది

ప్రావీణ్యం ఉన్న పారిశ్రామికులకూ, లేని పారిశ్రామికులకూ మధ్యను ఎగుమతి పరిశ్రమల, దిగుమతి పరిశ్రమల కార్మికుల మధ్యను

ప్రయోజనాలలో వ్యత్యాసం విరోధం వున్నాయి. అలాగే భూము లున్న రైతు ప్రయోజనాలకూ భూమిలేని రైతు ప్రయోజనాలకూ మధ్య వ్యత్యాసం, విరోధం, వుండవచ్చు.

కాని మేము గుర్తించినట్లు, వారు అనుష్టిస్తున్నట్లు, వున్న పక్షాల సమైక్య రైతు రంగానికి యీ విరోధాలు యేవిధంగానూ హానికరం కావు. ఆయా తరగతుల సమైక్య రంగానికి భంగం రాకుండా ఆ విరోధాలను వారితో వారు సామరస్యంతో పరిష్కరించుకో వచ్చును. అందుచేత తమ శక్తులనూ వినియోగించి, ఒక నిశ్చయంతో జాతీయ శ్రేణులలోనూ, రైతు శ్రేణులలోనూ, సమైక్య రంగాన్ని నిర్మించడం రైతు శక్తి యోధులందరికీ విధి అని మా హెచ్చరిక !

ఇంకో సంగతి...

అశేష భారత రైతు రంగాన్ని సేవించడానికి, అన్ని కేంద్రాల లోనూ పనిచెయ్యడానికి, సక్రమ శిక్షణ పడసిన, సుబోధితులైన స్వచ్ఛంద భట సంఘాలు యీనాడు ఎంతో అవసరం

కొల్లగొట్టే వర్గాల అన్యాయమైన, శాసనబద్ధం కాని, దమన నీతినీ, సాంఘిక దౌర్జన్యాన్నీ, అరికట్టడానికి మా [illegible] వీరు.

కమ్యూనిస్టులూ, యితర రైతు వ్యతిరేకశక్తులూ చేసే విధ్వంసక చర్యలనూ, దండగాలను, అరికట్టడానికి వీరు ముఖ్యంగా అవసరం

ప్రతి గ్రామరైతు సంఘానికీ ఒక గ్రామరైతు సేవకసంఘం ఉండాలి. వాటితో వ్యాయామ సంఘాలను నిర్మించి ఒలింపిక్ ఆట లను, పందెములను ప్రోత్సహించాలి: పల్లెటూరి ఆటలను (Rural-sports) ని అభివృద్ధిచెయ్యాలి. రైతుసంస్థలలాగే గ్రామ తాలీమ్ ఖానాలను, గ్రామ స్వచ్ఛంద సేవక సంఘాలను జిల్లావారీగా రాష్ట్రీయ సంబంధాలపైన ఏర్పడాలి. తుదకు ఒక "అఖిలభారత పల్లెవాస సంఘం" వుండాలి జాతీయ కాంగ్రెస్ స్థాపించే స్వచ్ఛంద సేవక సంఘాలతో యివి సంబంధం వుంచుకొనేటట్లు యేర్పాటు చేయ వచ్చును.

ఒక విషయాన్ని మాత్రం సర్వకాల సర్వావస్థలలోనూ మనం జ్ఞాపకం వుంచుకోవాలి: రైతులు పరాకు చిత్తగించి, నిద్రించకూడదు.

రైతులు మేల్కొని జాగ్రత్తపడితే సంపూర్ణ వర్గ చైతన్యాన్ని పొందిన సంస్థలను, స్వచ్ఛంద సేవకసంఘాలను, నిర్మించుకో గలిగితే, ఆనాడు రష్యాలో జరిగినట్లే యీనాడు యిక్కడకూడా, నిరాటం కంగా, నిస్సంకోచంగా, జరుగుతుంది

రైతాంగానికి యిదే మా హెచ్చరిక!

---

# సమీక్ష

## 12

ఇంతవరకూ భారత కమ్యూనిస్టుల, యితర దేశాల కమ్యూనిస్టుల సిద్ధాంతాలను, ప్రవచనాలను, మూలసూత్రాలను, విపులంగా పరిశీలించాం: వారి ఆచారాలకూ, చర్యలకూ, "కారణం యిది, కార్యం యిది" అని సంబంధాన్ని నిరూపించుటకు యత్నించాం.

ఇక, యిప్పటి పరిశీలనా ఫలితాలలోని ప్రముఖ పంక్తులను మరొకసారి ఉద్ఘాటిస్తున్నాం.

కమ్యూనిస్టుల చేతులలో కీలుబొమ్మగా తయారయిన "కిసాన్ సభ" రైతుల సత్యమైన ప్రయోజనాలకు, వారి శ్రేయస్సునకు, వారి పురోగమనానికి, ఉపకరించదనీ, వారికి ప్రాతినిధ్యం వహించదనీ, సుస్పష్టమే!

అంతేకాదు: "జాతీయ దాస్య శృంఖలాల విముక్తికి విద్రోహం" అని అనుటకు "కిసాన్ సభ" పర్యాయపదం అయిపోయింది

1942 ఆగస్టులో ప్రభుత్వం కాంగ్రెస్‌పై యెదురు దాడులను జరపడానికి ముందు నాందీగా భావి విధానాన్ని సూచిస్తూ, సుప్రసిద్ధమైన "పకల్ సర్క్యులర్" (Puckle Circnlar)ని జారీ చేసింది. అందులో "కిసాన్ సభ"ను యుద్ధానుకూలమైన మిత్ర

సంఘాల పట్టికలో చేర్చింది. అలాంటి "కిసాన్‌సభ" తమదేనని చెప్పుకోడానికి గాని, దానినా విధంగా నిర్మించి ప్రపంచం ముందు ప్రదర్శించడానికి గాని సిగ్గూలజ్జా వదలివేశారు కమ్యూనిస్టులు.

అంతేకాదు; భారత రైతాంగాన్ని జాతీయ సమరంనుండి వేరైపొమ్మనీ, "విద్రోహులైన" జాతీయ రైతులను ఏకాకులుగా చెయ్యాలనీ ప్రేరేపించి ఆవిధంగా రైతుసంస్థలలో తమకు ప్రతికూలంగా వున్నవారిని యీవిధంగా పోలీస్ లాఠీలకూ, తుపాకి గుండ్లకూ, కారాగారాలకూ, యెరచేసి బలియిచ్చేటంత హీనస్థితికి వచ్చింది కిసాన్ సభా కమ్యూనిస్టుపార్టీ.

ఏసంస్థ అయినా యింతకంటె నీచానికి పాల్పడి... యింతకంటె అధికంగా తన్ను తానే నికృష్టపరచుకోగలదా?

ఈవిధంగా తయారయిన "కిసాన్‌సభ"తో ఎవరైనా సంబంధం వుంచుకుంటారా?

అందుచేతనే కాంగ్రెస్‌ప్రియులైన రైతుసేవకులు యీసంస్థతో సంబంధాలను త్రెంచుకున్నారు; యీ పేరును వదలి వేశారు. నూటికి నూరుపాళ్లు నిజమైన జాతీయతవున్న ఆశాపూరితమైన "కిసాన్ కాంగ్రెస్" (రైతు కాంగ్రెస్) అన్న పేరును ఉపలంభించారు.

భారత జాతి సమరానికి విప్లవోద్రేకానికి ఆత్మార్పణకు వెలిగిపోతున్న గుర్తు మన జాతీయ కాంగ్రెస్. ఆమహా సంస్థ పట్లా దాని జాతీయాశయాల పట్లా రైతుల భక్తిగౌరవాలకు ప్రమాణం యీపేరు.

ఆత్మశక్తినిచ్చే ఆపేరుతోనే రైతు సంస్థ మొదటి సమావేశం లక్నోలో జరిగింది.

రెండవ సమావేశంలో అధ్యక్షులైన ఆచార్య రంగా, అధ్యక్ష పీఠంనుండి జాతీయ కాంగ్రెసుకి భక్తి గౌరవాలను ప్రదర్శించమనీ, జోహార్లు అర్పించమనీ విశాల భారత రైతాంగాన్ని ముక్తకంఠంతో ఉద్బోధించారు.

ఫెయిజ్‌పూర్‌లో సమావేశమైన 'కిసాన్ కాంగ్రెసు' అధ్యక్ష పీఠంనుండి వారు మహాత్ముడు మొదటి రైతు, రాజనీతికి విశారదుడనీ రైతు వుద్యమ మహాసౌధానికి మొదటి శిల్పి అనీ వుద్ఘాటించి జేజేలు పెట్టారు.

నాటికి నూటపాళ్లు నిజమైన రైతు పక్షపు యోధులు, భారత జాతీయ స్వాతంత్ర్యాశయముల పట్ల నిండు విశ్వాసం వున్నవారు, భారత జాతీయతకు అగ్నిపరీక్షా దినాలలో (అంటే 1942 నుండి 1945 వరకూ) భక్తి గౌరవాలతో జాతీయతకు జోహార్లను అర్పించినవారు, భారతజాతీయాశయాలలో ఉన్నతమార్గాలలోనే వర్తించునట్లు రైతాంగాన్ని ప్రోత్సహించిన వారు రైతుకూలీ ప్రజారాజ్యపు ప్రాతిపదిక మీద విశ్వాసముంచి, యీ పారిశ్రామిక వర్గాలు మూడింటిలో యే వొక్క వర్గంయొక్క నియంతృత్వాన్నైనా సరే; ప్రతిఘటించే వారు; వీరందరూ యికమీదట తాము "కిసాన్ సభా" వాదుల మని చెప్పుకోరు; సగర్వంగా "కిసాన్ కాంగ్రెస్" (రైతు కాంగ్రెస్) వాదులమని చెప్పుకుంటారు.

1942లో అఖిల భారత కిసాన్ కాంగ్రెస్ నిర్మాణానికి యీ ఆరు దక్షిణ భారత రైతు సంస్థలూ మూల విరాట్టు కావడం చాలా ముదావహం.

నేటి వరకూ రైతు సంఘంలో కమ్యూనిస్టులు చేసిన మోసాలను విద్రోహాలను దుశ్చేష్టలను పరిశీలించడం చేత, రైతుసంఘంలోనూ రైతు కాంగ్రెసులోనూ కమ్యూనిస్టులకు తావులేదన్న సంగతి; అటు రైతు అభిమానమున్న జాతీయ వాదులకే కాదు, యిటు జాతీయాభిమానులైన రైతులకే కాదు, సర్వప్రపంచానికి సుస్పష్టమయిపోయిందని మా దృఢ విశ్వాసం,

కమ్యూనిస్టు ఋషులు ముగ్గురూ-మార్క్స్, లెనిన్, స్టాలిన్‌లు- చెప్పిన కర్షక వ్యతిరేక భావాలను పరోక్షంగాగాని, బహిరంగంగా గాని అభిమానించని పూజించని కమ్యూనిస్టు కూలీవర్గనియంతృత్వాన్ని ఆశించి, దాని గురించి అవ్యక్తమైన మధురస్వప్నాలను కనని కమ్యూనిస్టు లేరనే మా నిశ్చితాభిప్రాయం!

ఇదే రైతు నాయకుల విషాదానుభవాలకు నీతివాక్యం!

మార్క్స్ చెప్పిన "భగవద్గీత" నూ దానిమీద మార్క్స్ శిష్య ప్రశిష్యకోటి వ్రాసిన సూత్రాలనూ భాష్యాలనూ విశ్వసించే కమ్యూనిస్టులు, నేడు ద్వంద్వముల మధ్య నిలబడి వున్నారు.

భారత కమ్యూనిస్టుకు...

తృత్వం సంగతి వేరుగా చెప్పనవసరంలేదు - పని చెయ్యడానికీ దాని చెప్పుచేతలలో వుండడానికే... అంగీకరించదనీ... అతని దృఢ విశ్వాసం!

వలసరాజ్యపు రైతాంగం చేతిపనివారలూ సామ్యవాద నిర్మాణాన్ని మహోత్సాహంతో ప్రారంభించడానికి ముందు రాజకీయ సామ్రాజ్యవాదాన్ని, రెండింటినీకూడా ఓడించాలి.

ఆర్థిక సామ్రాజ్యవాదాన్ని నాశనం చెయ్యాలంటే, ముందుగా, రాజకీయ సామ్రాజ్యవాదాన్ని పరాజయం పొందించడం గాని, కత్తెర బోనులో పెట్టి నొక్కిపెట్టడం గాని జరగాలి.

అయితే, జాతీయ ముక్తినీ జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించనంతవరకూ రైతుల ధనికవాదాన్ని విప్లవాత్మకంగా పడగొట్టడానికి ముందింజ వెయ్యలేరు

భారతదేశపు రైతు...ఎవరూ కూడా మరచిపోలేని సంగతులు యివి...

* * * *

ప్రపంచ సామ్రాజ్య వాదం ఉత్కృష్ట క్లిష్ట విషమ పరిస్థితులలో నున్నప్పుడు జాతీయ కాంగ్రెసు సామ్రాజ్య వాదానికి ప్రతికూలంగా ఒక సమరాన్ని ప్రారంభించిం

బ్రిటిష్ ప్రభుత్వం భారత జాతీయతమీద తన 'బిజిలీ' శక్తులను విసిరింది.

1905 విప్లవంలో రష్యన్ జాతీయతను 'ప్లెకానొవ్' ఎలా విద్రోహం ఆచరించాడో 1942 లో భారత జాతీయతకు కమ్యూనిస్టులు అలాగే విద్రోహం ఆచరించారు.

1870 - 72 లో ఫ్రెంచి విప్లవంలో యిలాంటి పరిస్థితులే ఏర్పడ్డాయి. అప్పుడు మార్క్సు యే విధానాన్ని అనుసరించాడో లెనిన్ వర్ణించాడు:

“కమ్యూన్‌కు కొన్ని నెలలు ముందునుండీకూడా,” ప్రభుత్వాన్ని కూలద్రోసే ప్రయత్నం నిరాశలోని అవివేక కార్యమే అవుతుంది, అని మార్క్సు పారిస్ కార్మికులను హెచ్చరిస్తూ వచ్చాడు;

* “రాష్ట్రం - విప్లవం” అనే పుస్తకంలో...

కాని, 1871 మార్చిలో కార్మికులు పోరాటంలోకి దిగక తప్పింది కాదు వారు విప్లవాన్ని ప్రారంభించారు.

కనబడుతున్న శకునాలు అనుకూలంగా లేకపోయినా మార్క్సు యీ వర్గ విప్లవానికి సుస్వాగతం చెప్పాడు*

మార్క్సు బాబుగా, తన పాండిత్యాన్ని అంతటినీ చూపిస్తూ 'యిది అకాల వుద్యమం' అనే ధోరణిలో పడిపోలేదు.

దీనిని 'స్వర్గంకోసం సంక్షోభింపచేయ్యటమే' అని వర్ణించాడు

ఆనాటి తిరుగుబాటులో మితిలేని ప్రాముఖ్యతతో నున్న చారిత్రాత్మకమైన ప్రయోగాన్ని మార్క్సు తన ముందు చూచాడు.

ఒక లక్ష కార్యక్రమాలూ ఒక కోటి చర్చలూ కన్న ప్రాముఖ్యం వున్న అనుభవంలోకి ఒక ముందడుగు యీ విప్లవం అని నిర్ధారణ చేశాడు.

నేటి భారత కమ్యూనిస్టులు రైతు, కూలీ వర్గాలకు జాతీయ విప్లవంలో పాల్గొన వద్దని సూచించిన ధోరణి యిచ్చిన సందేశం, ఆనాడు "ఆయుధాలు పట్టకుండా వుండవలసింది" అని 'ప్లెకానావ్' సూచించిన ధోరణికి తగినట్టే వున్నాయి

అయితే దేవుని దయవల్ల భారత ప్రజానీకం కమ్యూనిస్టుల మాటలను నమ్మి తమ జాతీయ సమరం పట్ల—ఆదే వారి వర్గ సమరం కూడా అవడం తటస్థించింది: ద్రోహాన్ని ఆచరించడానికి అంగీకరించ లేదు. జాతీయసమరానికి ప్రతికూలంగా కమ్యూనిస్టులు పన్నిన వ్యూహాలలో కి నడవడానికి అంగీకరించ లేదు.

పారిశ్రామికుల అందరినీ ఏకవర్గ నియంతృత్వానికి అంటే—కూలీ వర్గ నియంతృత్వానికి—నిర్నిబంధంగా బద్ధులను చెయ్యడానికి కమ్యూనిస్టులు కంకణం కట్టుకున్నారు.

కూలీ వర్గ నియంతృత్వం సామ్యవాదానికి అపరిత్యాజ్యమైన అనివార్యమైన సోపానం అని వారి భావం. కూలీవర్గ నియంతృత్వం లేకుండా సామ్యవాదం అంటే వారికి అగమ్య గోచరం!

---

*ఆనాడు మార్క్సు ప్రదర్శించిన ధోరణికి యీనాడు మన 'విప్లవం' పట్ల కమ్యూనిస్టులు ప్రదర్శించిన ధోరణికి ఎంత వ్యత్యాసం ఎంత ప్రతికూలతా వున్నాయి?

భారత రైతాంగం తన భావి భాగ్యాన్ని, శ్రేయస్సునూ హానిక్యాంతో అలాంటి కమ్యూనిస్టుల చేతుల్లో నుంచగలరేమో నిర్ణయించుకోవాలి.

రైతుల వర్గ సమరాలలో సముచిత పాత్ర నిర్వహించడానికేమి, రైతుల శ్రేయస్సును ఆకాంక్షించి, వారి సౌభాగ్యాన్ని ఆశించి, వారిని సేవించడానికేమి, కమ్యూనిస్టులకు తగిన అవకాశాలు లభించలేదని ఎవరూ వాదించలేరు.

రైతు నాయకులు వారికి అన్ని అవకాశాలూ యిచ్చారు. ఆరు సంవత్సరాలపాటు వారితో కలసి మెలసి ఏకమనస్సుతో సుపరిచిత మైత్రి సహకారంతో రైతురంగంలో కృషి సాగించారు.

రైతు నాయకుల విషాదానుభవం యొక్క గుణపాఠం యిది:

“మార్క్స్ చెప్పిన ‘కూలీవర్గ నియంతృత్వం’ అనే అసత్య ప్రాతిపదికలో సమూళితమైన మార్క్సిస్టు కమ్యూనిస్టులనుండి ఆశించడం వల్ల లాభం లేదు.”

రైతుల నిజమైన శ్రేయస్సుకోసం మేము పాటుపడగలిగినా నిశ్చయం.

అందుచేత విస్తృత భారత రైతాంగానికి యిదే మా హెచ్చరిక:

రైతాంగం శ్రేయస్సుకూ, చేతిపనుల వున్నతభావికీ, గ్రామసౌభాగ్యానికీ, జాతీయ సౌశీల్యానికీ, ప్రతికూలం, హానికరం అయిన కమ్యూనిస్టుల విధానాలనూ, వారి [illegible] సభలనూ, రైతులు అనుసరిస్తే — తమ వినాశనానికీ, తమ విధ్వంసనకూ, ఆహ్వాన గీతాలు పాడుకున్నారన్నమాట!

ధనికవాదానికీ అంతకంటె హీనమైన ప్రమాదాలకూ, చెదుపులకూ సుస్వాగతం చెప్తున్నారన్నమాట!

———



